# నాలుగు నవలలు

(“అపరాధ పరిశోధన” అందజేస్తున్న
పేరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బ్రతికొచ్చిన హంతకుడు

రచన: వసుంధర

## ఇంటర్వ్యూహం

రచన: వి. యస్. రావ్

## విమాన దోపిడి

రచన: భీమవరపు పురుషోత్తం

## రెడ్ బాక్స్

రచన: సుంకరి రాంప్రసాద్

ఎడారి కోయిల — ఆరవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—170
ఫిబ్రవరి, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1,

# బ్రతికొచ్చిన హతుడు

వసుంధర

గురునాథం ముతక ఖద్దరు పంచి వేసుకున్నాడు. దాని మీద పొట్టిచేతుల ఖద్దరు చొక్కా. జేబునిండా పాతకాగితాలు. ముక్కులాంటి ఓ పెన్ను. చూడగానే ఆకాలపు మనిషిలా వున్నాడు.

అతడు రోడ్డుమీద నడుస్తున్నవాడల్లా ఓ ఇంటి ముందాగి—"సీతాపతీ——....ఓ సీతాపతీ!" అన్నాడు.

ఆ ఇంటి తలుపులు తెరిచే వున్నాయి. గురునాథం పిలవగానే గుమ్మంలో ఓ యువకుడు ప్రత్యక్షమయ్యాడు.

అతడికి ముప్పైఏళ్ళుంటాయి. అప్పుడే ఇస్త్రీచేసి నట్లున్న తెల్లటి లాల్చీ, పరాయి వేసుకొన్నాడు. మనిషి కూడా పువ్వులా వున్నాడు.

"గురునాథంగారా—రండి, రండి...." అన్నాడతడు నవ్వుతూ.

గురునాథం నవ్వలేదు. ముందడుగు వెయ్యలేదు — "ఆదివారంనాడు ఇంటికొచ్చి డబ్బిస్తానన్నావ్? ఈవేళ

శనివారం—అంటే అన్నమాట దాటి వారం పూర్తి చేశావు. నన్నే నీ ఇంటికి రప్పించావ్?"

"అనుకోని ఇబ్బంది వచ్చిందండి—అన్న రోజుకో రోజుముందే శనివారంనాడు మొత్తం డబ్బంతా సిద్ధం చేసి బయల్దేరాలనుకుంటూండగా నాన్నగారు దిగారు. చెల్లెలి పెళ్ళికి అర్జంటుగా డబ్బు కావాలన్నారు. డబ్బు లేకపోతే పెళ్ళి ఆగిపోతుందన్నారు...."

"నీ దగ్గర డబ్బులేదుగా—లేదని చెప్పాల్సింది "

"ఉంటే లేదని ఎలా చెప్పేది?"

"నీ దగ్గరున్నది నీ డబ్బుకాదు. నా డబ్బు. నాకివ్వడానికి లేదంటున్నావు. నాన్నకి లేదనడానికి మొహమాటం ఎందుకూ?"

"నాన్న ఇవన్నీ నమ్మరు... చెల్లాయి పెళ్ళికి డబ్బివ్వడానికిష్టంలేదనుకుంటారు...."

"మరి నా సంగతేమిటి?"

"గురునాథంగారూ — ఒక్క వారం రోజులు ఓపిక పట్టండి. మీ డబ్బంతా పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తాను...."

"పువ్వులక్కర్లేదు. నా డబ్బు నాకు మామూలుగా ఇచ్చేస్తే చాలు. అదీ యిప్పుడే.... ఇక నేను ఒక్క క్షణం కూడా ఆగను...."

"గురునాథంగారూ—ఉన్నపళంగా డబ్బెక్కణ్ణించి తెచ్చేది? ఇలా లోపలకు రండి—మాట్లాడుకుందాం...." అన్నాడు సీతాపతి.

అతడలాగనడానికి కారణముంది. అప్పటికే వీధిలో తెలిసిన వారందరూ చుట్టూమూగి చోద్యంచూస్తున్నారు.

"నేను నీ యింట్లో అడుగుపెట్టను. నువ్వు మర్యాద, మాట నిలకడలేని వాడివి. నీవంటివాణ్ణి వీధిలోకి పిల్చి

మాట్లాడాలి—" అన్నాడు గురునాధం.

చుట్టూ జనాన్ని చూడగానే సీతాపతికి కోపం వచ్చింది—"గురునాధంగారూ—మాటలు మర్యాదగా రానివ్వండి...." అన్నాడు.

"ఏం మర్యాదయ్యా—" అంటూ జనంవైపు తిరిగాడు గురునాధం-"అయ్యా! మీరే చెప్పండి. అయిదు సంవత్సరాలక్రితం నా భార్యపోయిన ఇన్సూరెన్సు డబ్బులోంచి—పదివేల రూపాయలు అప్పుగా ఇచ్చానితడికి. డిపాజిట్ చేస్తే ఈపాటికది రెట్టింపయ్యుండేది. నేనితణ్ణి వడ్డీ అడగడంలేదు. సాటిమనిషిని అవసరంలో ఆదుకున్నాను. ఆర్నెల్లలో తీర్చేస్తానన్న పెద్దమనిషి నన్నిదే పనిగా తిప్పుతున్నాడు. సహనానిక్కూడా హద్దుంటుంది. మీరే చెప్పండి. ఇతడు మర్యాదివ్వతగ్గ మనిషేనా?"

జనంలోంచి ఓ పెద్దమనిషి ముందుకొచ్చి "సీతాపతీ-ఈ పెద్దమనిషి అప్పు తీర్చలేదూ—ఏం మనిషివయ్యా?" అన్నాడు.

"మధ్యతరగతివాళ్ళం — ఏవో ఇబ్బందులు...." నసిగాడు సీతాపతి.

"ఏం ఇబ్బందులండీ—నా దగ్గర అప్పుతీసుకున్నాక ఇతగాడికి రెండుసార్లు ప్రమోషనొచ్చింది. ఊళ్ళో రెండుచోట్ల స్థలాలు కొన్నాడు. పెళ్ళానికి నగలు చేయించాడు. మనిషి జల్సాలేమీ తగ్గలేదు. ఏడాదిక్రితం కాశ్మీరుకూడా వెళ్ళొచ్చాడు. ఇన్నాళ్ళూ మంచిగా ఊరుకున్నాను. ఇక నా సహనం చచ్చిపోయింది...."

"వడ్డీలేకుండా పదివేలప్పిచ్చిన మనిషినిలా తిప్పడం న్యాయంకాదు. నువ్వు మన వీధి పరువు తీసేశావు...." అన్నాడు పెద్దమనిషి.

"అయ్యా! నేనంత దుర్మార్గుణ్ణేం కాదు. చక్కగా స్థలాలు వస్తుంటే — నా డబ్బుకేమి లే — తర్వాతివ్వచ్చులే అని ఈ గురునాథంగారే నన్ను ప్రోత్సహించి స్థలాలు కొనిపించారు నాచేత. ఇంతకాలం నన్నెప్పుడూ డబ్బు కోసం నొక్కించలేదు. ఉన్నట్లుండి ఏదో అయిం దీయనక...." అన్నాడు సీతాపతి.

"నువ్వు నా మాట వినే బుద్ధిమంతుడివైతే-అప్పుడు విన్నట్లే ఇప్పుడూ వినొచ్చుగా. పెద్దవాన్నని మానేశావు. ఇప్పుడు కావాలంటే యివ్వలేం?"

"ఉన్నపళాన ఎక్కణ్ణించి తేగలను?"

"నీ పెళ్ళాం మెడలో నగలమ్మో లేదా కొన్న స్థలా అమ్మొ. వాటి ధర అప్పుడే రెట్టింపు పెరిగింది కొన్న దానికి. నా డబ్బే ఎదుగూ బొదుగూ లేకుండా వుండి పోయింది—" అన్నాడు గురునాథం.

"మీ దగ్గర డబ్బు తీసుకోడం నేను చేసిన పెద్ద తప్పు...." అన్నాడు సీతాపతి.

"నువ్వేం చేశావో నాకు తెలియదు. ముందు నా డబ్బు నాకు కావాలి....లేకపోతే?"

"లేకపోతే?"

ఏదో అనబోయి—"ఎందుకులే!?" అని ఊరుకున్నాడు గురునాథం.

"నేను మీకిప్పట్లో డబ్బివ్వను. ఏం చేస్తారో చెప్పండి...." అన్నాడు సీతాపతి మొండిగా.

"ఏం చేస్తాను? నీకు డబ్బు, ప్రమోషను—ఎలా వస్తున్నాయో—ప్రపంచానికి చాటిచెబుతాను...."

"చెప్పుకోండి—నాకేం భయంలేదు...."

"సిగ్గూశరం లేనివాడివి, నీకు భయమేమిటి? నేను

సంతోషిస్తున్నది నీ భార్య గురించి, నీ ప్రగతికోసం ఆమెనెలా ఉపయోగించుకుంటున్నావో లోకానికి తెలిస్తే నువ్వు భరించినా ఆమె భరించలేక పోవచ్చు...."

చుట్టూ చేరిన జనమంతా మ్రాన్పడిపోయారు.

సీతాపతి క్షణకాలం నిశ్చేష్టుడై — వెనువెంటనే తేరుకొని — "గురునాథం!" అని గట్టిగా అరిచాడు.

అప్పుడు గురునాథం చొక్కా కాలరు సీతాపతి చేతిలో వుంది.

"వదులు — వెధవ పనులు చేసినప్పుడు లేని సిగ్గు — చేశావని అంటే వచ్చిందా? మర్యాదగా నా బాకీ తీర్చు...." అన్నాడు గురునాథం.

"తీర్చేస్తాను ..." అన్నాడు సీతాపతి.

"ఇప్పుడే — ఈ క్షణంలోనే —" అన్నాడు గురునాథం.

"సరే—" అంటూ లోపలకు వెళ్ళాడు సీతాపతి.

"చూడండి-ఇంట్లో డబ్బుంచుకునే లేదంటున్నాడు" అన్నాడు గురునాథం.

జనంలో గుసగుసలు ప్రారంభమయ్యాయి.

సీతాపతి ఆ వీధిలో పచ్చగా ఉన్నవారిలో ఒకడు. అందరితోనూ స్నేహంగా వుంటాడు. అతడి భార్య చాలా అందంగా ఉంటుంది.

అతడంటే అంతో యింతో అందరికీ అసూయ వుంది. ఇలాంటి సమయాల్లోనే అది బయటపడుతుంది.

గురునాథం చెప్పదల్చుకున్నదేమైనా అంతా ఊహించడానికి ప్రయత్నిస్తున్నారు. అందరి ఊహాలూ ఒకేదారిలో పయనిస్తున్నాయి.

సీతాపతి లోపల్నుంచి వచ్చాడు.

అతడి చేతిలో డబ్బులేదు. కత్తి వుంది. ఆ కత్తి తళతళ మెరుస్తోంది.

"ఒరేయ్—డబ్బిచ్చాను గదా అని నోటికొచ్చినట్లు పేలుతావుట్రా—నీ ప్రాణం తీస్తాను. నా గురించి లేని పోని కథలల్లినందుకు నీకిదే శిక్ష...."

చుట్టూ చేరిన జనం కలగజేసుకుని ఆపకపోతే అప్పుడు హత్య జరిగేదే!

"నేను పోలీసులకు ఫిర్యాదు చేస్తాను. అయ్యా! మీరే అందుకు సాక్ష్యం—దరిద్రుడికి డబ్బిచ్చి—ప్రాణాల మీదకు తెచ్చుకున్నాను...." అన్నాడు గురునాథం కోపావేశంతో.

అక్కడున్న పెద్దమనిషి ఇద్దర్నీ శాంతపరిచి గురునాథంతో—"అయ్యా! ఇంతకాలం మీరు సహనం వహించారు. ఈ రోజు రాత్రిదాకా ఓపికపట్టండి. తెల్లారేలోగా మీ బాకీ యిప్పించే పూచీ నాది-...." అన్నాడు.

"తెల్లారేదాకా నువ్వు బ్రతికుంటే—బాకీ సంగతి అప్పుడు చూద్దాం—" అన్నాడు సీతాపతి కసిగా.

పెద్దమనిషి అతణ్ని మందలించి గురునాథాన్ని సమాధానపర్చి—"వ్యవహారం పోలీసులదాకా పోనివ్వకండి. ఆవేశంలో అనే మాటలకర్థంలేదు. నేను మీకు మాటిస్తున్నాను—" అన్నాడు.

## 2

"ఇంకా ఎన్నాళ్ళిలాగో చెప్పు సుజాతా!" అన్నాడు రఘు బాధగా.

"నేనేం చేసేది? నాన్నకు నువ్వు నచ్చచెప్పాలి.." అంది సుజాత.

ఇద్దరూ పార్కులో ఒకరికొకరెదురుగా కూర్చున్నారు.

సుజాత అందంగా వుంది. పార్కులో మొక్కలన్నీ పూలుపూస్తే—ఆమె పార్కుకు పూసిన పువ్వులా వుంది.

రఘు అందంగా లేడు. కానీ చూడగానే ఖరీదైన మనిషని తెలిసిపోతుంది.

"మీ నాన్నకు నేనంటే యిష్టంలేదు. డబ్బున్న వాళ్ళు పేదపిల్లల్ని పెళ్ళిచేసుకోరని ఆయన నమ్మకం."

"మా నాన్న పేదవాడు కాదుగా...."

"మా యింట్లో మీ గురించి పేదవాళ్ళనే చెప్పుకుంటారు...."

"నాన్న దగ్గర యాభై వేల రూపాయల క్యాషుంది. నాన్నకు నెలజీతం రెండువేల అయిదువందలు. లక్ష రూపాయల విలువచేసే స్వంతిల్లుంది. మేము పేదవాళ్ళమా?" అంది సుజాత ఉక్రోషంగా.

"చూడు—నా ఇంపోర్టెడ్ కారు మూడు లక్షలు. నువ్వు చెప్పినవన్నీ కలిపితే ఆ కారుకే సరిపోవు... మా యింట్లో మొత్తం మూడు కార్లున్నాయి...."

సుజాత నిట్టూర్చి—"అంటే నీ అభిప్రాయంలో కూడా మేము పేదవాళ్ళన్నమాట...." అంది.

"రేపు మన పెళ్ళయ్యాక నీ అంతస్తు మారిపోతుంది. అప్పుడు నీ అభిప్రాయంలో కూడా మీ నాన్న పేదవాడవుతాడు—తెలుసా?"

సుజాతకతడి మాటలు కోపానికి బదులు సంతోషాన్ని కలిగించాయి. నెమ్మదిగా—"మన పెళ్ళెప్పుడవుతుందో రఘూ!" అందామె.

"రేపని అన్నానుగా ...""

"రేపా?"

"అవును రేపే!"

"నాన్న ఒప్పుకోనిదే అదెలా సాధ్యం?"

"మీ నాన్నకోసం ఆగే వ్యవధిలేదు. రేపు రాత్రి నేను మధ్యప్రదేశ్ వెళ్ళిపోతున్నాను. ఒక ఏడాదిదాకా తిరిగిరాను. నాతోపాటు నిన్ను తీసుకునిపోవాలని నా అయిడియా. అక్కడ నేనెలాగుంటున్నదీ మా వాళ్ళకు తెలియదు. ఒక సంవత్సరంపాటు కలిసి కాపురం చేశాక మననాదేవుడు కూడా విడదీయలేడు. ఏమంటావ్?" అన్నాడు రఘు.

"రేపంటే నిజంగా రేపేనన్నమాట? ఇంత తక్కువ వ్యవధిలో నాన్నను ఒప్పించడం సాధ్యంకాదు...." అంది సుజాత.

"ఎందుకు సాధ్యంకాదు? మనసుంటే మార్గంతోచక పోదు...."

"నాకే మార్గమూ తోచడంలేదు...."

"స్నేహితురాండ్రతో పిక్నిక్‌కి వెడుతున్నామని చెప్పు. రావడానికి వారం రోజులు పడుతుందని చెప్పు. వారం రోజుల్లో ఆయనకు త్తరం అందుతుంది...."

"నేను లేందే నాన్న క్షణంకూడా బ్రతకలేడు. అసలాయన బ్రతుకుతున్నదే నా కోసం. నాకు మాత్రం యెవరున్నారు నాన్న తప్ప! ఆయన అనుమతిలేకుండా పెళ్ళిచేసుకుంటే నన్ను నేనే క్షమించుకోలేను-" అంది సుజాత.

"సుజాతా! నీకు వయసొచ్చింది. ఇప్పుడు నీకాక్కవల సింది నాన్నకాదు— నేను...." అన్నాడు రఘు.

"నీకోసం నాన్నను వదులుకోలేను...."

"పోనీ.... నాన్నకోసం నన్ను వదులుకుంటావా?"

సుజాత వెంటనే—"నేను నిన్ను వదులుకుంటే అది నీకిష్టమేనా?" అంది.

"ఇష్టపడేవాడినైతే నీ వెంటపడి ఎందుకు తిరుగుతాను? నీకోసమే యెంతో కష్టపడి పథకం వేశాను. నాకోసం మధ్య ప్రదేశ్‌లో పని సృష్టించుకున్నాను. అక్కణ్నుంచి ఏడాదిదాకా తిరిగిరాకుండా ఉండడానికి బలమైన కథ అల్లాను. అన్నీ ఫలించాయి. నా పథకం యెంత బలమైనదంటే—ఇప్పుడు నువ్వొచ్చినా రాకున్నా నేను మధ్య ప్రదేశ్ వెళ్ళక తప్పదు. అక్కడో ఏడాదిపాటు అజ్ఞాతవాసమూ తప్పదు. నన్నన్యాయం చేయకు సుజాతా! ప్లీజ్ ........ వేడుకుంటున్నాను. రేపుదయం మనిద్దరం గుడిలో పెళ్ళిచేసుకుందాం. రాత్రికి ఊరువిడిచిపోదాం. అన్నీ ఆ తర్వాత అవే సర్దుకుంటాయి...." అన్నాడు రఘు.

సుజాత కాసేపు మాట్లాడలేదు.

ఆమె ఏం చెబుతుందోనని రఘు ఆత్రుతగా యెదురు చూస్తున్నాడు.

కాసేపటికి సుజాత పగడాల పెదవులు విచ్చుకున్నాయి "రఘూ! నేను నాన్నను ఒప్పిస్తాను. మన పెళ్ళి నాన్న అనుమతితో జరుగుతుంది ..." అందామె.

"ఆయన ఒప్పుకోకపోతే?"

"నేను ఆత్మహత్య చేసుకుంటానని బెదిరిస్తాను...."

"తనే ఆత్మహత్య చేసుకుంటానని ఆయన నిన్ను బెదిరిస్తే?"

"ఇద్దరం చచ్చిపోదామని అంటాను తప్ప—నా పట్టు వదలను—"

"వెరీగుడ్ సుజాతా! నువ్వనుకున్నది సాధించగలవనే

నా నమ్మకం. రేపుదయం ఎనిమిదింటికి జనార్దనస్వామి ఆలయంలో అన్ని ఏర్పాట్లతో నీ కెదురు చూస్తూంటాను. మీ నాన్న నాకు స్వయంగా కన్యాదానం చేస్తే అదో తృప్తి నాకు...."

"సరే ..." అని లేచింది సుజాత.

"రేపు నువ్వు గుడికి రాకపోతే బహుశా మనం మళ్ళీ కలుసుకోము—" అన్నాడు రఘు.

"నీకా అనుమాన మెందుకు?"

"అనుమానం కాదు—భయం!"

సుజాత నవ్వి—"భయపడకు.... నేను నీ జీవిత భాగస్వామిని కాబోతున్నాను—" అంది.

అప్పుడామె అభయమిస్తున్న దేవతలా వుంది.

# 3

చలపతి కుర్చీలో కూర్చున్నాడు. ఆయన కట్టుకున్న తెల్లటి పంచ కొద్దిగా మాసినట్లు తెలుస్తోంది. ఒంటిమీద చొక్కా లేదు. కానీ భుజంమీద తువ్వాలుంది.

గురునాథం ఆయనకెదురుగా నిలబడి వున్నాడు.

"చెప్పండి బావగారూ!" అన్నాడు చలపతి.

"చెబుతాను కానీ చెప్పేముందు నన్ను కాస్త కూర్చోమనైనా అనండి బావగారూ—" అన్నాడు గురునాథం.

"కూర్చోమని ఎలాగనేది? వున్నదొక్కటే కుర్చీ. మిమ్మల్ని కూర్చోమంటే నేను లేచి నిలబడాలి. మీకులా ఆరోగ్యవంతుణ్ణి కాను నేను—పట్టుమని పదిక్షణాలు నిలబడలేను. మిమ్మల్ని నేలమీద కూర్చోమనడం భావ్యం కాదు గదా...." అన్నాడు చలపతి.

"బాగానే వుంది. రెండో కుర్చీ కొనకూడదని సిద్ధాంతమా?"

"అబ్బాయి పెళ్ళి చేసేదాకా ఇంట్లో ఏమీ కొన కూడదని మా ఆవిడ శాసించింది...."

"అలాగని ఇంటికొచ్చిన వాళ్ళందర్నీ నిలబెట్టే మాట్లాడతారా?"

"అంతే మరి—ఒక్కగానొక్క కొడుకు. నాకలా సాగుతోంది...." అంటూ నవ్వాడు చలపతి.

చలపతి, గురునాథం చిన్ననాటి స్నేహితులు. దూరపు బంధువులు. చలపతి కొడుక్కి టీవలే బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. అతడి పేరు నారాయణ.

నారాయణ బుద్ధిమంతుడు. చిన్నప్పట్నించీ గురునాథానికి బాగా తెలుసు. అతడు, సుజాత ఒకరంటే ఒకరిష్టపడేవారు. సుజాతను పెళ్ళిచేసుకోవడం నారాయణకిష్టమే!

చలపతి ఆరోగ్యం నిజంగా మంచిదికాదు. గత రెండు సంవత్సరాలుగా ఆయనకు లేచి తిరగడం కష్టంగా ఉంటోంది. ఎలాగో ఆఫీసుకు వెళ్ళొస్తున్నాడు. మనిషి మంచివాడనీ, సిన్సియర్ ఆయనాఫీసులో గౌరవిస్తున్నారు. నారాయణకుద్యోగం వచ్చింది కాబట్టి వాలంటరీ రిటైర్మెంట్ తీసుకుందామా అనాయన అనుకుంటున్నాడు.

గురునాథం దగ్గర చలపతికి బాగా చనువెక్కువ. అందువల్ల ఆయనేమన్నా—గురునాథం ఏమీ అనుకోడు. అయితే కొడుకు పెళ్ళి గురించి చలపతి చాలా కలలు కంటున్నాడు.

ఒక్కడే కొడుకు కాబట్టి కానీ — చలపతి బాగా పేదరికం అనుభవించాడనే చెప్పాలి. కడుపు మాడ్చుకుని కొడుకును చదివించేడాయన.

ఇప్పుడు చలపతి ఆడపిల్లలు లేని తండ్రిగా, ఒకే ఒక్క కొడుకు తండ్రిగా—అందర్నీ ఆకర్షిస్తున్నాడు. ఆయన ఆశలు పెరుగుతున్నాయి.

ఉద్యోగంలో పైసకూడా లంచం తీసుకోని చలపతి కొడుకు పెళ్ళితో తనొక్కసారిగా భాగ్యవంతుడైపోవాలనుకుంటున్నాడు. ఆ కారణంగా ఇంట్లోకి ఏమీ కొనడం లేదు. కాబోయే వియ్యంకుడు తన యింటిని ఫర్నిచర్ తోటీ, ఖరీదైన ఇతర వస్తువులతోటీ నింపేస్తాడని ఆయన ఆశ. అందులోనూ నారాయణది బ్యాంకుద్యోగం.

చలపతికీ, గురునాధానికీ యిక్కడే పేచీ వచ్చింది.

"నన్ను కట్నం అడక్కు. నీకు నీ కొడుకులాగే నాకూ నా కూతురు తప్ప ఇంకెవరూ లేరు. నాకున్నదంతా దానికే చెందుతుంది. నాకు కట్నమివ్వడం ఇష్టం లేదు. అది నా కూతుర్ని చిన్నబుచ్చడమే అవుతుంది-" అన్నాడు గురునాధం ఆయనతో గతంలో.

"ఆడపిల్ల చిన్నబుచ్చుకోవడమేమిటి? మన సంప్రదాయమేలాగుంటే అలా చేయాలి-" అంటాడు చలపతి. తన కొడుక్కి పెద్ద మొత్తం కట్నంగా తీసుకున్నట్లు నలుగురికీ చెప్పుకోవాలని ఆయన సరదా. అందుకు తగ్గట్టే నారాయణకు మంచి మంచి సంబంధాలు వస్తున్నాయి.

అయితే చలపతికి సుజాతను కోడలిగా చేసుకోవడం ఇష్టమే! అందుకు రెండు కారణాలున్నాయి.

సుజాత బుద్ధిమంతురాలు. చిన్నప్పట్నించీ చలపతికి బాగా తెలుసు. మావయ్యా అంటూ చనువుగా ఇంట్లో తిరుగుతుంది. చలపతి భార్య లక్ష్మీదేవికి కూడా సుజాత అంటే యిష్టం. ఇది మొదటి కారణమైతే రెండో కారణం గురునాధం. ఆయనకూ కూతురుతప్ప ఇంకెవ్వరూ

లేరు. తను సంపాదించేదంతా ఆయన కూతురికే ఇస్తాడు. ఆయన బాగా సంపాదిస్తున్నాడు కూడా! బయటి వాళ్ళెవరైనా పెళ్ళికి కాస్త కట్నమెక్కువిచ్చినా తర్వాత అలా యిస్తారని నమ్మకంలేదు.

అందువల్ల చలపతి నారాయణ కితర సంబంధాలు ఖాయం చేయడంలేదు. గురునాధంలో మార్పుకోసం ఎదురు చూస్తున్నాడు.

ఆయనకు యాభై వేలు కట్నం కావాలి. పదివేలు అడ్వాన్సివ్వాలి.

"విశేషాలకేముంది బావగారూ! మా అమ్మాయిని మీ అబ్బాయికి చేసుకోమని చెప్పడానికి వచ్చాను—" అన్నాడు గురునాధం.

"చెప్పడం కాదు—అడగాలి!" అన్నాడు చలపతి సవరిస్తూ.

"పోనీ—అలాగే అనుకోండి...."

"పదివేలు అడ్వాన్సు తెచ్చారా?"

"తేలేదు...."

"అడ్వాన్సు లేకుండా పెళ్ళిమాటలేమిటి?"

"బావగారూ—పెళ్ళి వ్యాపారంకాదు. రెండు జీవితాలను ముడివేసే ఈ సంబంధంలో వ్యాపారం మాటలు నా మనసును బాధపెడతాయి. నారాయణ సంతలోని పశువూ కాదు. నా కూతురు అమ్ముడుపోని అప్రయోజనకర విశేషమూ కాదు. వీళ్ళిద్దరూ ఒకరంటే ఒకరిష్టపడుతున్నారు. వెంటనే వీళ్ళ పెళ్ళి జరిపించడం మంచిది" అన్నాడు గురునాధం.

"కొడుకు పెళ్ళికి కట్నమడిగితే వ్యాపారమంటారేమిటి? అది మన సంప్రదాయం...." అన్నాడు చలపతి.

"మీరు సంప్రదాయమంటున్న విశేషం చట్టరీత్యా నేరం...."

"బావగారూ — ఈ మాటలనేది కట్నమివ్వలేని వాళ్ళు. మీవంటివాళ్ళకి తగ్గమాటలు కావివి. కట్నం నేరమేమిటి? మన దేశంలో జరిగే పెళ్ళిళ్ళలో కట్నం లేకుండా జరిగేవెన్ని?"

"మిగతావాళ్ళ సంగతి నాకెందుకు? సుజాత పెళ్ళి మాత్రం కట్నం లేకుండానే జరుగుతుంది...."

"కట్నం లేకుండా దాన్నెవడు చేసుకుంటాడు?" అన్నాడు చలపతి నిరసనగా.

"మీకు తెలియదేమో — రఘు అని ఓ గొప్పింటి కుర్రాడు దాన్ని పెళ్ళిచేసుకుంటానని వెంటబడుతున్నాడు...."

"రఘు అంటే ఎవరు?"

గురునాథం వివరాలు చెప్పాడు.

చలపతి తెల్లబోయి — "అలాంటివాళ్ళు సుజాతనెందుకు చేసుకుంటారు? ఆ కుర్రాడు మోసంచేస్తున్నాడేమో...." అన్నాడు.

"మోసంచేసేవాడైతే సుజాతతో మాట్లాడతాడు కానీ నన్నెందుకు కలుసుకుంటాడు? కుర్రాడు మర్యాదస్తుడు. నన్ను కలుసుకుని మాట్లాడాడు. తన తలిదండ్రులొప్పించే బాధ్యత నాదేనన్నాడు. నేనొప్పించలేకపోతే గుళ్ళో పెళ్ళిచేసుకుంటానన్నాడు—"

"అయితే మీరేం చేశారు?"

"బావగారూ — అంతస్తుల్లో వాళ్ళకు మనం సరిపోలం. వాళ్ళు కావాలని మన పిల్లను చేసుకున్నా — ఏదో రోజున అక్కడ చిన్నచూపు చూస్తారు. ఏదో తాత్కా-

లి కాలేశంలో పుట్టిన ఆకర్షణాప్రేమ అని పేరుపెట్టి-దాన్ని ఆ రఘు పెళ్ళిచేసుకున్నా — భవిష్యత్తులో అదెక్కడ సుఖపడదని నాకు కచ్చితంగా తెలుసు. మన స్థాయికి తగ్గ సంబంధమే చేసుకోవాలి. బావగారూ! అన్నివిధాలా మనం దగ్గర కావలసిన వాళ్ళం. దగ్గరయ్యే టప్పుడు కట్నం ప్రసక్తి తీసుకొచ్చి—దూరం పెంచ కండి—" అన్నాడు గురునాథం.

చలపతికి కోపం వచ్చింది. ఆయన కట్నం లేనిదే పెళ్ళి ప్రసక్తి తీసుకుని రావద్దని నిక్కచ్చిగా చెప్పే శాడు.

"అయితే నా మాటకూడా వినండి బావగారూ! మీరు నా వరుతులమీద ఈ పెళ్ళికి ఒప్పుకోండి. లేదా ఈ రాత్రికే నేనాత్మహత్య చేసుకుంటాను. ఆ పాపం మీదే! రాత్రి తొమ్మిదిగంటలలోగా ఏ కబురయే నాకు చెప్పండి.... —లేకుంటే ఇకే మన ఆఖరి చూపులు...."

"చాలా బాగుందండీ! పెళ్ళి సంబంధానికొచ్చి ఇలా మాట్లాడిన వాళ్ళ గురించి నేనెక్కడా వినలేదు. కూతురి పెళ్ళికి డబ్బుండీ కట్నమివ్వడమిష్టంలేక—చావదల్చు కుంటే అది మీ కర్మ. ఎవరి కర్మకెవరు కర్తలు?" అన్నాను చలపతి.

"ఎవరి సంగతెలాగున్నా — నా కర్మకు మాత్రం మీరే కర్తలు?"

చలపతి ఆశ్చర్యంగా ఆయన వంక చూసి—"మీ ఆరోగ్యం సరిగ్గా ఉందా? ఈ రోజు మీ పద్ధతి, ప్రవర్తన చాలా విచిత్రంగానూ, కొత్తగానూ ఉన్నాయి" అన్నాడు.

"చెప్పానుగా! ఈ రాత్రి తొమ్మిది గంటలలోగా మీ నిర్ణయం నాకు తెలియకపోతే ఇవే మన ఆఖరి చూపులు...." అన్నాడు గురునాథం.

"సరే—అయితే రాత్రి తొమ్మిదిదాకా ఎందుకు? ఇప్పుడే నా నిర్ణయం చెబుతున్నాను. ఇవే మన ఆఖరి చూపులు!" అన్నాడు చలపతి.

"అంత తొందరగా నిర్ణయం తీసుకోకండి. నా చావుకి రాత్రి తొమ్మిదిదాకా వ్యవధి నివ్వండి" అన్నాడు గురునాథం.

## 4

ఆయన పేరు వసంతరావు. ఖరీదైన సూట్లో ఉన్నాడాయన. విశాలమైన ఎయిర్ కండిషన్డ్ గదిలో—ఎగ్జిక్యూటివ్ చెయిర్లో కూర్చుని ఏదో ఫైలు తిరగేస్తున్నాడాయన.

ఆ సమయంలో బల్లమీద టెలిఫోన్ మ్రోగింది.

"హలో...."

"సార్....ఎవరో గురునాథంగారుట....అర్జంటుగా మిమ్మల్ని కలుసుకోవాలంటున్నారు...."

"సరే—లోపలకు పంపు...." అన్నాడు వసంతరావు.

రెండునిముషాల్లో ఆ గదిలో ప్రవేశించాడు గురునాథం.

"రండి—కూర్చోండి...." అన్నాడు వసంతరావు వినయంగా.

గురునాథం హుందాగా ముందుకు వచ్చి ఓ కుర్చీలో కూర్చున్నాడు.

కుర్చీకి—వసంతరావుకి మధ్య విశాలమైన బల్ల ఉంది. అది వారిరువురికీ మధ్యమార్గానికి సూచనలా వుంది.

"నా పేరు గురునాథం—" అన్నాడు గురునాథం.

"చెప్పండి-" అంటూ ఫైలుమూసి తన టేబిలుమీద పడేశాడు వసంతరావు.

"మీ అబ్బాయి రఘు నా కూతురు సుజాతను ప్రేమించాడు. పెళ్ళిచేసుకుంటానంటున్నాడు...."

గురునాథం ఇంకా ఏదో చెప్పబోతూండగా—"మా రఘు మంచివాడు, అమాయకుడు, ఇది ఆసరాగా తీసుకుని చాలామంది ఆడపిల్లల తలిదండ్రులు—వాడిని బుట్టలో వేసుకోవాలని చూస్తున్నారు—మా అబ్బాయికి త్వరగా పెళ్ళిచేయాలనే నా ఉద్దేశ్యం. అయితే వియ్యానికైనా కయ్యానికైనా సమఉజ్జీ కావాలంటాను, అందుకోసం యెదురుచూస్తున్నాను. వెతుక్కుంటూ మీరొచ్చారు. చాలా సంతోషం. మీ వివరాలు చెప్పండి—" అన్నాడు వసంతరావు.

"నా వివరాలెందుకు?" అన్నాడు గురునాథం.

"నేను కోడలిగా చేసుకునేది మీ అమ్మాయిని. సుజాతను కాదు ..." అన్నాడు వసంతరావు.

"ముందు నేను చెప్పేది వినండి మీరు...."

"మీ వివరాలు చెప్పేకనే మీ మిగతా మాటలు వింటాను "

గురునాథం తన గురించి చెప్పుకున్నాడు.

వసంతరావు ఓసారి రూమంతా కలయజూసి—"అంటే మీ యావదాస్తీ కలిపి—ఈ గదిలో నాలుగో వంతుండవచ్చు—" అన్నాడు.

"వసంతరావుగారూ—నేనిక్కడకు ఆస్తుల బేరీజు వేయడానికి రాలేదు...." అన్నాడు గురునాథం.

"కానీ నాకా అవసరముంది—" అన్నాడు వసంత

రావు.

"మీ అబ్బాయిని నా అల్లుడిగా చేసుకునే ఉద్దేశ్యం నాకు లేదు. ఇది విన్నాకనైనా నా మాటలు పూర్తిగా వినండి—" అన్నాడు గురునాథం.

వసంతరావు కళ్ళు హఠాత్తుగా కలిగిన ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

"అయితే మీరిక్కడికెందుకొచ్చినట్లు?"

"మిమ్మల్ని బెదిరించడానికి!"

"ఏమని?"

"మీ రఘు మళ్ళీ మా అమ్మాయి జోలికి రాడని హామీ యివ్వాలి. ఇవ్వకపోతే నేను చేయవలసింది చేస్తానని చెప్పడానికే వచ్చాను...."

"ఏం చేస్తారు?"

"అయ్యా! మధ్యతరగతి వాళ్ళలో మర్యాదగా బ్రతుకుతున్నవాణ్ని. తలెత్తుకు తిరుగుతున్నవాణ్ని. మా యింట్లో మీ రఘు మర్యాదగానే ప్రవేశించాడు. మా అమ్మాయితో మర్యాదగానే ప్రవర్తించాడు. మా అమ్మాయిని పెళ్ళిచేసుకుంటానని నన్నే అడిగాడు. ఆస్తులూ, అంతస్థులూ, కులాలూ వంటివి తనకడ్డురావనీ— పెద్దల నెదిరించైనా ఈ పెళ్ళి చేసుకుంటాననీ నాతో అన్నాడు. అందుకే నేను మీ దగ్గరకు వచ్చాను...."

"మీరు చెప్పదల్చుకున్నదేమిటి?"

"అయ్యా! మీ జీవితవిధానం వేరు. మా జీవితవిధానం వేరు. మీ పద్ధతులు వేరు, మా పద్ధతులు వేరు. మీతో వియ్యమందితే నా ఆస్తి చిన్నబోతుంది. వ్యక్తిత్వం చిన్నబోతుంది. ఫలానా గురునాథం వలవేసి భాగ్యవంతుడి కొడుకును పట్టాడన్న ప్రతీతి వస్తుంది. ఇవన్నీ నేను

భరించలేను. అందుకే నా అంతస్తుకు తగ్గ సంబంధం సుజాతకు చూశాను. స్థిరపరిచాను. అయితే మా మధ్య తరగతివాళ్ళకు కొన్ని నైతిక విలువలున్నాయి. ప్రేమ పేరు చెప్పి రఘు మా అమ్మాయిని మోసగించలేదు. తప్పటడుగు వేయనివ్వలేదు. అతడి సంస్కారాన్ని నేనభినందిస్తున్నాను. కానీ అతడీక్షణం నుంచీ సుజాతను మర్చిపోవాలి. గతాన్ని తవ్వుతూ దానివెంటపడకూడదు. అందువల్ల నా కూతురు కాపురంలో నిప్పుగవ్వలు లేస్తాయి. సుజాతకు లేని మచ్చలు వస్తాయి. రఘు విషయంలో మీరు నాకా హామీ యివ్వాలి. అందుకే రాత్రి తొమ్మిది గంటలవరకూ వ్యవధి...."

వసంతరావు చిరాగ్గా-"నేను హామీ యివ్వకపోతే?" అన్నాడు.

"ఆత్మహత్య చేసుకుంటాను. కారణాలు కాగితంమీద వ్రాసిపెడతాను...."

వసంతరావు నవ్వి — "అందువల్ల పోయేది మీ ప్రాణాలే—నా పరువుకాదు—" అన్నాడు.

"ఒక ఆడపిల్ల తండ్రిమాటలు విని నవ్వకండయ్యా! అప్పుడు నాకు మీరు క్రూరులనీ, దుర్మార్గులనీ అనిపిస్తుంది. నా బాధనర్థంచేసుకోండి. మీ అబ్బాయి నదుపు చేయండి—" అన్నాడు గురునాథం.

ఏమనుకున్నాడో—"నేను మా రఘుతో మాట్లాడతాను. మీ సహృదయతనభినందిస్తున్నాను. నేనేమైనా పొరపాటుగా మాట్లాడి వుంటే మన్నించండి—" అన్నాడు వసంతరావు.

గురునాథం ఆయనవద్ద సెలవు తీసుకున్నాడు.

# 5

"నువ్వు సుజాతను ప్రేమిస్తున్నావా?" అన్నాడు వసంతరావు.

"సుజాత నా స్నేహితురాలు...." అన్నాడు రఘు.

"స్నేహమంటే అదెలాంటిది?"

"నిర్మలమైనది_" అన్నాడు రఘు.

"భావ చాలా బాగుంది_" అని నవ్వి_"నువ్వా పిల్లను పెళ్ళిచేసుకుంటానన్నావుటగా?" అన్నాడు వసంతరావు.

"ఎవరు చెప్పారు?"

"సుజాత తండ్రి!"

"అంటే గురునాథంగారు మీ దగ్గరకొచ్చారన్న మాట_" అన్నాడు రఘు నెమ్మదిగా నిట్టూర్చి.

"నువ్వా పిల్లను పెళ్ళిచేసుకుంటానన్నావా?"

"లేదు_"

"మరాయనలా ఎందుకు చెప్పాడు?"

"ఈ ప్రపంచంలో మంచితనాన్ని లుసుగా తీసుకునే వారు చాలామంది వుంటారు నాన్నా!" అన్నాడు రఘు.

"చెప్పేదేమిటో తిన్నగా చెప్పు...."

రఘు వివరించాడు.

అనుకోకుండా ఓ ఎగ్జిబిషన్‌లో రఘుకి సుజాతతో పరిచయమయింది. సుజాత చాలా మంచి పిల్ల. ఆమె అభిరుచులు వున్నతమైనవి. చాలా విషయాల్లో రఘు అభిరుచులతో ఆమె అభిరుచులేకీభవించడంవల్ల ఇద్దరూ స్నేహితులయ్యారు. తరచుగా కలుసుకుని యెన్నో విషయాలు చర్చించేవారు.

రఘు సుజాతనొక స్త్రీగా యెన్నడూ భావించలేదు.

అతడికెందరో పురుష స్నేహితులున్నారు. వాళ్లాంటిదే సుజాత కూడా అనుకున్నాడు.

కానీ సుజాత తండ్రికి వీరి పరిచయం గురించి తెలిసింది. ఆయన వెంటనే పెళ్ళిప్రసక్తి తెచ్చాడు.

అప్పుడు సుజాత, రఘు — ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

"అతణ్ణి గురించి నేనిలా ఆలోచించలేదు—" అందామె.

"ఆమెను నేనాదృష్టిలో చూడలేను—" అన్నాడతడు.

"అయితే ఇక మీరు కలుసుకోకండి—" అన్నాడు గురునాథం.

కలుసుకోకూడదనే వాళ్ళనుకున్నారు. కానీ అలా వుండలేకపోయాను.

"నాన్నా! మీరే చెప్పండి—స్నేహమంటే ఇద్దరు పురుషులకో, ఇద్దరు స్త్రీలకో పరిమితం కావాలా? స్త్రీ పురుషులమధ్య స్నేహభావానికి తావులేదా?" అన్నాడు రఘు కథను మధ్యలో ఆపి.

"కథలు బాగా చెప్పగలవు నువ్వు. వెరీగుడ్! తర్వాతేమయిందో చెప్పు—" అన్నాడు వసంతరావు.

"ప్రేమ, పెళ్ళి అంటే మా యిద్దరికీ కూడా కంపరంగా వుంది. మా మధ్యనున్న మంచి స్నేహానికవి మచ్చను తెస్తాయని మా భయం...."

"ఐ ఎప్రిసియేట్ యువర్ ఐడియా—ఒక్క విషయం చెప్పు—సుజాతతో స్నేహాన్నింకా కొనసాగిస్తావా?" అన్నాడు వసంతరావు.

"ఊఁ"

"అయితే నేను చెబుతున్నాను—విను. ఈ క్షణం

నుంచీ ఆ స్నేహితురాలిని మరిచిపో—"

"ఎందుకని?"

"సుజాతకు పెళ్ళి కుదిరింది. వివాహిత స్త్రీకి భర్త కాక ఇతర పురుషులు స్నేహితులు కావడాన్ని మన సమాజం హర్షించదు...."

రఘు ఆలోచనలో పడ్డాడు.

"ఈ రాత్రి తొమ్మిదిలోగా నువ్వు గురునాథం గారింటికి వెళ్ళి నీవిక సుజాత జోలికి వెళ్ళనని హామీ ఇవ్వు—" అన్నాడు వసంతరావు.

"నేను హామీ యివ్వను...."

"ఎందుకని?"

"హామీ యిస్తే ఇంతకాలం నేను చేసింది తప్పని ఒప్పుకున్నట్లవుతుంది. ఎలాగూ రేపు రాత్రి నేను మధ్య ప్రదేశ్ వెడుతున్నాను. సంవత్సరందాకా తిరిగిరాను. ఈలోగా అన్నీ చక్కబడతాయి...." అన్నాడు రఘు.

"నువ్వు హామీ యివ్వకపోతే ఆయన ఆత్మహత్య చేసుకుంటానన్నాడు...."

"అదాయనకు అలవాటే! సుజాత కూడా గోల పెడుతూంటుం దిదే విషయం చెప్పి. ఆత్మహత్య చేసుకుంటాననడం ఆయన ఊతపదం వంటిది—"

"ఆయన్ను చూస్తే నాకలా అనిపించలేదు. నాకాయన కళ్ళలో నిజాయితీ కనిపించింది...." అన్నాడు వసంతరావు.

"నాన్నా! మీరు నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు అనుకుంటారు. ప్రపంచం మీరనుకున్నంత మంచిదికాదు. గురునాథంగారి గురించి మీకంటే బాగా తెలుసు నాకు. ఆయన స్వార్థపరుడు...." అన్నాడు రఘు.

"ఈ ప్రపంచంలో డబ్బు కూడబెట్టే ప్రతివాడూ స్వార్థపరుడు. కూడబెట్టిన డబ్బు మనిషి స్వార్థానికి కొలబద్ద. నేను గురునాథంగారికంటె చాలా ఎక్కువ డబ్బు కూడబెట్టాను కాబట్టి ఆయనకంటే నేనే ఎక్కువ స్వార్థపరుణ్ని. స్వార్థపరుడెప్పుడూ మంచివాడు కాలేడు. కానీ నీ విషయంలో నా బుద్ధి పనిచేయకపోవచ్చు. తెల్లని వన్నీ పాలనుకోవడం నీ విషయంలో నిజమే! నువ్వు తెల్లగా వుంటావు. నాకు నువ్వంటే సదభిప్రాయం..." అన్నాడు వసంతరావు.

"థాంక్స్ నాన్నా!"

"థాంక్స్ చెప్పడం కాదు. నా అభిప్రాయానికి న్యాయం చేకూర్చేలా ప్రవర్తించు—" అన్నాడు వసంతరావు.

# 6

గుడిసెలోపల నల్లరాతిమీద కత్తి నూరుతున్నాడు సోములు.

వాడు పువ్వుల లుంగీ వేసుకున్నాడు. చేతులున్న బనియన్ లుంగీలోపల ఇన్‌షర్టు చేసి పటకాబెల్టు వేసుకున్నాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి. మనిషి మహా దృఢంగా వున్నాడు.

వాడి జుత్తు వుంగరాలు తిరిగి వుంది. మీసాలు గుబురుగా వున్నాయి.

సోములు కత్తి నూరుతూంటే ప్లాస్టిక్ నవారు మంచం మీద పడుకుని ముచ్చటగా చూస్తోంది సుబ్బులు. కత్తి నూరుతున్నప్పుడు సోములి కండలు తమాషాగా వుబ్బుతూ కదులుతున్నాయి.

"ఈరోజెవరికైనా మూడిందా మావా?" అంది

సుబ్బులు.

"నాకంటూ కాండిడేటు లేదు....ఎవరైనా కాకుక్కుంటూ వస్తే మాత్రం కత్తి సిద్ధంగా వుంది...." సోములు.

"ఇక నూరడం చాలు—ఇలా వచ్చి ఊసులు చెప్పు" అంది సుబ్బులు.

అప్పుడు గుడిసె బయటినుంచి ఎవరో—"సోములూ!" అని పిలిచారు.

సోములు నూరుతున్న కత్తిని వదిలి-లేచి నిలబడ్డాడు.

"సోములూ!" అందా గొంతు మరోసారి.

సోములు బయటకు వచ్చాడు.

సాయంకాలపు నీరెండలో—గ్రీష్మతాపానికి గురైన వాడిలా కనబడుతున్నాడు గురునాథం.

"ఎవరు బాబూ తమరు?" అన్నాడు సోములు వినయంగానే.

"నా పేరు గురునాథం. నేనెవరో నీకు తెలిసే వుండాలి..."

"నిజంగా తెలవదు బాబూ!" అన్నాడు సోములు.

"పోనీ నీకు వసంతరావు తెలుసా?"

"వసంతరావంటే దూలాల పెదబాబుగారేనా?" అన్నాడు సోములు.

వసంతరావుకా ఊళ్ళో చాలా పెద్దసామిల్లుంది. ఊళ్ళో యెక్కడ పెద్ద కట్టడం లేచినా ఆసామిల్లులో దూలాలు కోయించడం జరుగుతుంది. దూలాల పెద బాబుగారని వసంతరావుకు పేరు.

"ఊఁ" అన్నాడు గురునాథం.

"ఆ బాబు తెలవకేం!" అన్నాడు సోములు.

"ఆ బాబు నీకు నా గురించి చెప్పలేదూ?"

"ఏమని బాబూ?"

"నీతో చెప్పడానికేముంటుంది? నన్ను చంపమని.."

సోములు తెల్లబోయాడు—"మీ రెవరో నాకు తెలీదు. నేను మిమ్మల్నెందుకు చంపుతాను?" అన్నాడు వాడు.

"నువ్వు చంపిన వాళ్ళంతా నీకు తెలుసా?"

"ఏంటి బాబూ మీర నేది?" అన్నాడు సోములు.

"ఏమీ ఎరగనట్లు నాటకాలాడకు. వసంతరావు బాబుకీ నాకూ గొడవలుంటే మేమూ మేమూ చూసు కుంటాం. ఆ బాబు చెప్పాడని నా జోలికి వచ్చావో— నీపనయిందన్నమాటే—....ఇది నా హెచ్చరిక...."

"నాకు మీరెవరో తెలవదంటూంటే ఈ హెచ్చరిక లేంటి బాబూ—" అన్నాడు సోములు.

"అమాయకత్వం నటించకు. నాకన్నీ తెలుసు. నువ్వు చేసిన నేరాలన్నీ ఒకటొక్కటిగా ఏకరువు పెట్టగలను. ఎలా తప్పించుకున్నావో కూడా చెప్పగలను. నా జోలికి వస్తే మాత్రం తప్పించుకోలేవు...." అంటూ గురు నాథం సోములు చేసిన నేరాలొకటొకగా అరుస్తూ చెప్పసాగాడు.

అప్పటికక్కడ జనం బాగా చేరారు. అంతా చోద్యం చూస్తున్నారు.

"ఈ బాబెవడో నాకు తెలియదు. ఇక్కడకొచ్చి నామీద ఉత్తిపుణ్యాన పేలుతున్నాడు. ఇక నేనూరు కోను. కత్తినూరి సిద్ధంగా వుంది. ఇప్పుడే ప్రాణాలు తీస్తాను—" అన్నాడు సోములావేశంగా.

"నాకు తెలుసు. నువ్వు కత్తినూరి పెట్టుకున్నది నా కోసమే! రాత్రికి నా ప్రాణాలు తీయాలనుకున్నావు.

వెతుక్కుంటూ నీ యింటికొచ్చాను గదా అని ఇప్పుడే నా ప్రాణాలు తీయాలనుకుంటున్నావు. ఏం చేస్తావో చేయి. నాకు ప్రాణభయంలేదు. పోలీసులు నిన్ను వదలరు. నీ అంతు చూస్తారు. ఆ ఏర్పాట్లన్నీ చేసేవచ్చాను" అన్నాడు గురునాథం.

"పోలీసులంటే నాకేం భయంలేదు. నీకు మూడింది అందుకే నన్ను రెచ్చగొడుతున్నావు—" అన్నాడు సోములు. వాడావేశంగా గుడిసెలోపలకు వెళ్ళబోయే సరికి సుబ్బులు ఆపి—"మావా—ఆ మనిషి నిన్ను రెచ్చగొట్టి పోలీసులకప్పగించడానికే వచ్చాడు. ఆవేశపడకు. నా గురించి ఆలోచించు. నువ్వు జైలుపాలైతే నేనేమైపోతాను?" అంటూ గట్టిగా పట్టుకుంది.

అప్పటికి కొందరు మగాళ్ళు కూడా ముందుకు వచ్చి సోముల్ని గట్టిగా పట్టుకున్నారు.

మరికొందరు గురునాథాన్ని మందలించారు. అక్కణ్ణించి వెళ్ళిపొమ్మని చెప్పారు.

"నేను వెడతాను. మీరు సోములి క్షేమం కోరేవారైతే—వాడిని నా జోలికి రావద్దని చెప్పండి—" అన్నాడు గురునాథం.

"ఒరేయ్—ఇప్పుడు తప్పించుకున్నా—తెల్లారేలోగా నువ్వెక్కడున్నా సరే వెతికి మరీ చంపుతాను—" అంటూ ఆవేశంగా అరిచాడు సోములు. చుట్టూ వున్న వాళ్ళు వాణ్ణి అపడానికి మరింత గట్టిగా పట్టుకోవలసి వచ్చింది.

"నీ కర్మ—" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు గురునాథం.

7

"నాన్నా! నీతో అర్జంటుగా ఒక విషయం మాట్లాడాలి—" అంది సుజాత.

"అంత అర్జంటు విషయమేముంది? రఘు గురించా?" అన్నాడు గురునాథం.

"అవును— ...."

"చూడమ్మా! నీ గురించి నాకు బాగా తెలుసు. అందుకే నీ పెళ్ళి గురించి నేనో నిర్ణయానికి వచ్చాను...." అన్నాడు గురునాథం.

"చెప్పండి నాన్నా!" అంది సుజాత.

"ఇప్పుడు చెప్పను ...."

"అయితే నేను చెప్పేది వినండి—" అంది సుజాత.

"ఇప్పుడు వినను...."

"అలాగంటే ఎలా నాన్నా? ఇది నా జీవిత సమస్య...."

"నేను తీసుకున్న నిర్ణయం నీకెంతో సంతోషాన్ని కలిగిస్తుంది. నీ జీవితంలో సమస్యలు లేకుండా చేస్తుంది. నా మాటలు నమ్మి ప్రస్తుతానికి నన్నేమీ అడక్కు. ఉదయం మనం మాట్లాడుకుందాం—"

"అంతవరకూ ఆగడానికి లేదు. రేపు తెల్లారేసరికల్లా నేనో నిర్ణయం తీసుకోవాల్సి వుంది—" అంది సుజాత.

"అయితే తెల్లవారుఝామున నాలుగింటికి లేచి మాట్లాడుకుందాం. ఇప్పుడు నన్ను డిస్టర్బ్ చేయకు ..." అన్నాడు గురునాథం.

"ఇప్పుడు మాట్లాడకపోతే రాత్రంతా నాకు నిద్ర పట్టదు నాన్నా!" అంది సుజాత.

"నిద్రకనుక నిజంగా పట్టకపోతే రాత్రి పదకొం

డింటికి తప్పకుండా మాట్లాడుకుందాం. ఇప్పుడు మాత్రం నన్ను డిస్టర్బ్ చేయకు" అన్నాడు గురునాథం.

సుజాత వాచీ చూసుకుంది. అప్పుడు టైము ఏడున్నర యింది.

"అయితే రాత్రి పదకొండింటికే మాట్లాడుకుందాం. నాకెలాగూ నిద్రపట్టదు—" అంది సుజాత.

"పద — ముందు భోజనాలు చేద్దాం—" అన్నాడు గురునాథం.

తండ్రీ కూతుళ్ళిద్దరూ కలిసి భోంచేశారు. గురునాథం కూతురి వంటలు మెచ్చుకుని — "పెళ్ళై కాపురానికి వెళ్ళినా నీతో నే వచ్చి వుంటానమ్మా! కన్నకూతురివన్న మమకారంతో కాదు. కడుపారా తిండి తినాలన్న స్వార్థంతో!" అన్నాడు.

తండ్రి మంచి మూడ్‌లో వున్నాడని గ్రహించి— "నాన్నా! ఇప్పుడు నేను చెప్పొచ్చా?" అంది.

"ఏమిటి?"

"భోజనానికిముందు చెప్పానుగా—అది!"

"అప్పుడే కాదమ్మా.......అనవసరంగా తొందర పడకు...."

"ప్లీజ్—వినండి నాన్నా!" గారంగా అంది సుజాత.

"నాకు నువ్వు చెప్పేది తెలుసు...." అన్నాడు గురునాథం.

"ఏమిటి?"

"రేపు రఘు నిన్ను పెళ్ళి చేసుకుంటున్నాడు. అవునా?"

"మీకెలా తెలుసు?"

"అనుభవంతో పండిన తలమ్మా యిది. నాకు చాలా

తెలుసు. అయితే నాకు తెలిసినవన్నీ నీకు తెలియవు...."

"నాకూ అన్నీ తెలుసు.."

"అయితే రఘు మోసగాడని నీకు తెలుసా?"

"అబద్ధం!" అప్రయత్నంగా అంది సుజాత.

"ఆ నిజం ఋజువు చేస్తాను...."

"ఈలోగా నే రఘు నన్ను పెళ్ళిచేసుకుంటే?"

"నా కంఠంలో ప్రాణముండగా జరుగదది...."

"జరిగితే?"

"అప్పుడు నా కంఠంలో ప్రాణముండదు-" దృఢంగా అన్నాడు గురునాథం.

సుజాత మ్రాన్పడిపోయింది. తండ్రి రఘుకి అంత వ్యతిరేకంగా మాట్లాడతాడని ఆమె అనుకోలేదు.

"ఈ పెళ్ళి జరక్కపోతే బహుశా నా కంఠంలో ప్రాణముండదు...." అంది సుజాత తేరుకున్నాక.

"చూడమ్మా— నేను బ్రతికేదే నీకోసం. నాకిష్టంలేని పని జరిగితే అందువల్ల మనిద్దరిలో ఒకరు చావడం తప్పని సరైతే—అది నేనే అవుతాను తప్ప....నిన్ను చావ నివ్వను. ఇప్పుడివన్నీ మాట్లాడడం నా కిష్టంలేదు. రే పుదయందాకా ఆగు. నే నెందుకాగమన్నానో తెలుస్తుంది."

"రేపుదయం కాదు. రాత్రి పదకొండింటికి...."

"సరే—అప్పటిదాకా నువ్వు మెలకువగా వుంటే అలాగే—" అంటూ నవ్వాడు గురునాథం.

"ఎందుకుండను?" ఉక్రోషంగా అంది సుజాత.

"నువ్వు పెద్దదానివైపోయాననుకుంటున్నావు? ఈ లోకంలోకి నువ్వు కెవ్వుకెవ్వుమంటూ ఏడుస్తూ అడుగు పెట్టినప్పటినుంచీ నిన్ను నే నెరుగుదును? నీ గురించి నీ

కంటే నాకే బాగా తెలుసు" అని నవ్వాడు గురునాథం.

ఆయన తను తాగే మంచినీళ్ళలో నిద్రమాత్రలు కలిపేడని సుజాతకు తెలియదు. రాత్రి పదకొండు దాకా అవసరంలేదు — తొమ్మిది కాకుండానే ఆమె నిద్ర పోయింది.

ఉదయం ఆమెకు మెలకువ వచ్చి చూస్తే తండ్రి మంచంమీద కదలడంలేదు. ముట్టుకుని చూస్తే వళ్ళు చల్లగా వుంది.

సుజాత కంగారుపడి చుట్టుపక్కలవాళ్ళను పిలిచింది.

గురునాథం చావు అనుమాన పరిస్థితుల్లో జరగడంవల్ల పోలీసులు రంగంలోకి వచ్చారు. చావుకి ముందు ఆయన ఆరోజు జరిగిన విశేషాలన్నీ ఓ కాగితంమీద రాసు కున్నాడు.

ఆ కారణంగా అనుమానితుల జాబితా ఒకటి తయా రయింది.

అందులో సీతాపతి, సోములుతోపాటు సుజాత పేరు కూడా వుంది.

# 8

శ్యామల పడక కుర్చీలో వెనక్కి జారగిలబడి మనో హరంగా నవ్వింది.

ఆమె నవ్వుల్లోంచి రాలిన ముత్యాలే చీరమీద అక్క డక్కడ స్థిరపడిపోయాయా అని రఘుకి అనుమానం వచ్చింది.

అతనామె యెదుట మామూలు కుర్చీలో కూర్చుని వున్నాడు.

శ్యామల ఒడిలో "వుమన్స్ ఏరా" పత్రిక వుంది. ఆమె ఆ పత్రికను సగం చదువుతూ నవ్వాపుకోలేక

ఒడిలో పడేసింది. అతణ్ని చూసి-"నువ్వు నన్నే చూస్తూ కూర్చుంటావేం? వేరే పని లేదా నీకు—" అంది.

"లేదు—" అన్నాడతడు.

శ్యామల గర్వంగా నవ్వి—"టైము ఎనిమిది కావస్తోంది గుడికి వెళ్ళవా నువ్వు?" అంది.

"వెళ్ళను...."

"పాపం—సుజా! అక్కడ నీవు చేసిన ఏర్పాట్ల కోసం యెదురుచూస్తూంటుందేమో?" ప్రశ్నార్థకంగా అంది శ్యామల.

"ఆమె అక్కడికి రాకుండా నే నేర్పాట్లు ముందే చేశాను...."

"ఏం చేశావు?"

"చెబుతాను — ముందు నువ్వెందుకు నవ్వావో చెప్పు...."

"ఈ పత్రికలో ఓ ఆర్టికలుంది. అందులో తరతరాల బానిసత్వం నుంచి బైటపడడానికి స్త్రీ విముక్తి పోరాటాన్ని జరపాలని వ్రాసిందామె. ఆమె ఫోటో కూడా ఒకటి వేశారు. ఆమె పట్టుచీర కట్టుకుంది. చేతులనిండా గాజులు, మెడలో నల్లపూసలు, మంగళసూత్రాలు, నుదుట రూపాయకాసంత బొట్టు ...."

"ఇందులో నవ్వడానికేముంది?"

"పట్టుచీర, గాజులు, మంగళసూత్రాలు, కుంకుమ బొట్టు—ఇవన్నీ ఆడదాని బానిస మనస్తత్వానికి గుర్తు.. తను బానిసనని మర్చిపోయి—తను బానిసత్వ చిహ్నాలను ధరిస్తూ బానిసల విముక్తి పోరాటానికి ప్రోత్సాహమిస్తూ వ్యాసం రాసిందామె — నవ్వురాదూ?" మళ్ళీ

నవ్వింది శ్యామల.

"శ్యామా—ఆడవాళ్ళంతా నీవలా మారిపోతే ఎంత బాగుంటుంది?" అన్నాడు రఘు.

"నిజంగా నీ కా కోరిక వుందా?"

"ఎందుకుండదు? నువ్వు నాతో కలిసి వుంటానన్నావు. పెళ్ళిచేసుకోమని అడగనన్నావు. నీ పిల్లల బాధ్యత నాది కాదన్నావు. మోజు తీరగానే విడిపోవచ్చునన్నావు. నీకోసమేకదా నేను మధ్యప్రదేశ్ ప్రయాణం పెట్టుకున్నది! నువ్వు నాకూడా వస్తున్నట్లు నాన్నకు కూడా తెలియదు...."

"రఘూ! నేను పెళ్ళిచేసుకోను. ఆర్థికంగా నా కాళ్ళమీద నేను నిలబడతాను. స్వతంత్రంగా జీవిస్తాను. అవసరమనుకుంటే పిల్లల్ని కంటాను. వాళ్ళు నన్ను బానిసగా మారుస్తారన్న అనుమానం తీరేదాకా పిల్లల గురించే ఆలోచించను. ఇష్టం వచ్చిన పురుషుడితో ఇష్టం వచ్చినంతకాలం గడుపుతాను. నావంటి ఆడది నీకు వరం అనుకుంటున్నావు. కానీ అది నిజంకాదు. ఆడదాని స్వతంత్రాన్ని మగాడు భరించలేడు. నాతో కొంతకాలం జీవించగానే నీకు ముఖం మొత్తుతుంది. ఓ బానిస కావాలనిపిస్తుంది. అప్పుడు పెళ్ళిచేసుకుంటావు. అప్పుడెలాగూ తప్పనప్పుడు—నిన్ను ప్రేమించిన సుజాత వుండనే వుంది- ఇప్పుడే ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు?" అంది శ్యామల.

"ఎందుకు పెళ్ళి చేసుకోవాలి?"

"నువ్వా ఆమెను ప్రేమించావు కాబట్టి....!"

"గొప్ప జోకు.... నేనింతవరకూ ఎవర్నీ ప్రేమించలేదు—తెలుసా?"

"అయితే ప్రేమించానని ఎందుకు చెప్పావు?"

"ఆడపిల్ల అందంగా కనబడిందని వల విసిరాను. నా ప్రయత్నాల్లో నేనుండగా సుజాత తండ్రి పసిగట్టాడు. కూతుర్ని హెచ్చరించడానికి బదులు నన్నే కలుసుకుని ఫ్రాంక్‌గా మాట్లాడాడు. మా యిద్దరికీ యిష్టమైతే నాన్నని కలుసుకుని మాట్లాడతానన్నాడు. ఆలోచించు కుంటుకు వ్యవధి కావాలన్నాను. మా నాన్నది మెత్తటి మనసు. అంత స్తుల బాధలు లేవాయనకు. నేను సుజాతను పెళ్ళి చేసుకుంటా నంటే వెంటనే ఒప్పుకుంటా డాయన...."

"అయితే కథ సుఖాంతమే కదా!"

"సుజాతకు సంబంధించినంతవరకూ అది సుఖాంతమే! నాకే విషాదాంతం—అందుకే సుజాతను మర్చిపోవా లనుకున్నాను. ఆ విషయం ఆమె తండ్రికి చెప్పాను—"

"ఊఁ" అంది శ్యామల.

రఘు కథ చెబుతున్నాడామెకు. ఆమె ఊఁ కొడు తోంది.

రఘు గురునాథానికి చెప్పేశాడు, తను సుజాతను పెళ్ళి చేసుకోనని. కానీ ఆ విషయం సుజాతకు చెప్ప లేదు. గురునాథం తన్ను కలుసుకుని—తనకు భాగ్యవం తుల సంబంధం యిష్టం లేదన్నట్లు—అతను సుజాతకు చెప్పాడు. సుజాత అతణ్ని రహస్యంగా కలుసు కుంటూనే ఉంది. కానీ అతడు కోరిన విధంగా వలలో పడడంలేదు.

ఇలా ఉండగా ఒకరోజు గురునాథం అతణ్ని కలుసు కుందుకు వచ్చాడు. సుజాతను పెళ్ళి చేసుకోకపోతే రఘు రహస్యాలు బయట పెడతానన్నాడు.

రఘుకి బైటపెట్టకూడని రహస్యాలున్నాయి. ఆ

రహస్యాలు రఘుని జైలుపాలు చేయగలవు. తండ్రికి దూరం చేయగలవు.

రఘుతో పెళ్ళి జరిగితే సుజాతను వసంతరావు కోడలిలా ఆదరిస్తాడు. రఘులో తప్పక మార్పు వస్తుంది. సుజాత ఆస్తిపరుడితో సుఖంగా వుంటుంది. ఆడదానికి అనుకూలుడైన భర్తను మించి — ఆస్తి ఎక్కువ రక్షణ నిస్తుందని గురునాథం నమ్ముతున్నాడు.

గురునాథం తన్ను బ్లాక్ మెయిల్ చేయగలడని రఘు ఊహించలేదు. తన రహస్యాలు ఆయనకు మాత్రమే తెలుసనీ — సుజాతకు కూడా తెలియదనీ రూఢి చేసుకున్నాక రఘు ఓ పథకం వేశాడు.

వసంతరావు పైకి నీతిసూత్రాలు వల్లించినా — ఆయనకు పేదలంటే నమ్మకం లేదని రఘు గురునాథానికి నచ్చజెప్పాడు.

"మా నాన్న మీ నిజాయితీని నమ్మాలి. నాపై వల విసరలేదని విశ్వసించాలి. ఈ పెళ్ళికి నేనే కానీ మీరు కారణం కాదని గ్రహించాలి. అందుకు నేను చెప్పినట్లు చేయండి. మా పెళ్ళి జరుగుతుంది —" అన్నాడు రఘు గురునాథంతో.

ఆ ప్రకారం గురునాథం సీతాపతితో దెబ్బలాడాడు. చలపతితో సంబంధం స్థిరపర్చుకున్నాడు. వసంతరావుకా విషయం చెప్పాడు. సోములుతో దెబ్బలాడాడు. జరిగినవన్నీ ఓ కాగితం మీద రాసుకున్నాడు.

ఇప్పుడు గురునాథం చచ్చిపోతే....?

సీతాపతి, సోములు అనుమానితులు.

గురునాథం ఆత్మహత్య చేసుకుంటాడనేందుకు — చలపతి, వసంతరావు సాక్ష్యాలివ్వగలరు.

హత్య అనుకుంటే అనుమానితులూ వున్నారు. ఆత్మ హత్య అనుకుంటే కారణాలూ సిద్ధంగా ఉన్నాయి.

ఈ పరిస్థితి కల్పించేక—యెవరికీ తెలియకుండా రఘు గురునాథాన్నతడింట్లో కలుసుకున్నాడు. మంచి మాటలు చెప్పి విషప్రయోగంతో అతణ్ని చంపేశాడు.

తండ్రి చావు కారణంగా సుజాత ఈరోజంతా పెళ్ళి గురించి ఆలోచించదు. తన దురదృష్టం కొద్దీ రఘును మిస్సయ్యాననుకుంటుంది.

రఘుకి బ్లాక్ మెయిలింగ్ బాధ వుండదు.

అతడిప్పుడు శ్యామలతో హాయిగా మధ్యప్రదేశ్‌లో ఓ సంవత్సరంపాటు గడిపి రావచ్చు.

"ఫంటాస్టిక్!" అంది శ్యామల.

ఆమె ఇంకా ఏదో అనబోయేలోగా ఎవరో ఆ ఇంటి తలుపులు తట్టారు.

"ఈ సమయంలో యెవరు?" అన్నాడు రఘు చిరాగ్గా.

"ఎవరూ రాకూడదా మరి!" అంటూ శ్యామల పడక కుర్చీలోంచి లేచింది. ఆమె ఒడిలోని ఉమన్స్ ఏరా క్రింద పడింది.

రఘు ఆ పుస్తకం తీసుకొని పక్క గదిలోకి వెళ్ళాడు.

వచ్చిన మనుషుల్ని శ్యామల పంపేసి త్వరగా వస్తుందని అతడా గదిలో మంచంమీద కూర్చుని యెదురు చూస్తున్నాడు.

అయితే శ్యామలకు బదులుగా పోలీసులా గదిలో ప్రవేశించారు. వారిని చూస్తూనే రఘు తడబడి—"ఎవరు మీరు? నాతో మీకేం పని?" అన్నాడు.

"మిస్టర్—యూ ఆరండర రెస్టు...." అన్నాడు పోలీసిన్ స్పెక్టర్.

"ఎందుకు?"

"ఓ నిండు ప్రాణాన్ని తీసినందుకు...."

"ఏమిటి మీర నేది?"

"అన్నీ వివరంగా చెబుతాను—పద!" అంటూ ఇన్ స్పెక్టరతణ్ని ఆ గదిలోంచి బయటకు లాగాడు.

అక్కడ....

పడకకుర్చీలో కూర్చుని వున్న గురునాథాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రఘు.

"మీరా?" అన్నాడతడు.

గురునాథం ఉత్సాహంగా లేడు.

"అమ్మాయి అమాయకురాలు. నీతో ఎలా వ్యవహరించాలో తెలియలేదు. ఆ సమయంలో పదేళ్ళ జైలు శిక్ష అనుభవించి నా తమ్ముడు గోవిందం వచ్చాడు. వాడు రహస్యంగా నా యింటికొచ్చాడు. తన గురించి యెవరికీ చెప్పొద్దన్నాడు. చెడు సావాసాల ఫలితంగా ఇంటిల్లిపాదికీ దూరమై జైలుపాలయినవాడు—ఏకాకి. వాడికి నా కథ చెప్పుకున్నాను. వాడు చూడ్డానికి నాకులాగే ఉంటాడు. ఈ వ్యవహారం సిరపర్చడానికి వాడు నా స్థానంలో కొంతకాల ముంటానన్నాడు. నేను అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాను.

వాడు నా స్థానంలో వ్యవహరిస్తూ ఎప్పటికప్పుడు కాగితంమీద రాసి నాకు వివరా లందజేస్తూండేవాడు. నువ్వు వాణ్ని చంపాలనుకుంటావని వాడూ, నేనూ కూడా అనుమానించలేదు. తనకు కొందరు శత్రువుల్ని తయారుచేస్తే—వాళ్ళ బారినుంచి తన్ను తనే రక్షిం

చుకోగలనని వాడనుకున్నాడు. ఏ మాత్రం తెలిసినా నా తమ్ముణ్ని నేను రక్షించుకోగలిగేవాణ్ని——...."
అన్నాడు గురునాథం నీరసంగా.

హితుడే తిరిగివస్తే తాను చేయగలిగిన దేముంది?

ఇలా జరుగుతుందని ఊహించని రఘు శ్యామలవంక దిగులుగా చూశాడు.

శ్యామల మాత్రం దిగులుగా లేదు. ఆమె స్వతంత్ర భావాలను సదవకాశంగా తీసుకునే పురుషపుంగవులు— ఇంకా చాలామంది వుంటారని ఆమెకు తెలుసు!

——:అ యి పో యి ం ది:——

# ఇంటర్వ్యూహం

## ఎ. యస్. రావ్

చేతికి అతుక్కున్న ఎలక్ట్రానిక్ వాచ్‌ని వోసారి చూసి, అతను తీరుబడిగా సిగరెట్ వెలిగించాడు. ఇంకా తీరుబడిగా గోడకి వీపు ఆన్చి యేటవాలుగా నిలబడ్డాడు.

తన అంచనా నిజమైతే, సిగరెట్ పూర్తయ్యేసరికి ఆ వ్యక్తి ప్రత్యక్షమవుతాడు. టెలిఫోన్‌లో మాట్లాడినప్పుడు ఆ వ్యక్తి కంఠంలో ఆశ్చర్యం, అపనమ్మకం ధ్వనించాయి. ఆ రెండింటి మధ్యా, రెండింటిని మింగేస్తూ ఆశ కూడా లీలగా ధ్వనించింది. ఎదుటివ్యక్తి కళ్ళలోని, కంఠంలోని ఆశని తన కళ్ళూ, చెవులూ ఇట్టే కనిపెట్టేస్తాయి. తనలోని ఆశక్తే తన చేతిలోని ఆయుధం!

సగర్వంగా నవ్వుకుంటూ అతను సిగరెట్ పొగని తృప్తికరంగా ఊపిరితిత్తుల్లోకి సరఫరా చేశాడు. మరో రెండు, మూడు దమ్ముల్లో అతను లిఫ్ట్‌లోంచీ దిగాలి; తన అంచనా నిజమవుతే. మనుషుల విషయంలో తన అంచనా ఎప్పుడూ నిజం అవుతూనే వుంటుంది....

చిన్నగా చప్పుడు చేసిన లిఫ్ట్ వైపు అతను మెరిసే కళ్ళతో చూశాడు. తన అంచనాని నిజం చేయడానికే అన్నట్టు ప్రత్యక్షమైన ఆ వ్యక్తిని అతను సిగరెట్ పొగ తెరలోంచీ చూస్తూ వుండిపోయాడు.

బట్టతల. వెడల్పాటి మొహం. నలుపూ, తెలుపూ కలిసిన గుబురు కనుబొమలకింద విశ్రాంతి లేకుండా అటూ ఇటూ చూసే చిన్న కళ్ళు. ఒదులుగా వున్న పొట్టి చేతుల చొక్కా ఒదులుగావున్న పాంటులోకి మారింది. సన్నటి, రంగు వెలిసిపోయిన బెల్టు అతని బొజ్జని చుట్టుకుంది. గదుల నెంబర్లు చూసుకుంటూ అతను మలుపు తిరిగాడు.

జార్లబడిన గోడనుంచీ కదిలి అతను నిటారుగా నించున్నాడు. సిగరెట్టు పీకని కారండా మూలకు విసిరి, పెద్ద పెద్ద అంగల్లో కదిలాడు. ఆ వ్యక్తి కొంచెం దూరంలో వున్న గదిముందు ఆగి, బెల్ నొక్కడానికి చేతిని పైకెత్తాడు.

"బెల్ నొక్కకండి. నేను తాళం తీస్తేగానీ తలుపు తెరుచుకోదు!"

బట్టతల వ్యక్తి ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు. తన దగ్గరగా, ఎత్తుగా నించున్న వ్యక్తిని యెగాదిగా చూశాడు. తెల్లటి వైట్ పాంటు, బ్రౌన్ కలర్ ఫుల్ స్వెటర్, మెడ చుట్టూ తెల్లటి మఫ్లర్.... స్వెటర్ చేతులు మోచేతులదాకా నిర్లక్ష్యంగా పైకి తోయబడ్డాయి.

"మిస్టర్...." బట్టతల వ్యక్తి పల్చటి పెదవులు కదిలాయి.

"లోపలికెళ్ళి, హాయిగా కూచుని, తీరిగ్గా మాట్లాడు

కుందాం!" అంటూ అతను తాళం తెరిచి, డోర్ని లోప
లికి తోశాడు.

"గెటిన్, మిస్టర్ ప్రాణేశరావ్!"

బట్టతల వ్యక్తి లోపలికి జరిగాడు. క్షణంలో లోపల్నుంచి తలుపు మూసి, తాళం వేసి, తాళంచెవిని పాంటు జేబులో దోపుకుని అతను ప్రాణేశరావుని చిరునవ్వుతో చూశాడు.

"మధ్యాహ్నం ఫోన్ చేస్త మీరేనా?" ప్రాణేశరావు అతన్ని మళ్ళా ఎగాదిగా చూస్తూ అడిగాడు.

"నేనే. వచ్చినందుకు థాంక్స్. కూచోండి!" అంటూ అతను సోఫావైపు కదిలాడు. తన ఆకారం, ఠీవి ప్రాణేశరావుకి బాగా నచ్చినట్టు అతను చటికెలో గ్రహించాడు. అయితే, తన పర్సనాలిటీ నచ్చినందుకు ప్రాణేశరావు త్వరలో నిరాశతో విచారిస్తాడు. అతనికి నచ్చాల్సింది తన పర్సనాలిటీ కాదు; తన ప్లాన్.

"ఫోన్లో మీ పేరు చెప్పలేదు...." సోఫాలో విశాలంగా కూచున్న ప్రాణేశరావు నవ్వే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"మిస్టర్ ప్రాణేశరావ్, అయామ్ మహాబలేశ్వర్రావ్...." అంటూ అతను సోఫాలో కూచున్నాడు.

ప్రాణేశరావు కనుబొమలు ఒకదాన్నొకటి గొంగళి పురుగుల్లా తాకి, దూరంగా జరిగాయి. "మా విషయం మీ కెవరు చెప్పారు?"

"అదో పెద్ద కథ!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

"ఫోన్లో మీరు చెప్పిన అబ్బాయి—అదే, వరుడు—మీరేనా?" ప్రాణేశరావు తనని తొందరపెడుతున్న

ప్రశ్నని అడిగాడు.

"కాదు...."

"అతను....మీ కేమవుతాడు?"

"ఏమీ కాడు!"

ప్రాణేశరావు కనుబొమలు మళ్ళీ వ్యాయామం ప్రారంభించాయి. మహాబలేశ్వర్రావు అతన్ని సూటిగా చూశాడు. సోఫాలో ముందుకి జరిగాడు. "మిస్టర్ ప్రాణేశరావ్, నేను ఫోన్‌లో చెప్పిందంతా మరిచి పొండి. మొదట్లోనే మీరు నిజం తెలుసుకోవడం మంచిది. మీ అయిదో కూతురి పెళ్ళి విషయం గురించి నేను మాట్లాడను. అయితే, నేను మాట్లాడితే, ఆ మాటల్ని చెవులప్పగించి మీరు వింటే, మీ అమ్మాయి పెళ్ళికి అవి కొంతవరకూ ఉపయోగించే అవకాశం వుంది..."

"వాట్....డూ....మీన్?" ప్రాణేశరావు కంఠంలో ఆశ్చర్యం గంటలా పలికింది.

"మీ అమ్మాయి పెళ్ళి చేయాలంటే మీకు డబ్బు కావాలి. నేను మీకు కొంత డబ్బిస్తాను. ఇల్లు కట్టడానికి ఇటుకలా ఆ పైకం మీ అమ్మాయి పెళ్ళి సందర్భంలో మీకు ఉపయోగిస్తుంది...."

"ఏమిటిదంతా....? యింతకీ మీ రెవరు....? పొద్దుట...."

"'పొద్దుట' పొద్దుటే పోయింది. ఇది సాయంత్రం!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు. "అయితే, మీరు కట్టబోయే ఇంటికి నేను ఇటుక యివ్వాలంటే, మీరు నాకో సహాయం చేయాలి....ప్రతిఫలంగా!"

"మహాబలేశ్వర్రావు .. మహాబలేశ్వర్రావు, ఈ పేరు

వినగానే నాకు అనుమానం వేసింది. అయినా ఒకే పేరు మరో వ్యక్తికికూడా వుండొచ్చుననుకున్నా.... ఇప్పుడు నాకు అర్ధమవుతోంది. నీకు మా కంపెనీలో ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చింది. అవునా?" ప్రాణేశరావు అప్రయత్నంగా ఏకవచనంలోకి దిగి, అన్నాడు.

"మీ జ్ఞాపకశక్తికి జోహార్లు!" మహాబలేశ్వరరావు నవ్వుతూ అన్నాడు. "మీరు ఊహించి, అనుమానిస్తారన్న అనుమానంతో ఫోన్‌లో నేను పేరు చెప్పలేదు!...."

"నా కూతురి పెళ్ళికి—అదే నేను కట్టబోయే ఇంటికి ఇటుక యివ్వాలంటే, నీకు నేను మా ఎస్టాబ్లిష్‌మెంట్లో ఉద్యోగం ఇప్పించాలి! అంతేగా?" ప్రాణేశరావు తీక్షణంగా చూస్తూ గంభీరంగా అన్నాడు.

"మిస్టర్ ప్రాణేశరావ్...."

"షటప్!" ప్రాణేశరావు గద్దిస్తూ ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు. నిప్పులు కక్కే కళ్ళతో మహాబలేశ్వరరావుని చూశాడు. "ఎంత ధైర్యం! ఎంత అహంకారం! ఐ విల్ సీ దట్ యూ ఆర్...."

"హోల్డాన్!" మహాబలేశ్వరరావు అతని చూపుల్ని యెదుర్కొంటూ బిగ్గరగా అన్నాడు. "మిమ్మల్ని వుద్యోగం యిప్పించమని అడుగుతానని మీరెలా అనుకున్నారు? ఈ ఉద్యోగం ఎవరికిగానీ యిప్పించే శక్తి మీకు లేదు!" శివుడి మెడలో నిద్రిస్తూ వేలాడే పాములా తన మెడమీంచి వేళ్ళాడుతున్న మఫ్లర్ని అతను రెండు చేతుల్లో బిగించాడు.

"వాడ్డూయూ మీన్?" ప్రాణేశరావు అర్ధంకానట్టు చూస్తూ అరిచాడు.

"కన్సాలిడేటెడ్, డెయిలీ వేజ్, ఎన్.ఎమ్.ఆర్. పద్ధతులమీద అమాయకులకి 'అడపాదడపా ఫ్యాక్టరీలో చౌకబారు ఉద్యోగాలు యేర్పాటుచేసే ఒక మోస్తరు శక్తి మీలో వుంది. అయితే, ఆ ఉద్యోగాల కోసం వచ్చే బలిపశువులు ఎంతో కొంత చదివింపును చేస్తేగానీ మీలో ఆ 'శక్తి' మేల్కొనదు!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

సోఫా ముందు లావుపాటి స్తంభంలా నించున్న ప్రాణేశరావు పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అతని దవడలు అదిరాయి. "వాట్ డూ....యూ....మీన్?" బొంగురుగా అన్నాడతను.

"ఈ ఇంగ్లీషు ప్రశ్నని యిప్పటికే విసుగెత్తే అన్ని సార్లు విన్నాను! మీ గురించి నాకు తెలిసిన విషయాలు యితర్లకి, ముఖ్యంగా మీ ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటుకి తెలీకుండా వుండాలంటే, నేనెందుకు మిమ్మల్ని ఇక్కడికి రప్పించానో వివరంగా తెలుసుకోవాలని వుంటే, శరీరాన్నీ నోటినీ అదుపులో పెట్టుకుని కూచోండి!" మహాబలేశ్వర్రావు నిర్లక్ష్యంగా అన్నాడు.

కళ్ళు చిట్లించి, అతని కళ్ళల్లోకే చూస్తోన్న ప్రాణేశరావు క్షణకాలం సందేహించి సోఫాలో కూలబడ్డాడు. "నేను అయిదు నిమిషాలు మాత్రం ఇక్కడుంటాను. అర్థమయ్యేలా మాట్లాడు!"

మహాబలేశ్వరరావు చిన్నగా నవ్వాడు. లంచాలు తీసుకుని మీరు వుద్యోగాలు—బొత్తిగా టెంపొరరీవి—ఇప్పించే విషయం గురించి నేను అన్నమాటలు అర్థమయ్యాయని, కూచుంటూ మీరు నిరూపించారు. మీ వెడల్పాటి మొహంమీదున్న పొడుగాటి ముక్కుకి

నూటిగా మీరు ఉద్యోగం చేయడం లేదని నాకు తెలుసు...."

"మహా....బలేశ్వర్రావ్....నువ్వు...."

"పొడుగాటి ముక్కుకి నూటిగా బతుకుతూ నలుగురు కూతుర్లకి చక్కటి సంబంధాల్ని చేయడం కూడా కష్టమనీ నాకు తెలుసు!" మహాబలేశ్వర్రావు అతన్ని పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా అన్నాడు. "బఫెలో ఫెర్టిలైజర్స్" సంస్థలో సీనియర్ ఉద్యోగి అయిన మీరు కేవలం జీవితంమీదనే ఆధారపడి పనిచేయడం లేదనీ నాకు తెలుసు! నలుగురు కూతుళ్ళ పెళ్ళిళ్ళకీ డబ్బు అందించిన మీ ప్రొప్రయిటర్ భావరాజు ఆయిదో కూతురి పెళ్ళికి అక్కరకురాని అణాకాను యివ్వడనీ నాకు తెలుసు...."

"స్టాప్! స్టాప్ ది రబ్బిష్!" ప్రాణేశ్వర్రావు హుంకరించాడు.

మహాబలేశ్వర్రావు కటాలున పైకిలేచాడు. ముందుకు నడిచి ప్రాణేశ్వర్రావు ముందు ఠీవిగా నిలబడ్డాడు. అతని మొహంలోకి తదేకంగా చూశాడు.

"మీరు అప్పుల్లో వున్నారు. అయినా కూతురిపెళ్ళి ఆగడానికి లేదు. అంచేత మీకు డబ్బు అవసరం. ఆ అవసరాన్ని కొంతవరకూ నేను తీరుస్తాను...."

"నీ బోడిసహాయాన్ని నేను తీసుకోనంటె ఏం చేస్తావ్?" తన జాతకాన్ని సంపూర్ణంగా అప్పజెప్పుతున్న మహాబలేశ్వర్రావుమీద ఆగ్రహంతో, అవమానంతో వుక్కిరిబిక్కిరవుతున్న ప్రాణేశ్వర్రావు హుంకరించాడు.

మహాబలేశ్వర్రావు చిన్నగా నవ్వాడు. "మిమ్మల్ని ఏమీ చేయను. తోకముడుచుకుని వెళ్ళిపోతాను. రెండ్రో

జాల్లో తాత్కాలిక వుద్యోగుల నియామకంలో మీరు లంచాలు కతికే మేనేజ్ మెంటుకి యెలా టోపీ వేశావో పూర్తి వివరాలతో ముఖ్యమైన వాళ్ళందరికీ రాతమూలకంగా తెలియచేస్తాను. ఆ ముఖ్యమైన వాళ్ళల్లో ఒక పత్రికా సంపాదకుడు కూడా వుంటాడు!"

ప్రాణేశరావు ఉక్కిరిబిక్కిరవుతూ, నమ్మలేనట్టు చూశాడు. అతని బట్టతలమీదా, నుదురుమీదా బొబ్బల్లా చెమట బిందువులు ప్రత్యక్షమయ్యాయి.

"నన్ను.... బెదిరిస్తున్నావా?" అతని బొంగురు కంఠంలో మేకపోతు గాంభీర్యం బలహీనంగా పలికింది.

"నేను ఊరికే బెదిరించే వ్యక్తిని కానని నా కళ్ళు మీకు యిదివరకే చెప్పివుండాలి!" మహాబలేశ్వరరావు సగర్వంగా అన్నాడు.

ప్రాణేశరావు అప్రయత్నంగా నిట్టూర్చాడు. పొగ చూరిన అతని పెదాల్ని చూస్తూ మహాబలేశ్వరరావు సిగరెట్ పాకెట్ని అతిసి వొళ్ళోకి విసిరాడు. అప్రయత్నంగా ప్రాణేశరావు సిగరెట్ తీసి, వణుకుతున్న చేత్తో పెదాలమధ్య యిరికించాడు. మహాబలేశ్వరరావు లైటర్ క్లిక్ మనిపించి, మంటని అతని సిగరెట్ కొసకి తగిలించాడు.

పొగ ఊదుతూ, దగ్గి ప్రాణేశరావు అతన్ని అదోలా చూశాడు. అతని బుర్రలో కంప్యూటర్లు వేగంగా లెక్కలు వేస్తున్నాయని మహాబలేశ్వరరావుకి తెలుసు.

"ఆల్ రైట్....నువ్వు నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నావ్! నేను ఉద్యోగం ఇప్పించలేనన్నావ్. నేను నీకు చేయగలిగిన సాయం ఏమిటి అయితే?" ప్రాణేశరావు చివరికి ధైర్యంగా ప్రశ్నించాడు.

"ఇప్పటికి బండి పట్టాలమీదికి వచ్చింది!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు. అతని చెయ్యి పాంటు జేబులోకి మారి ఇవతలికి వచ్చింది. మడతపెట్టిన కాగితాన్ని విదిల్చి, విడదీశాడతను. దాన్ని ప్రాణేశరావు మొహం ముందు పట్టుకున్నాడు.

"ఇది నాలుగురోజుల క్రితం మీరు సంతకంచేసి నాకు పంపిన ఇంటర్వ్యూ లెటర్, అవునా?"

కంపెనీ లెటర్ హెడ్ మీద టైప్ చేసిన ఉత్తరాన్నీ తన సంతకాన్నీ జాగ్రత్తగా చూస్తూ ప్రాణేశరావు అప్రయత్నంగా తలాడించాడు.

"ఇలాంటి యింటర్వ్యూ ఉత్తరాలు యెంతమంది అభ్యర్థులకి పంపించారు?" మహాబలేశ్వర్రావు ప్రశ్నించాడు.

"ఎందుకు?" ప్రాణేశరావు అనుమానిస్తూ అన్నాడు.

"చెప్తాను. ఎంతమంది?"

"మొత్తం తొమ్మండుగురనుకుంటాను...."

"మిస్టర్ ప్రాణేశరావ్, మీరు మీ సెక్షన్ నుంచీ ఫీల్డ్ ఆఫీసర్ వుద్యోగానికి యెవరెవరికి ఇలాంటి ఇంటర్వ్యూ వుత్తరాలు పంపించారో వాళ్ళందరి పేర్లూ, అడ్రెసులూ నాకు కావాలి...."

ప్రాణేశరావు కంగారుగా చూశాడు. "దే.. దేనికి?"

"ఆ వుద్యోగం నాకు కావాలి" మహాబలేశ్వర్రావు స్పష్టంగా అన్నాడు.

ఆశ్చర్యంతో ప్రాణేశరావు నోరు తెరుచుకుంది. "నీకు వుద్యోగం కావాలంటే, నువ్వు వేరే ప్రయత్నం చేయాలి. కాండిడేట్స్ వివరాలు సంపాయించి ఏమీ చేయలేవు!"

మహాబలేశ్వర్రావు చిన్నగా నవ్వాడు. "ఎలా ప్రయత్నించాలో నాకు తెలుసు. ఆ లిస్టు నాకు కావాలి...."

"ఎందుకు? వివరంగా చెప్తేగానీ నేను ఏమీ చేయలేను!"

"మిస్టర్ ప్రాణేశ్వరావ్, బఫిలో ఫెర్టిలైజర్స్ ఫీల్డాఫీసర్ వుద్యోగానికి తొమ్మండుగుర్ని ఇంటర్వ్యూకి రమ్మన్నారు. ఇంటర్వ్యూకి నలుగురే వస్తే ఏం చేస్తారు?" మహాబలేశ్వర్రావు ప్రశ్నించాడు.

"వచ్చిన వాళ్ళలోంచే ఒకర్ని సెలెక్టు చేస్తారు...."

"ఒక్కడే వస్తే?" మహాబలేశ్వర్రావు అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"...అతన్నే సెలెక్టు చేస్తారు."

"ఆ ఇంటర్వ్యూకి జనవరి ఒకటో తేదీ నేను మాత్రం రావాలనుకుంటున్నాను."

ప్రాణేశ్వరావు వులిక్కిపడి, అయోమయంగా చూశాడు.

"అంటే...."

"అంటే, తతిమ్మా ఎనమండుగురూ ఇంటర్వ్యూకి రాకుండా చూస్తాను!"

"వాళ్ళని.... వాళ్ళని ఏం చేస్తావ్?" ప్రాణేశ్వరావు దిక్కుతోచని వాడిలా అడిగాడు. మహాబలేశ్వర్రావు వరస అతనికి మతిపోగొట్టేస్తోంది.

మహాబలేశ్వర్రావు పకపకా నవ్వాడు. "వాళ్ళని చంపను! మూడు వేల రూపాయల జీతం యిచ్చే వుద్యోగం కోసం ఎనమండుగురి ప్రాణాలు తీసేంతగా దేశంలో

పరిస్థితి దిగజారిపోలేదు!"

"నీ వాలకం చూస్తూంటే నువ్వు దిగజారిపోయా వేమో అనిపిస్తోంది!" నిస్సహాయస్థితిలో యిరుక్కున్న ప్రాణేశరావు ఉద్రేకంతో అన్నాడు.

మహాబలేశ్వర్రావు చిన్నగా నవ్వాడు. "కంగారుపడ కండి. నా తెలివితేటల్ని ఉపయోగించి వాళ్ళని అపు తాను. నేనొక్కడ్నే చస్తాను. అంతే!"

"యూ ఆర్ ఆస్కింగ్ ఫర్ టూ మచ్!"

"యూ ఆర్ రాంగ్, మిస్టర్ ప్రాణేశరావ్! మినిస్టర్ల సిఫార్సులూ, మంచి వుద్యోగాలకోసం కొన్ని సంవత్సరాల జీతాన్ని డిపాజిట్‌గా ఒకే ఇన్‌స్టాల్ మెంట్‌లో చెల్లించే అభ్యర్థులూ, కమీషన్ తనూలు చేసుకుని బలహీనులకి చిల్లర ఉద్యోగాలిచ్చే మీలాంటి సెక్షన్ ఆఫీసర్లూ, ధనబలానికీ, భుజబలానికీ లొంగి పోయి గొప్ప గొప్ప అభ్యర్థులకి ఉద్యోగాలిచ్చే మీ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్లూ, మీ నాటకాల్ని కంఫర్ట బుల్‌గా ఇగ్నోర్ చేస్తూ కోట్లకికోట్లు లాభాలు దోచు కునే ఫ్యాక్టరీ యజమానులూ—ఉన్నంత కాలం నా లాంటివాడు యిలాంటి కొత్త పద్ధతిని అనుసరించి తెలి విగా ఉద్యోగం సంపాయించాల్సిందే!" మహాబలేశ్వ ర్రావు చిన్నగా ఉపన్యాసం ఇచ్చాడు.

ప్రాణేశరావు మూగవాడిలా కూచుని, జేబురుమాల్తో బట్టతలనీ, మొహాన్నీ తుడుచుకున్నాడు. దీనంగా మహా బలేశ్వర్రావుని చూశాడు. "ఇంతకీ....నన్నేం చేయ మంటావు?"

మహాబలేశ్వర్రావు చిరునవ్వు నవ్వుతూ సోఫాలో కూచున్నాడు. "చిన్న పని! ఇంటర్వ్యూ అభ్యర్థుల

లిస్టూ, ఇంటర్వ్యూ చేసే వ్యక్తుల లిస్టూ వాళ్ళ బయోడేటా వగైరా వివరాలు ఇస్తేచాలు. రేపు సాయంత్రం యిదే టైముకి యిక్కడే వుంటాను. తలుపు తాళం వేయను!"

"అదంతా మోస్టు కాన్ఫిడెన్షియల్ .... నా ఉద్యోగం ఊడిపోతుంది...." ప్రాణేశరావు మొహం తెల్లబారసాగింది.

"ఒప్పుకుంటాను. దీన్నంతా కాన్ఫిడెన్షియల్ గా వుంచకపోతే రేపొద్దున నాకు ఉద్యోగం రాదు. వచ్చినా మీ ఉద్యోగంలాగే ఊడిపోతుంది. నేను అడిగింది సప్లై చేయండి. నేనిచ్చేది తీసుకోండి. మరుక్షణం అంతా మరచిపోయి, అయిదో అల్లుడికోసం అన్వేషణ ప్రారంభించండి!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

ప్రాణేశరావు ఆరిపోయిన సిగరెట్ ని యాష్ ట్రేలో నొక్కుతూ వుండిపోయాడు. మెల్లిగా తలెత్తి వెర్రివాడిలా మహాబలేశ్వర్రావుని చూశాడు. అతను నోటితో అడగలేని ప్రశ్నని అతని కళ్ళల్లో మహాబలేశ్వర్రావు చదువుతూ చిరునవ్వు నవ్వాడు.

మెల్లిగా పైకి లేచాడు. ప్యాంటు జేబులోంచి వంద రూపాయలకట్టని ఇవతలికి లాగి ప్రాణేశరావు వొళ్ళో పడేశాడు. "అయిదువేలు. అడ్వాన్స్. నాకు రావాల్సింది యిచ్చాక మరో అయిదువేలు చెల్లించబడుతుంది...."

"చిన్న మొత్తానికి మరీ పెద్ద రిస్కు...." ప్రాణేశరావు నోట్లకట్టమీద అరచేతిని బోర్లిస్తూ అన్నాడు.

మహాబలేశ్వర్రావు అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "మిస్టర్ ప్రాణేశరావ్, పైసా ఇవ్వకుండా,

ఆ మాటకొస్తే ఈ గది అద్దె మీ చేతే కట్టించి, ఆ విధ రాల్ని ఊడబీక్కోగలను! నేను కాలు కదిపితే మీ ఆట కట్టవుతుంది! అన్నేళ్ల క్రితం మీరు రోజువారీ జీతంమీద ఉద్యోగాల్లో పెట్టిన దుర్గయ్యా, మునీశ్వర్ వగైరా అయిదుగురు మీకు యెంతెంత ఇచ్చారో, తరువాత నెల నెలా ఎంతెంత ఇస్తున్నారో నాకు చెయ్యి కోసి రాసి సపై చేశారు!"

ప్రాణేశరావు పెదవులు గడగడ వణికాయి. "దొంగ ముండాకొడుకులు! అప్పుడు కాళ్ళు పట్టుకున్నారు. ఇప్పుడు ...."

"వాళ్ళమీద ఆగ్రహించి, ఆత్రపడి యేమీ చేయకండి. తరువాత విచారిస్తారు. దుర్గయ్య నాకు బావ మరిది!" మహాబలేశ్వరరావు నవ్వుతూ అన్నాడు.

ప్రాణేశరావు కంగారుగా, ఆశ్చర్యంగా చూశాడు. మహాబలేశ్వరరావు చిన్నగా నవ్వాడు. "కేవలం పెళ్ళి కావాల్సిన మీ కూతురిని మనసులో వుంచుకుని యీ మొత్తం యిస్తున్నా. అది గుర్తుంచుకోండి!"

ప్రాణేశరావు మెల్లిగా లేచాడు. నోట్లకట్టని పాంటు జేబులోకి దోపుకున్నాడు. అదోలా మహాబలేశ్వరరావుని చూశాడు.

"మహాబలేశ్వరరావ్, నీకు పెళ్ళయిందా?" అతని కంఠంలో ఏదో ఆశ ప్రతిధ్వనించింది.

మహాబలేశ్వరరావు పక పక నవ్వుతూ వుండిపోయాడు. "అది మనకి అనవసరం! అయినా, నేను మీకు అల్లుడిగా పనికిరాను. నాది మీ తెగ కాదు!"

"ఐడోంట్ కేర్! ఎందుకో తెలీదుగానీ, అయామ్ బిగినింగ్ టూ లైక్ యూ...." ప్రాణేశరావు మెరిసే

కళ్ళతో చూశాడు.

"థాంక్యూ! అయితే రేపు సాయంత్రం జాతకాలు పట్టుకురండి; సంభావన పట్టుకెళ్ళండి!" మహాబలేశ్వరరావు నవ్వుతూ అన్నాడు....

## 2

అతను లోపలి గదిలో సోఫామీద ఠీవిగా కూచున్నాడు. ముందున్న టీపాయ్‌మీద ఖరీదైన లెదర్ ఫోల్డర్ వుంది. దానిమీద 'బఫెలో ఫెర్టిలైజర్స్' అని ఇంగ్లీషులో బంగారం రంగులో ఎంబోస్ చేయబడింది. దాని పక్కనే కొన్ని కార్డుబోర్డు ఫైల్స్ ఒకదానిమీద ఒకటి పెట్టబడి వున్నాయి.

సిగరెట్ వెలిగించి, అతను లెదర్ ఫోల్డర్ని అందుకున్నాడు. పక్కనే సోఫామీద పడేసి, తెరిచి బఫెలో ఫెర్టిలైజర్స్ లెటర్ హెడ్ మీద ఎగ్జిక్యూటివ్ టైప్‌లో టైప్ చేయబడిన ఉత్తరాన్ని చిరునవ్వుతో చదువుతూ వుండిపోయాడు.

కంపెనీ జనవరి ఒకటో తేదీ యేర్పాటు చేసిన ఇంటర్‌వ్యూకి ముందుగా, డిసెంబరు 31 నాడే కంపెనీ పబ్లిక్ రిలేషన్స్ అండ్ వెల్‌ఫేర్ ఆఫీసర్ని హోటల్ లక్స్‌లో ప్రిలిమినరీ ఇంటర్‌వ్యూ కోసం కలుసుకొమ్మని అభ్యర్థులకి రాసిన ఉత్తరం అది. ఎంతో చాకచక్యంగా వ్యవహరించి తను తయారుచేసుకున్న పథకం ప్రకారం అంతా సవ్యంగా జరిగింది. ఎనమండుగురు అభ్యర్థులూ ఠంచన్‌గా వచ్చేశారు. ముందుగదిలో కూచున్న వాళ్ళలో ఏ విధమైన ఆలోచనలు సాగుతున్నాయో వూహించడానికి ప్రయత్నిస్తూ మహాబలేశ్వరరావు చిరునవ్వు నవ్వుకున్నాడు.

కంపెనీ ఉత్తరం కింద వరుసగా వున్న ఎనమండు

గురు అభ్యర్థుల పేర్లనీ అతను ఒకసారి లోపలే చదువుకున్నాడు. ఫోల్డర్ని చేత్తో పట్టుకుని పైకి లేచాడు. ఠీవిగా నడుస్తూ అద్దం ముందు ఆగాడు. సరి కొత్త సూటులో దర్జాగా అవుపిస్తున్న ప్రతిబింబాన్ని తృప్తికరంగా చూసుకున్నాడు. తను బఫెలో ఫెర్టిలైజర్స్ ప్రొప్రయిటర్ అని చెప్పుకున్నా కూడా వాళ్ళు నమ్మేస్తారు. అంత హుందాగా వున్నాడు తను! ముక్కు కొనమీద వులిపిరికాయా, చెవుల్ని కప్పిన క్రాపూ, రిమ్‌లెస్ కళ్ళద్దాలూ, వెడల్పాటి మీసాలూ తన అసలు రూపాన్ని చక్కగా దాచేశాయి...

అద్దం ముందునుంచీ గిరుక్కున వెనక్కి తిరిగి మహాబలేశ్వర్రావు గుమ్మంవైపు నడిచాడు. తలుపు తెరిచి, కర్టెన్ని తోసుకుని స్టేజిమీదికి ప్రవేశిస్తున్న ఫేమస్ యాక్టర్లా ముందు గదిలోకి ప్రవేశించాడు.

కుర్చీల్లో కూచున్న ఎనమండుగురు యువకులు ఆదరాబాదరా లేచినించున్నారు. బంగారం రంగులోని అక్షరాలు వాళ్ళకి అవుపించేలా అతను లెదర్ ఫోల్డర్ని తన ఛాతీకి ఆన్చి పట్టుకున్నాడు. భయభక్తులతో తనని చూస్తోన్న యువకుల్ని పరిశీలనగా చూస్తూ కాసేపు మౌనంగా వుండిపోయాడు.

"మీరంతా ఈ ప్రిలిమినరీ ఇంటర్వ్యూకి వచ్చినందుకు సంతోషిస్తున్నా. అయామ్ ప్రాణేశరావ్" మహాబలేశ్వర్రావు కంఠం గంభీరంగా ధ్వనించింది. ప్రాణేశరావు పేరును వుపయోగించుకొంటున్నందుకు లోపల్లోపలే నవ్వుకుంటూ అతను వినయంగా కదులుతున్న ఎనిమిదిమంది తలల్నీ తృప్తికరంగా చూశాడు.

"ఈ రోజుల్లో ఇంటర్వ్యూలు ఎంత ఫార్సుగా తయా

రయ్యారో మీకు తెలుసు. ముందే టెలిఫోన్ల ద్వారా ఎవరో అభ్యర్థిని సెలెక్టు చేసేసుకుని, పబ్లిసిటీకోసం నామ మాత్రం ఇంటర్వ్యూ జరిపి చేతులు కడుక్కునే దరిద్రపు పద్ధతి ఎక్కువగా అమలులో వుంది....” మహాబలేశ్వ ర్రావు ఆగాడు. పదహారు కళ్ళు ఉద్రేకంతో అతన్ని చూస్తున్నాయి.

“ఫైనల్ సెలెక్షన్లో, అవకతవకలు జరగడానికి వీల్లేకుండా అభ్యర్థుల్ని నిజాయితీతో పరిశీలించే ఉద్దే శంతో కంపెనీ పి.ఆర్.ఓ. అండ్ వెల్ఫేర్ ఆఫీసర్ హోదాలో నేను ఈ ప్రిలిమినరీ ఇంటర్వ్యూ నిర్వహి స్తున్నా....” మహాబలేశ్వర్రావు వాళ్ళను తదేకంగా చూస్తూ ఆగాడు. తన ప్రకటన అయిదుగురి మొహాలకి రిలీఫ్నీ, ముగ్గురి మొహాలకి అర్థంకాని నిరుత్సాహాన్ని పూసినట్టు అతను గ్రహించాడు.

“అభ్యర్థులకీ, సంస్థకీ మేలుచేసే ఉద్దేశంతో జరుగు తున్న ఈ ఇంటర్వ్యూల గురించి రేపు జరిగే ఇంటర్ వ్యూలో పాల్గొనే సెలెక్షన్ బోర్డు సభ్యులకి బొత్తిగా తెలీదు. తెలిస్తే మీకు న్యాయం జరగదు!” మహాబలేశ్వ ర్రావు నవ్వుతూ అన్నాడు.

అయిదుగురు అమాయకంగా, ముగ్గురు ఒక్కరకం ఆందో ళనగా తనవేపు చూడ్డం అతను తృప్తికరంగా గమనిం చాడు. తను చాకచక్యంగా, సులభంగా ఎనిమిదిమందిని రెండు గ్రూపులుగా విభజించగలిగాడు.

“ఈ క్షణంలో మీకో సలహా ఇస్తున్నా! హోటల్ లక్స్, రూమ్ సిక్స్‌లో ప్రస్తుతం జరుగుతున్న ఇంటర్వ్యూల గురించి మీరు యెలాంటి పరిస్థితిలో యెవ్వరికీ చెప్ప కూడదు! ఈ క్షణం నుంచీ కంపెనీ కళ్ళు మీ మీదే

వుంటాయి. ఈ కాన్ఫిడెన్స్ని యే మాత్రం భంగం చేసినా ఫైనల్ సెలెక్షన్లో అది మిమ్మల్ని డిస్క్వాలిఫై చేస్తుంది! అందుకే మొదటి ఇంటర్వ్యూ గురించి అతి రహస్యంగా వుంచమని మీకు రాయడం జరిగింది. ఈ పాయింట్ మీ కందరికీ క్లియర్ గా అర్థమైందనుకుంటున్నాను...." మహాబలేశ్వర్రావు ఆగి, ప్రశ్నార్థకంగా చూశాడు.

"అర్థమైంది సార్...." ఎనిమిది కంఠాలు బృంద గానం లెవెల్లో అన్నాయి.

"రైట్....నాతోపాటు అందరూ లోపలికి రండి. అక్కడున్న ఫైల్స్ని తలా ఒకటి తీసుకోండి అందులో మీ గురించిన వివరాలున్నాయి. రెండో పేజీలో ఒక ప్రశ్నావళి వుంది. ఆ ప్రశ్నలు మీకు కొత్తగా అవుపిస్తాయి. కంగారుపడకండి. సాధారణంగా యెవ్వరూ, ఇంటర్వ్యూల్లో అడగకుండా పూర్తిగా నిర్లక్ష్యం చేసే, అతి సాధారణమైన వివరాలు అడగబడ్డాయి. నిజాయితీగా నిర్భయంగా వాటికి సమాధానాలు రాయండి. మీరు సమాధానం రాయలేని ప్రశ్న అందులో లేదు! మీ గురించి మేం కనిపెట్టిన విషయాలతో మీరు స్వయంగా ఇచ్చే సమాధానాలు పోల్చిచూడబడతాయి. అంచేత— బీ ఫ్రాంక్ అండ్ ఫియర్లెస్!"

ఉపన్యాసం ముగించి మహాబలేశ్వర్రావు వెనుదిరిగి డోర్ను తోసి పట్టుకున్నాడు. అతని సైగతో అభ్యర్థులంతా ఏ.సి. గదిలోకి మారారు. లోపలికి జరిగి, మహాబలేశ్వర్రావు తీరిగ్గా సోఫావైపు నడిచాడు. కూచుని పక్కనేవున్న ఫైళ్ళని అందుకున్నాడు.

"నాగేంద్ర!" ఫైలువేపు చూడకుండా పిలిచాడతను.

ఒక యువకుడు దగ్గరగా జరిగి ఫైలుని అందుకున్నాడు. ఫైలు మీద అతని పేరులేదు.

ఫైళ్ళవైపు చూడకుండా మహాబలేశ్వర్రావు వరసగా పేర్లు పిలిచాడు. ఒకదాని తరువాత ఒకటిగా వరుసగా ఫైల్సుని అందించాడు. వరసగా తమ పేర్లని గుర్తుంచుకుని తమకి సంబంధించిన ఫైల్సుని పొరపాటు లేకుండా అందిస్తున్న బఫెలో ఫెర్టిలైజర్స్ ఆఫీసర్‌ని అభ్యర్థులు భయభక్తులతో చూస్తూ నించున్నారు. తమను గురించి తమ కన్నా అతనికి అధికంగా తెలుసన్న భావం వాళ్ళ మొహాలమీద ప్రత్యక్షమైంది.

"గోడవారగా వున్న కుర్చీల్లో వరసగా కూచోండి. ప్రశ్నలకి సమాధానం రాయండి. యూ కెన్ హేవ్ ఫిఫ్టీన్ మినిట్స్!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

అందరూ ఆదరాబాదరా కుర్చీలవైపు కదిలారు. ప్రియశిష్యుల్ని చూస్తున్న గురువులా వాళ్ళని చిరునవ్వుతో చూస్తూ మహాబలేశ్వర్రావు సిగరెట్ వెలిగించాడు....

* * *

పదిహేను నిమిషాలు గడిచాయి. అభ్యర్థులు అందించిన ఎనిమిది ఫైళ్ళనీ తన పక్కనే పెట్టుకున్న మహాబలేశ్వర్రావు, తన రూంకు తొమ్మిది కప్పుల స్ట్రాంగ్ టీ పంపించమని రిసెప్షన్‌కి ఆర్డరిచ్చాడు.

"మీరంతా ముందు గదిలో కూచోండి. టీ వస్తుంది. తాగండి. తరువాత ఒక్కొక్కర్నే పిలుస్తాను...." అన్నాడతను అధికారం ధ్వనించే కంఠంతో.

బఫెలో ఫెర్టిలైజర్స్ ఫీల్డాఫీసర్ ఉద్యోగానికి అప్లై

చేసిన యువకులు బర్రెల మందలా గుమ్మంవైపు కది లారు....

మొదటి ఫైలుని తెరిచాడు మహాబలేశ్వర్రావు. అభ్యర్థి అమాయకంగా, నిజాయితీగా రాసిన సమాధానాలు అతని పెదవుల్ని చిరునవ్వుతో విడదీస్తున్నాయి.

తలుపు చప్పుడయింది. టీ కప్పుతో సర్వర్ లోపలికొస్తున్నాడు. కాస్సేపట్లో మూసుకుంటూ తలుపు చిన్నగా చప్పుడు చేసింది. ముందున్న టీ కప్పు అందుకుని మెల్లిగా చప్పరిస్తూ మహాబలేశ్వర్రావు ఫైల్సు తిరగేస్తూ వుండిపోయాడు....

మరో పదిహేను నిమిషాలు గడిచాయి. ఎనిమిది ఫైళ్ళనీ కొత్త వరుసలో సర్ది, పక్కన పడేసి మహాబలేశ్వర్రావు గుమ్మంవైపు నడిచాడు. తలుపు లాగి ముందు గదిలోకి తొంగి చూశాడు. తగ్గు స్వరాల్తో ఏదో చెప్పుకుంటున్న యువకులు ఆదరాబాదరా నించున్నారు.

"డియర్ కాండిడేట్స్, ఇప్పుడు సరికొత్త ఆర్డర్లో మీ పేర్లు పిలుస్తాను. ఆ క్రమంలో మీరంతా కుర్చీల్లో మారి కూచోండి. మొదటి అభ్యర్థి మొదట గదిలోకి వస్తాడు. పదినిమిషాల్లో ఇంటర్వ్యూ ముగిస్తాను. అతను తిరిగిరాగానే రెండో వ్యక్తి, అతను తిరిగిరాగానే తర వాతి వ్యక్తి... ఇలా మీరు లోపలికి రావాలి...." మహాబలేశ్వర్రావు ఆగాడు.

సమాధానాలు రాశాక తను ఫైళ్ళని అరేంజ్ చేసిన క్రమంలో వాళ్ళ ఎనమండుగురి పేర్లనీ గంభీరమైన కంఠంతో చకచకా పిలవసాగేడు. కొత్తక్రమంలో వాళ్ళ పేర్లని గుర్తుంచుకున్నందుకు అతను తనని తనే అభినందించుకున్నాడు.

కాసేపట్లో అభ్యర్థులు అదే క్రమంలో కుర్చీల్లో కూచున్నారు. మొట్టమొదట పరిచయం చేస్తూ వాళ్ళ మొహాల్లో అవుపించిన రియాక్షన్ నిబట్టి రెండు గ్రూపులుగా తను విభజించిన క్రమంలో వాళ్ళు యిప్పుడు వున్నందుకు మహాబలేశ్వర్రావు లోపల్లోపలే సంతోషించాడు. ఒక గ్రూపులోని అయిదుగురూ ముందున్నారు. రెండో గ్రూపుకి చెందిన ముగ్గురూ చివరున్నారు. ఇప్పుడు తను అరేంజి చేసిన క్రమం చివరి ముగ్గురి మొహాలకీ మరో కొత్తరంగు పులిమినట్టు మహాబలేశ్వర్రావు గ్రహించాడు. తన అంచనా నిజం కాబోతోంది....

"రామసీతారావు...." అంటూ మహాబలేశ్వర్రావు తలుపును వదిలేసి లోపలికి తిరిగాడు. చకచకా నడిచి సోఫాలో హుందాగా కూచుని వెనక్కి వాలాడు.

మూసుకున్న తలుపుముందు నిలబడ్డ మొదటి వ్యక్తి రామసీతారావు బెరుగ్గా చూశాడు. మెల్లగా అడుగు లేస్తూ మహాబలేశ్వర్రావు ముందు ఆగాడు.

"మిస్టర్ రామసీతారావ్, ఇంతవరకూ మీ ద్వారా తెలుసుకోని కొన్ని విషయాలు యిప్పుడు మీ ద్వారా తెలుసుకునే ప్రయత్నం చేస్తాను...." అంటూ మహాబలేశ్వర్రావు ఆగాడు.

ఇంటర్వ్యూ అధికారి ఏమడుగుతాడో బొత్తిగా అంతుబట్టని రా మ సీ తా రా వు ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు.

"ఆ టేబుల్ మీద టేప్‌రికార్డర్ వుంది. దాన్ని ఆన్ చేసి తలుపు దగ్గరగా, గోడవారగా పెట్టండి!" మహాబలేశ్వర్రావు ఉత్తరువిచ్చాడు.

రామసీతారావు అయోమయంగా చూశాడు. మహా

బలేశ్వర్రావు చిరునవ్వుతో చూశాడు. "కంగారు పడకండి. రవిశంకర్ సితార్ కాసెట్ అందులో ఉంది. నేను మిమ్మల్ని అడిగే ప్రశ్నలూ, మీరు చెప్పే జవాబులూ అటువేపున వున్న మన మిత్రులు వినకూడదు!"

అర్థమైనట్టు అప్రయత్నంగా రామసీతారావు బుర్ర ఆడించాడు. ఉషారుగా కదిలి, టేప్ రికార్డర్ని గోడ వారగా పెట్టి ఆన్ చేశాడు. అంతకుముందే మహాబలేశ్వర్రావు ఫిక్స్ చేసి వుంచిన వాల్యూంలో పండిట్ రవిశంకర్ సితార్ని పలికించడం ప్రారంభించాడు.

రామసీతారావు గది పెడల్పును కొలుస్తున్న వాడిలా మహాబలేశ్వర్రావు ముందుకు నడిచాడు.

"సిట్ డౌన్ అండ్ రిలాక్స్!" మహాబలేశ్వర్రావు గంభీరంగా అన్నాడు.

సోఫా అంచుమీద జాగర్తగా కూచుని, రామసీతారావు అతని వైపు సాభిప్రాయంగా, వినయంగా చూశాడు.

అతని పేరున్న ఫైల్ని తొడమీద పెట్టుకుని, మహాబలేశ్వర్రావు కోటుజేబులోంచీ గైడర్ పెన్ తీశాడు. మెల్లిగా తలెత్తి రామసీతారావు మొహంలోకి తదేకంగా చూశాడు. మెల్లిగా అతని పెదవులు కదిలాయి.

మహాబలేశ్వర్రావు ప్రశ్నించడం ప్రారంభించాడు.

• • •

గంట పైగా గడిచింది. అయిదో అభ్యర్థిని ప్రశ్నించడం పూర్తిచేసి, మహాబలేశ్వర్రావు సిగరెట్ వెలిగించాడు. అతనిలో రకరకాల ఆలోచనలు పక్షిపిల్లల రెక్కల్లా రెపరెపలాడుతున్నాయి. అయిదుగురితో తను యేర్పాటుచేసిన మొదటి గ్రూప్ యింటర్వ్యూ పూర్త

యింది. రెండో గ్రూపుని తను చాకచక్యంగా, కొత్త రకంగా ఇంటర్వ్యూ చేయాలి. రెండో గ్రూపు ఇంటర్వ్యూ మీదే తన ప్లాను ఆధారపడి ఉంది....

మహాబలేశ్వర్రావు ముందు గదిలోకి ప్రవేశించాడు. స్వయంవరం సందర్భంలో యెవరో రాజకుమారి వేయబోయే పూలదండకోసం మెడలు చాపి కూచున్న రాజకుమారుల్లా యొనమండుగురు అభ్యర్థులూ కుర్చీల్లో కూచున్నారు.

"మీరు అయిదుగురూ, మీ గదులకి వెళ్ళొచ్చు. చాలా సేపట్నుంచీ అలసటగా అనుపిస్తున్నారు. రిసెప్షన్‌కి ఫోన్ చేసి టిఫిన్ తెప్పించుకు తినండి!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

ఐదుగురూ లేచినిలబడ్డారు. గుమ్మంవైపు కదిలారు.

"జస్ట్ మోమెంట్!" మహాబలేశ్వర్రావు కంఠం వాళ్ళని, తాడులా చుట్టి ఒకేసారి వెనక్కి తిప్పింది.

"జరిగిందాన్ని టాప్ సీక్రెట్‌గా వుంచుకోవాలని మీకు యిదివరకే సలహా ఇచ్చాను. సలహా పాటిస్తే మీకే మంచిది. నిర్లక్ష్యం చేస్తే మాకు మంచిది!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

ఐదుగురూ నవ్వే ప్రయత్నం చేసి, వోడిపోయి అర్థంకానట్టు చూశారు.

"మా సంస్థ కళ్ళూ, చెవులూ అనుక్షణం మిమ్మల్ని గమనిస్తూ ఉంటాయి. కాన్ఫిడెన్స్‌కి భంగం కలిగించిన వ్యక్తి రేపటి ఫైనల్ సెలెక్షన్‌లో ఆటోమాటిక్‌గా తనని డిస్‌క్వాలిఫై చేసుకుని, ఎన్నికలో మాకు ఇబ్బందిని తగ్గించేస్తాడు!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

ఈసారి ఐదుగురూ నవ్వారు.

"నా యూ కెన్ గో!" మహాబలేశ్వర్రావు ఉత్తరు విచ్చాడు.

కాన్సేపట్లో అయిదుగుర్నీ అంతర్ధానం చేస్తూ తలుపు మూసుకుంది.

మిగిలిన ముగ్గురిలో మొదటి వ్యక్తికి సైగ చేస్తూ మహాబలేశ్వర్రావు లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు. యువకుడు పైకి లేచి, పాంటులోంచీ బాగా పైకి జరిగిన చొక్కాని బెల్టులోపలికి తోసుకున్నాడు. ఇద్దరివైపూ ఒకసారి పళ్ళికిలించి గుమ్మంవైపు నడిచాడు.

# 3

తన ముందు కూచున్న లావుపాటి యువకుణ్ని మహాబలేశ్వర్రావు చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ సుకుమార్, 'మీరు యెవర్నైనా ప్రేమిస్తున్నారా?' అన్న ప్రశ్నకి మీరు 'లేదు' అని సమాధానం రాశారు మీరు తప్పుడు సమాధానం రాశారు...."

"నో! ఇటీస్ కరెక్ట్!" సుకుమార్ ఆత్రంగా అడ్డు తగిలాడు.

"నో మిస్టర్ సుకుమార్, యూ ఆర్ రాంగ్!" మహాబలేశ్వర్రావు అతన్ని ఖండిస్తున్నట్టు అన్నాడు. "ఎవర్నీ ప్రేమించకుండా యే వ్యక్తీ సమాజంలో జీవించలేడు; జీవించకూడదు! మీరు మీ అమ్మనో, నాన్ననో, అన్ననో, తమ్ముణ్నో, అక్కనో, చెల్లెల్నో స్నేహితుల్నో—కనీసం మిమ్మల్నో ప్రేమిస్తూ ఉండితీరాలి! మీ ఆన్సర్ తప్పని ఇప్పుడు ఒప్పుకుంటారా?"

సుకుమార్ అరచేత్తో నుదుర్ని తడుముకున్నాడు. ఆరిపోతున్న పెదవుల్ని నాలుకతో తడిపాడు.

"ఐ థింక్...."

"డోంట్ థింక్! ఆలోచించి సమాధానాలు రాసే పనికిరాని ప్రశ్నలు మీకు యివ్వబడలేదు!" మహాబలేశ్వ ర్రావు ఆడిగొస్తూ అన్నాడు. "ఇప్పుడు చెప్పండి; ఎవర్నీ ప్రేమించకపోయినా, మిమ్మల్ని మీరు—కనీసం— ప్రేమించాలి. అవునా?"

"ఆఫ్‌కోర్స్" సుకుమార్ తడబడుతూ అన్నాడు.

"ఎవర్నైనా ప్రేమిస్తున్నారా అన్న ప్రశ్నకి 'లేదు' అని రాంగ్ అన్సర్ యెందుకు రాశారు?" మహాబలేశ్వ ర్రావు గంభీరంగా అడిగాడు.

ఊహించని ప్రశ్నలకి ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు సుకుమార్.

"మిమ్మల్ని మీరు ప్రేమిస్తున్నట్టు యెందుకు రాయ లేదు?" మహాబలేశ్వర్రావు కంఠం రవిశంకర్ సితార్ వాద్యాన్ని మింగేస్తూ ధ్వనించింది.

"నేను అలా అనుకోలేదు. ఎవర్నైనా అంటే యే అమ్మాయినైనా ప్రేమిస్తున్నారా అని అర్థం చేసు కున్నాను...." సుకుమార్ ధైర్యాన్ని చిక్కబట్టు కుంటూ అన్నాడు.

మహాబలేశ్వర్రావు చిన్నగా నవ్వాడు. "ఆల్ రైట్, మీరు యెవరో అమ్మాయిని ప్రేమిస్తున్నట్టే యెందుకు రాయలేదు?"

సుకుమార్ కంగారుగా చూశాడు. "నేను....ఎవర్నీ ప్రేమించడంలేదు...."

మహాబలేశ్వర్రావు అతన్ని తీక్షణంగా చూశాడు. "సుకుమార్, రాతలోనే కాకుండా, మాతలో కూడా మీరు మాకు అబద్ధాలు అందిస్తున్నారు! అయామ్ సారీ...."

"ఏమిటి మీ అర్థం?" సుకుమార్ కళ్ళు చిట్లించాడు.

"మీరు మీ ఊళ్ళో పటేల్ నగర్లో వున్న సుందరేశంగారి రెండో అమ్మాయి క్రాంతిని ప్రేమిస్తున్నారు; అయితే నిజం చెప్పడంలేదు—అని నా అర్థం!"

సుకుమార్ మొహం ఆశ్చర్యాన్ని అద్దంలా చూపిస్తోంది. అదుర్దాతో చూశాడతను.

"మీకు ...ఎలా.... తెలుసు........?" అతని కంఠం బొంగురుగా తయారైంది.

"అన్నీ తెలుసుకోడమే మా స్క్రీనింగ్ పద్ధతి!" మహాబలేశ్వర్రావు గంభీరంగా అన్నాడు.

"అయినా, అలాటి వ్యక్తిగత విషయాలతో ఎవరికీ సంబంధం ఉండకూడదని నా నమ్మకం!" సుకుమార్ ధైర్యంగా అన్నాడు.

"డైరెక్టుగా సమ్బంధం లేకపోవచ్చు. కానీ బాధ్యత కలిగిన ఉద్యోగానికి అభ్యర్థిని ఎంపిక చేసే సందర్భంలో మేం అన్నీ తెలుసుకుంటాం. సంస్థకీ, ఉద్యోగికీ అది మంచిదని మా అనుభవం రుజువు చేసింది..."

"ఐసీ.... ఇప్పుడు.... నేను...."

"మరో ప్రశ్నకి ధైర్యంగా సమాధానం ఇస్తారు!" అంటూ మహాబలేశ్వర్రావు సోఫాలో ముందుకి వాలాడు. ఏదో రహస్యం చెప్పబోయేవాడిలా సుకుమార్ మొహంలోకి చూశాడు.

"మిస్టర్ సుకుమార్, మా సంస్థలో ఉద్యోగం పొందటానికి మీరు ఆఫర్ చేసిన మొత్తం ఎంత?"

పక్కలో బాంబుపడ్డట్టు సుకుమార్ అదిరిపడ్డాడు. ఆ బేరం చాలా చాలా రహస్యంగా జరిగింది. ఇతనికి ఎలా తెలుసు?

"ఆ మొత్తం యెంతో కూడా నాకు తెలియజేయబడింది. మీరు నిజం చెప్పడానికి వెనకాడతారని 'ప్రేమ ప్రశ్న'కి సమాధానంలో స్పష్టం చేశారు! అందుకే గుచ్చి అడుగుతున్నా; ఎంత?"

సుకుమార్ గుటకలు మింగి నిస్సహాయంగా చూశాడు. గదిలోని ఎయిర్ కండిషన్ని వెక్కిరిస్తూ అతని నుదురు మీద చెమటలు క్రమ్మసాగాయి.

"సమాధానం చెప్పే ఉద్దేశం లేకపోతే, మీరు వెళ్ళొచ్చు!"

"రెండు....లక్షలు...." సుకుమార్ నత్తి నత్తిగా అన్నాడు.

"గుడ్! నిజం చెప్పారు!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

మరో భావం కోసం సుకుమార్ అతని కళ్ళల్లోకి వెతుకుతూ చూశాడు. మహాబలేశ్వర్రావు కళ్ళు కూడా నవ్వుతున్నాయి.

"మీడియేటర్ ద్వారా అడ్వాన్స్ యెంత పే చేశారు?"

"మొత్తంలో....ఫిఫ్టీ పర్సెంట్...."

"రైట్!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు సిగరెట్ వెలిగించి అతన్ని తదేకంగా చూశాడు. సుకుమార్ కళ్ళు ఆత్రుత అనే ద్రవంతో నిండిన గిన్నెల్లా ఉన్నాయి.

"మిస్టర్ సుకుమార్, మా సంస్థ హోదానీ, మీ స్థితినీ, ఉద్యోగాన్నీ కలిపి చూస్తే మీ ఆఫర్ తగినంతగా లేదనిపిస్తోంది!"

సుకుమార్ నమ్మలేనట్టు చూశాడు. పదునైన కత్తిలా అవుపిస్తున్న, ప్రవర్తిస్తున్న ఈ అధికారి నాటకం ఆడుతున్నాడా? ఏమిటి అతని ఉద్దేశం?

"సుకుమార్, మీలో పడగెత్తుతున్న ప్రశ్నలు మీ మొహంమీద ప్రింటవుతున్నాయి. నేను నాటకం ఆడటం లేదు. వెల్ఫేర్ ఆఫీసరు హోదాలో మాట్లాడుతున్నా. మీ ఆఫర్ ని పెంచాలి ..."

"అం.... టే...." మందంగా తయారైన నాలుకని బలవంతంగా ఉపయోగిస్తూ అన్నాడు సుకుమార్.

"మీ సందేహాల్ని క్లియర్ చేస్తాను: ఫీల్డాఫీసర్ కి మా కంపెనీ బ్రహ్మాండమైన జీతం, డి.ఏ, హైక్లాస్ ట్రావెలింగ్ అలవెన్స్ వగైరా యిస్తుంది. అలాంటి ఉద్యోగం వృత్తి విశ్వాసపాత్రులకే ఎగిరి ఒళ్ళో వాలదు. మీరిచ్చే మొత్తం దాదాపు ఏడాదిలో మీకు జీతం వగైరాల రూపంలో తిరిగొస్తుంది. మీరిచ్చే మొత్తం యే వొక్క అధికారి జేబులోకీ వెళ్ళదు! అదంతా ఎంప్లాయీస్ వెల్ఫేర్ ఫండ్ కి జమ అవుతుంది. దాన్ని అందరూ, మీరు కూడా—సమంగా అనుభవిస్తారు. ఇది మా సంస్థ రూపొందించిన మాస్టర్ ప్లాన్!" మహాబలేశ్వరరావు ఉషారుగా అన్నాడు.

"నాకు....అర్థం కావడంలేదు...." సుకుమార్ నసిగాడు.

"అర్థం చెప్తాను: మీరు ఉద్యోగంలో చేరతారు. ఎంప్లాయీస్ వెల్ఫేర్ ఫండ్ కి నెలనెలా జీతంలోంచీ పాతిక రూపాయలు యిమ్మంటే సంతోషంగా యిస్తారా?"

'ఇవ్వను' అని సమాధానం చెప్పమంటున్న మహా

బలేశ్వర్రావు కంఠంలోని ధ్వనిని సుకుమార్ స్పష్టంగా విన్నాడు.

"...ఇవ్వనేమో...."

"ఇవ్వరు. మీరేకాదు; ఎవరైనా అంతే! అందుకే, మంత్రిగారి సిఫార్సులో ఉద్యోగాలని అమ్ముకోవడం కన్నా, ఇవ్వగలిగినవాళ్ళకీ, అర్హత ఉన్నవాళ్ళకీ అమ్ముకోడం అందరికీ లాభదాయకం అని నేను భావిస్తాను. సో, మీ ఆఫర్ని పెంచాలి!"

"మీరే చెప్పండి..." సుకుమార్ గాలం వదుల్తూ అన్నాడు.

"నా స్క్రీనింగ్ ప్రకారం, బైటున్న యిద్దరూ, మీరూ—మీ ముగ్గురే పోటీలో వున్నారు. మీరు రెండును మూడుగా చేయగలిగితే మంచిది!"

సుకుమార్ తేలిగ్గా నిట్టూర్చాడు. "మీ యిష్టం. అయితే ఆ యిద్దరూ...." సగంలో ఆపేశాడతను.

"మీరు ఒక ప్రశ్నకి తప్పుడు సమాధానం రాశారు. వాళ్ళు రెండు మూడు ప్రశ్నలకి రాశారు. అవకాశం మీకే యెక్కువగా వుంది....!" మహాబలేశ్వర్రావు నవ్వాడు.

"సార్....ఉద్యోగం....నాదే అంటారా?" సుకుమార్ ఆశగా అడిగాడు.

"నేను అనకూడదు. ఎమ్.డి. అంటారు. కాకపోతే ఈ ఇంటర్వ్యూ ఫలితాల్ని ఆయనకే నేను సమర్పిస్తాను! ఆల్రైట్; వెళ్ళండి. ఎవరితోనూ యేమీ చెప్పకండి. గదిలో విశ్రాంతి తీసుకోండి. ఆర్డర్సు చేతికి వచ్చేస్తుంది. మీ పేమెంట్ జరగాల్సి వుంటుంది...."

సుకుమార్ ఉద్రేకంతో పైకి లేచాడు. "వెళ్ళమం

టారా?"

"ఒక్కక్షణం. ప్రశ్నకి మీరు పొరపాటు జవాబు రాశారు. మైనస్ మార్కులు పడతాయి! ఇదిగో, కరెక్టు ఆన్సర్ రాసి, ఏమీ జరగనట్టు వెళ్ళిపొండి!" అంటూ మహాబలేశ్వర్రావు అతని ఫైల్ని టీపాయ్‌మీద పడేశాడు.

ఆదరాబాదరా అందుకుని సుకుమార్ తను క్రాంతిని ప్రేమిస్తున్నట్టు రాయడం ప్రారంభించాడు. ముగించి, భయభక్తుల్తో ఫైలుని అందించి నిటారుగా నించున్నాడు.

"మీ సహాకారానికి చాలా థాంక్స్, సార్....మీ మేలు "

"ఫర్గెటిట్!" మహాబలేశ్వర్రావు అడ్డుతగిలాడు. "రేపు ఇంటర్వ్యూ పూర్తయ్యేదాకా ఈ విషయంలో పూర్తి మౌనం పాటించడం మీకు తోడ్పడుతుంది. చివరి క్షణం మిమ్మల్ని మా సంస్థ ఫెయిల్ చేయొచ్చు; మీ ఆఫర్ ఆకాశాన్ని అందుకున్నా సరే!"

సుకుమార్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. "నోరు మెదపను. మీరు చెప్పినట్టు...."

"సుకుమార్, నోరు మూసుకోడం మీరింకా నేర్చుకోలేదు!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

సుకుమార్ ఉక్కిరిబిక్కిరిగా చూసి, కిక్కురుమనకుండా గదిలోంచీ ఇవతలికి నడిచాడు.

సోఫాలో వెనక్కి వాలి మహాబలేశ్వర్రావు సిగరెట్ వెలిగించాడు. ముందు గదిలో కూచున్న యిద్దరు అభ్యర్థులూ కాసేపట్లో సుకుమార్‌లాగే బైటికి వెళ్తారని అతనికి తెలుసు.

# 4

'బఫెలో ఫెర్టిలైజర్స్' అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్ ముందు అతను ఆటో దిగాడు. ముందుగా నే తను బాడుగ తీసుకున్న ఆటో డ్రైవరు అతనివేపు చూడకుండా ఆటోను బొంగరంలా తిప్పి వచ్చిన దారమ్మటే పోనిచ్చాడు.

సిగరెట్ వెలిగించి, అతను ఫుట్ పాత్ మీద చెట్టులా నిలబడ్డాడు. ఇంటర్వ్యూ ఈపాటికి పూర్తయివుంటుంది. తొమ్మిదో అభ్యర్థి అయిన తను అటెండ్ కానందుకు, ఇతర అభ్యర్థులూ, ఇంటర్వ్యూబోర్డు సభ్యులూ లోపలోపలే ఆనందిస్తూ వుంటారు. అయితే తను రానందుకు ఎస్టాబ్లిష్మెంట్ సెక్షన్ హెడ్ ప్రాణేశ్వరావు ఆశ్చర్యంలో మునిగి, తరవాత తీరిగ్గా తేలి, హాయిగా ఊపిరి పీల్చుకుని వుంటాడు!

ఇవాళ అతనికి రెండు విషయాలు పూర్తిగా మతి పోగొట్టి వుంటాయి: యేదో ప్లాన్‌తో తనొక్కడే రాకుండా ఇతర అభ్యర్థులంతా రావడం; ఒంటరిగా అటెండ్ కావాల్సిన తను—మహేశ్వరరావు—అసలు రాకుండా వుండటం! ఈపాటికి తనని ప్రాణేశరావు పిచ్చివాడికింద జమ కట్టేసి గొప్ప రిలీఫ్‌లో నవ్వుకుంటూ వుంటాడు.

సిగరెట్‌ని పెదాలమధ్య ఇరికించి, అతను రిస్టువాచీ చూసుకున్నాడు. ఇంటర్వ్యూకి తను గంట ఆలస్యంగా హాజరవుతున్నాడు. అయినా ఫరవాలేదు. ముందే, ఎవడో నిర్ణయించిన కాలవ్యవధి తనని కట్టిపడవేయదు! సగర్వంగా చిరునవ్వు నవ్వుకుంటూ అతను సిగరెట్ పీకని దూరంగా విసిరాడు.

అతనికి మళ్ళీ ప్రాణేశరావు గుర్తుకొచ్చాడు. తను రానందుకు ఇందాకా ఆశ్చర్యపోయిన ప్రాణేశరావు ఈ క్షణంలో తనని చూసి, అదిరిపోతాడు! నవ్వుకుంటూ అతను గేటువేపు ఠీవిగా నడిచాడు.

బిల్డింగ్ ముందున్న వరండా మీద నిలబడి అతను అటూ, ఇటూ చూశాడు. ఎన్‌క్వయిరీస్ కౌంటర్ వెనక ఉండాల్సిన వ్యక్తి లేడు. కుడివేపు తిరిగి అతను వేగంగా నడవసాగాడు. చివరున్న లిఫ్ట్‌ని సమీపించి, ఆగాడు. కాసేపట్లో లిఫ్ట్ ఆగింది.

"ఏ ఫ్లోర్ సార్?" యూనిఫామ్‌లో ఉన్న లిఫ్ట్ బాయ్ అతన్ని ప్రశ్నించాడు. అతను సమాధానం చెప్పకుండా, నిర్లక్ష్యంగా లిఫ్ట్‌లోకి దూరాడు. కళ్ళు చిట్లిస్తూ తనని చూస్తున్న లిఫ్ట్‌బాయ్‌ని చిరునవ్వుతో చూశాడు.

"ఇంటర్వ్యూ!" అన్నాడతను క్లుప్తంగా.

"ఇంటర్వ్యూ అయిపోయింది సార్...." లిఫ్ట్‌బాయ్ విసుగ్గా అన్నాడు.

"ఇంటర్వ్యూ ఆపాక్కూడా రమ్మని నాకు ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చారు. అక్కడికి తీసికెళ్ళు!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

లిఫ్ట్ కదిలింది....

కాస్సేపట్లో, లిఫ్ట్ కుర్రాడు చూపించిన గదిముందు నిలబడ్డాడు మహాబలేశ్వర్రావు. గది తలుపులు మూసి ఉన్నాయి. తను లోపలికి అడుగుపెట్టగానే ప్రారంభమయ్యే ప్రళయాన్ని తలుచుకుంటూ అతను హాయిగా నవ్వుకున్నాడు. సాలోచనగా వరండా ఇరువైపులా చూశాడతను. వరండా రెండువైపులా వివిధ సెక్షన్స్ న్నాయి. సెక్షన్స్‌లో కార్యక్రమాలు సాగుతున్నట్టు

న్నాయి. బైట సందడిలేదు. ఇంటర్వ్యూ కారణంగా సిబ్బంది బైటికి రాకుండా కట్టుదిట్టం చేసినట్టున్నారు!

ఆలోచనల్ని కత్తిరించేస్తూ అతను భుజంతో బలంగా తలుపుల్ని తోసుకుంటూ లోపలికి జొరబడ్డాడు. గోడ వారగా వున్న సోఫాలమీద వరసగా అభ్యర్థులు కూచున్నారు. అతను వాళ్ళవైపు పరిశీలనగా చూశాడు. తనరాక అందర్నీ ఉలిక్కిపడేలా చేసినట్టు అతను గుర్తించాడు. ఎదురుగా ఉన్న మూసిన తలుపు ముందు స్టూలుమీద ఠీవిగా కూచున్న యూనిఫామ్డ్ జవాను కోపంగా చూస్తూ అతని దగ్గరగా వచ్చాడు.

నిన్న తనని ఫ్యాక్టరీ పి.ఆర్.వో. అండ్ వెల్ఫేర్ ఆఫీసర్ హోదాలో, రిమ్‌లెస్ అద్దాలతో, చెవుల్ని కప్పిన క్రాపుతో, ముక్కుమీద పులిపిరికాయతో, వెడల్పాటి మీసాలతో చూసిన అభ్యర్థులు—ఇవాళ పోల్చుకోలేరని అతనికి నమ్మకంగా తెలుసు ...

"ఎవరు మీరు? ఎందుకొచ్చారు? ఇలా రాకూడదు!" యూనిఫామ్‌లో ట్రిమ్‌గా అపుపిస్తున్న ద్వారపాలకుడు దబాయిస్తూ అన్నాడు.

మహేశ్వర్రావు అతన్ని సూటిగా చూస్తూ, చిరునవ్వు నవ్వాడు. అయితే అతని కళ్ళు—వడగళ్ళలా ఉన్న కళ్ళు-నవ్వడంలేదు. "నేను ఇలా రాకూడదంటే, నువ్వు ఆ గుమ్మంముందు కాదు; ఈ గుమ్మం బైట బైఠాయించాలి!" అన్నాడతను, తన వెనక ఇంకా తెరుచుకునే ఉన్న తలుపువైపు సైగచేస్తూ.

జవాను బుర్రమీసాలు గమ్మత్తుగా కదిలాయి. సోఫాలమీద కూచున్న యౌవనమూర్తులు కిసుక్కున నవ్వారు.

"మీకు ఎవరు కావాలి?" కొద్దిగా ఖంగుతిన్న జవాను కోపాన్ని దిగమింగుతూ అడిగాడు.

"నువ్వే!"

జవాను బుర్రమీసాలు మళ్ళీ కదిలాయి. "నేనా? నాతో ఏమిటి పని?"

"చిన్నపని. లోపలి కెళ్ళు. ఇంటర్వ్యూకోసం మహా బలేశ్వర్రావుగారు వచ్చారనీ, త్వరగా లోపలికి రప్పించు కొమ్మనీ అయ్యగార్లకు చెప్పు!"

జవాను బుర్రమీసాలతోపాటు కనుబొమలూ కదిలాయి. వెర్రివాడిని చూస్తున్నట్టు మహాబలేశ్వర్రావుని చూశాడతను. "ఇంటర్వ్యూ అయిపోయింది. మీరు ఆలస్యంగా వచ్చారు. లాభంలేదు!"

మహాబలేశ్వర్రావు అతన్ని నవ్వుతూ చూశాడు. "లాభం లేకపోవచ్చు. నేను వచ్చానని చెప్తే నీకు నష్టమూ రాదు!"

"సీక్రెట్ కాన్ఫరెన్స్‌లో వున్నారు. డిస్టర్బ్ చేయడానికి వీల్లేదు! మీరు వెళ్ళిపోవచ్చు. అయ్యగారిచేతే ఆ మాట అనిపించుకోవాలంటే బైట వెయిట్ చేయొచ్చు!" జవాను ఎగతాళిగా అన్నాడు.

మహాబలేశ్వర్రావు అతన్ని నిర్లక్ష్యంగా చూస్తూ మూసిన తలుపువేపు కదిలాడు. అతని ఎడమచెయ్యి డోర్ హేండిల్‌ని పట్టుకుంది. మరుక్షణం అతని భుజమ్మీద యేదో చెయ్యి బరువుగా పడింది. తలతిప్పి, తనవేపు ఆగ్రహంతో చూస్తోన్న జవాన్ని నవ్వుతూ చూశాడతను. అతని కుడిచెయ్యి మెరుపులా కదిలింది. జవాన్ చొక్కాను ఛాతీభాగంలో బలంగా పట్టుకున్నాడతను. అమాంతంగా జవాను వెనక్కి తూలాడు. చిన్న చప్పుడుతో బటాలు

మీదికి వాలిపోయాడు. అదే క్షణంలో అతని ఎడమ చెయ్యి తలుపుని బలంగా లాగింది. లోపలికి దూరి అతను తలుపుని వదిలేశాడు. చప్పుడు చేస్తూ తలుపు మూసుకుంది.

పాంటు జేబుల్లో రెండు చేతులు దోపుకుని అతను తలుపుకి వీపు ఆన్చి, వాలుగా నిలబడ్డాడు. తనవేపు ఆగ్ర హంతో చూస్తోన్న భారీవ్యక్తి మొహంలోకి అతను నిర్భయంగా చూస్తూ వుండిపోయాడు.

భారీవ్యక్తి ముందున్న ముగ్గురు తలలు వెనక్కి తిప్పి ఆశ్చర్యంగా చూస్తున్నారు. అలా చూస్తున్న మూడు ముఖాల్లో ఒకటి ఎస్టాబ్లిష్‌మెంటు హెడ్ ప్రాణేశ రావుది.

"హూ ఆర్ యూ?" భారీవ్యక్తి, మేనేజింగ్ డైరెక్టర్ హుంకరించాడు.

మహాబలేశ్వరరావు నిటారుగా నించున్నాడు. హుందాగా నడుస్తూ నలుగురి మధ్యావున్న టేబులు దగ్గర ఆగాడు.

"నేను అక్కడే వుంటే, మీ మిత్రుల మెడలు తెగిపోతాయి! అందుకే, అందరికీ సులభంగా అవు పించేలా యిక్కడికి వచ్చాను...." మహాబలేశ్వరరావు నవ్వుతూ మేనేజింగ్ డైరెక్టర్‌తో అన్నాడు.

ఎమ్. డి. మొహం కందగడ్డలా అయింది. రెప్పవేయ కుండా చూస్తున్న ఎమ్.డి. చెయ్యి టేబిల్ కింద తడి మింది. తటాలున తలుపు తెరుచుకుంది. మహాబలేశ్వరరావు వోరగా చూశాడు. బుర్రమీసాల జవాను వినయం, రోషం రెండూ కలిసి, నవ్వు తెప్పించేలా తయారైన మొహంతో నిలబడ్డాడు.

"ఇతన్ని ఎందుకు రానిచ్చావ్?" ఎమ్.డి. గర్జిం

చాడు.

"నేను రానివ్వలేదు సార్. అతనే నన్ను తోసేసి.."

"షటప్!" ఎమ్.డి. కంఠం లక్ష్మీ టపాకులా పేలింది. "ఇతన్ని బైటికి గెంటేయ్!"

మహాబలేశ్వర్రావు రెండు కాళ్ళనీ ఎడంగా చాపాడు. పాంటు జేబుల్లోంచి చేతుల్ని ఇవతలికి లాగి, పిడికిళ్ళుగా మార్చాడు. తన దగ్గరగా ఆగిన బుర్రమీసా అతన్ని వోరగా చూసి, ఎమ్.డి. వైపు తీక్షణంగా చూశాడు.

"ఈసారి నీ శిష్యుణ్ణి ఈ పిడికిళ్ళతో పచ్చడి చేస్తాను. కిందికి వంచి, అతని వీపుమీద రౌతులా కూచుని, అతని బుర్రమీసాల్ని కళ్ళేంలా రెండు చేతుల్లో పట్టుకుని బైటికి తోలుకెళ్తాను. వరండాలో బోర్లా పడుకో బెట్టి తిరిగొస్తాను!"

ఎం.డి. శరీరంలోని రక్తమంతా అతని మొహం లోకి సర్రున ఎగబాకింది. "మాసయ్యా!...." అరిచాడతను.

మీసాల మాసయ్య చేతిని మహాబలేశ్వర్రావు భుజం మీద వేశాడు. మహాబలేశ్వర్రావు చెయ్యి మాసయ్య భుజంమ్మీద వాలింది. మాసయ్య అసంకల్పితంగా కెవ్వు మన్నాడు. అతని భుజమ్మీద నరాన్ని నొక్కుతున్న వేళ్ళని మహాబలేశ్వర్రావు వదులు చేశాడు. అతని భుజమ్మీద వేసిన తన కుడిచేతిని కంగారుగా తన ఎడం భుజమ్మీద ఆన్చుకున్నాడు మాసయ్య.

ఎం. డి. చివాల్న కుర్చీలోంచీ లేచాడు. అదురుతున్న పెదవులను కంట్రోలు చేసుకుంటూ గర్జించాడు. "త్రో హిం ఔట్!"

మాసయ్య అదుర్దాగా చూశాడు. "వప్పయ్యనీ.... గోవిందసామినీ....తీసుకొస్తాను సార్...."

"షటప్! గెటౌట్ యూజ్‌లెస్ ఫెలో!" ఎమ్.డి. అరిచాడు. బతుకజీవుడా అనుకుంటూ మాసయ్య మెరుపులా మాయమయ్యాడు.

"యూ స్కౌండ్రల్! పోలీసుల్ని పిలుస్తాను. ఆఫీసులోకి అనుమతి లేకుండా జొరబడి న్యూసెన్స్ క్రియేట్ చేస్తున్న నిన్ను...."

"సార్....శాంతించండి....ముందు అతనెవరో, ఎందుకిలా వచ్చాడో కనుక్కుందాం........" కల్పించుకుని అంటున్న ప్రాణేశరావుని మహాబలేశ్వర్రావు చిరునవ్వుతో చూశాడు. ఎంతయినా ప్రాణేశరావు తెలివైన ఘటం!

"ఎవర్నువ్వు" టెలిఫోన్ మీంచి చేతిని తియ్యకుండా ఎమ్.డి. గద్దించాడు.

"అలా అడిగారు: బావుంది! ఇలా ఇంటర్వ్యూకి ఒక అభ్యర్థి సకాలంలో హాజరు కాలేదు. అతని పేరూ, నా పేరూ, ఒకటే!" మహాబలేశ్వర్రావు నవ్వుతూ అన్నాడు.

"వాటీస్ యువర్ బాడ్ నేమ్?" ఎమ్.డి. హుంకరించాడు.

"బఫెలో ఫెర్టిలైజర్స్ మేనేజింగ్ డైరెక్టర్ సత్యసంకల్పం, నీ కూంచున్న కాగితాల్లో నా పేరు వుంటుంది చూసుకో!" మహాబలేశ్వర్రావు నిర్లక్ష్యంగా అన్నాడు.

ఇద్దరు పరాయి పెద్దమనుషుల సమక్షంలో తనని ఏకవచనంలో సంబోధిస్తున్న మహాబలేశ్వర్రావుని మింగేసేలా కాసేపు చూసి, నిప్పులు కక్కుతున్న తన కళ్ళని ఎమ్.డి.

సత్యసంకల్పం ప్రాణేశరావువైపు తిప్పాడు.

"ప్రాణేశరావ్, లూనటిక్స్‌ని కూడా ఇంటర్వ్యూకి పిలుస్తున్నారు! సెక్షన్‌లో మీరు నిద్రపోతున్నారా?" ఎమ్.డి. కంఠంలో అధికారం ఖంగుమంది.

"సార్, మీరు ఎక్సైట్ అవకండి. అతను కొంతకాలంలో ఇంటర్వ్యూకి రాలేకపోయినట్టున్నాడు. కొంచెం కన్‌సిడర్ చేస్తారేమో...."

"ఇంపాసిబుల్! ఉయ్ స్టిక్ టు ది రూల్స్. ఉయ్...."

"మిస్టర్ సంకల్పం, జస్ట్ మోమెంట్!" అతని ఎదురుగా కూచున్న పెద్దమనిషి, పాత్రో అడ్డు తగిలాడు. "ఇతను ఉద్యోగ ప్రయత్నాల్లో, ఇంటర్వ్యూల్లో వోడిపోయి డెస్పరేట్ అయినట్టున్నాడు. లెట్స్ రిలాక్స్ ది రూల్స్. లెట్స్ ఇంటర్వ్యూ హిమ్!"

'ఇంటర్వ్యూ చేస్తే పోయేదేం లేదుగా! ఎలాగా ఇతనికి ఉద్యోగం ఇవ్వంగా!' అన్న ధ్వని స్పష్టంగా పాత్రో కంఠంలో దాగింది. పాత్రో మెల్లిగా లేచి మహాబలేశ్వర్రావువేపు నడిచాడు. అతని ముందు నిలబడి వోదార్పుగా చూశాడు.

"యంగ్ మాన్, నీకు ఇంటర్వ్యూ కావాలి. అంతేగా? కమాన్ ... ఇలా కూర్చో...."

పొట్టిగా లావుగా పీపాలా వున్న పాత్రోని మహాబలేశ్వర్రావు చిరునవ్వుతో కలయజూశాడు. అతని చూపులు పాత్రో కళ్ళల్లోకి గుచ్చుకుపోయాయి.

"అయిదో క్లాసు కొడుక్కి పదమూడో ఎక్కం చెప్పలేక నెలకి ముప్ఫై రూపాయల రేటుతో అందమైన అమ్మాయితో ప్రయివేటు ట్యూషన్ యేర్పాటు చేసి,

పాఠం చెప్పినంతసేపూ ఆ అమ్మాయినే కళ్ళతో తినేస్తూ కూచునే నీలాంటివాళ్ళచేత ఇంటర్వ్యూ చేయబడటానికి నేను రాలేదు!" మహాబలేశ్వర్రావు కంఠం గంటలా ధ్వనించింది.

పాత్రో దవడలు గడగడ వణికాయి. నమ్మలేనట్టు మహాబలేశ్వర్రావు మొహంలోకి చూశాడు. మెల్లగా స్లో మోషన్‌లో అతని తల సత్యసంకల్పంవేపు తిరిగింది. సత్యసంకల్పం ఎద్దులా బుసకొడుతున్నాడు.

"ఓకే.....ఐ విల్ కాల్ ది పోలీస్...." అంటూ అతను రిసీవర్ని పైకెత్తి నంబర్ డయల్ చేయడానికి చూపుడువేలిని గురిపెట్టాడు.

"నీకు ఆ శ్రమ అక్కర్లేదు. అరగంటలో నేను ఇక్కణ్నుంచీ ఫోన్ చేయకపోతే నా మిత్రుడు ఏ.సి.బి. వాళ్ళనీ, పోలీసువాళ్ళనీ, ఫోటోగ్రాఫర్‌నీ. పత్రికా విలేఖర్లనీ ఒకేసారి తీసుకొస్తాడు!" మహాబలేశ్వర్రావు కంఠం సత్యసంకల్పాన్ని చెంపపెట్టులా తాకింది. డయల్ చేయబోతున్న చెయ్యి కొద్దిగా గురితప్పింది.

"వాట్ డూ యూ మీన్?" అరిచాడతను.

"ఐ మీన్ వాట్ ఐ సెడ్! ఫీల్డాఫీసర్ పోస్టుకి ఇంటర్వ్యూల పేరుతో ఇవాళ మీరు ముగ్గురూ ఆడిన, ఆడుతున్న నాటకం యేమిటో నాకు పూర్తిగా తెలుసు. ఈ ఒంటిస్తంభం మేడమీది గదిలో గుట్టుచప్పుడు కాకుండా మీరు ఆడుతున్న నాటకాన్ని బైటికి లాగి 'వీధి నాటకం'గా మార్చడానికే నేనొచ్చాను!" మహాబలేశ్వర్రావు అందరినీ కలయ జూస్తూ గంభీరంగా అన్నాడు.

ముగ్గురి ముఖాలకీ అతుక్కున్న హోదా, అధికారం,

ఐశ్వర్యం అన్న మూడు పొరలూ ఊడివచ్చేలా క్షణ కాలం కనిపించాయతనికి.

మహాబలేశ్వర్రావు టేబులు దగ్గర జరిగి రెండు చేతుల్నీ టేబుల్ మీద భోర్లించి ముందుకి వంగాడు. అందర్నీ ఒకసారి కలయజూశాడు.

"ఈ ఇంటర్వ్యూ ఎప్పుడు, ఎలా జరుగుతుందో, ఎవరికి ఎంత రేటుకి ఉద్యోగం అమ్మబడుతుందో, ఇంటర్వ్యూ జరిపించే విద్యాధికులూ, పెద్దమనుషులూ ఎవరో వాళ్ళ కథలేమిటో, అభ్యర్థులు ఎవరో, వాళ్ళ జాతకాలేమిటో- అన్నీ నాకు ఎప్పుడో తెలుసు! నేను త్రికాలజ్ఞుణ్ని! మీ బతుకుల్ని నిన్న, నేడు, రేపు హెడ్డింగులక్రింద పాఠంలా అప్పజెప్పగలను!" అతను నవ్వుతూ ఆగి, తనకు యెదురుగా కూచున్న ప్రాణేశరావుని చూశాడు.

ప్రాణేశరావు వెర్రివాడిలా, అయోమయంగా, కంగారుగా చూస్తున్నాడు. అతని చేతులు టేబులుమీద లేవు. అవి వణుకుతున్నాయనీ, అతని వొళ్ళో దాక్కున్నాయనీ, మహాబలేశ్వర్రావుకి తెలుసు.

"మిస్టర్, ఏమిటేమిటో పిచ్చిగా వాగుతున్నావ్. ఇంతకీ నువ్వు యెవరు?" అంతవరకూ మౌనంగా కూచున్న దీనబాంధవమూర్తి ప్రశ్నించాడు.

మహాబలేశ్వర్రావు అతన్ని చిరునవ్వుతో చూశాడు. "ఓహ్! దీనబాంధవుడు! ఇంతసేపూ మౌనంగా వుండిపోయారేమిటా తమరు అని ఆలోచిస్తున్నా. మీ కాండిడేట్ సర్వసన్నద్ధంగా వచ్చుండాలే!" దీనబాంధవమూర్తి మొహం ఎర్రగా అయింది.

"నువ్వు ఇంటర్వ్యూ కోసం వచ్చినవాడివి కావని అర్థమవుతోంది. ఎవరు నువ్వు?" అప్పటికి కొద్దిగా తేరు

కున్న పాత్రో ప్రశ్నించాడు, కుర్చీలో కూర్చుంటూ.

మహాబలేశ్వర్రావు నిటారుగా నించున్నాడు. పక్కనే ఉన్న కుర్చీని ఎడంచేత్తో వెనక్కి లాగాడు. ఒక్క కదలికతో అందులో కూర్చుని హుందాగా వెనక్కి వాలాడు. కాలుపై కాలు వేసుకుంటూ సిగరెట్ వెలిగించాడు. అందరివేపూ నిర్లక్ష్యంగా చూస్తూ అగ్గిపుల్లని ఆర్పి వాళ్ళమధ్య టేబులుమీద పడేలా రువ్వాడు.

ఏదో అనబోయిన సత్యసంకల్పం కంఠానికి, అతని కంఠం కటాలున అడ్డు తగిలింది.

“అయామ్ శివరామ్” అన్నాడతను గంభీరంగా.

# 5

ఎమ్.డి. సత్యసంకల్పం, పాత్రో, దీనబాంధవమూర్తి, ముఖ్యంగా ప్రాణేశరావూ ఆశ్చర్యంతో తయారుచేయబడిన విగ్రహాల్లా వుండిపోయారు.

“నువ్వు మహాబలేశ్వర్రావువి. ఏదో పేరు చెప్పి బుకాయించకు!” మహాబలేశ్వర్రావు అనే అభ్యర్థి పేర ఇంటర్వ్యూ లెటర్ పంపిన ప్రాణేశరావు ముందుగా తెప్పరిల్లి, అన్నాడు.

శివరామ్ అతనివేపు నవ్వుతూ చూశాడు. “మహాబలేశ్వర్రావు పేరుతో నేను అప్లై చేశాను; ఆ పేరుతో నే ‘ఇంటర్వ్యూ పిలుపు’ పంపించావ్!”

“ఆలస్యంగా వచ్చినందుకు నిన్ను ఇంటర్వ్యూ చేయమన్న భయంతో, డెస్పరేట్ అయిపోయి నువ్వు రౌడీలా లోపల దూరి, ఇక్కడ మొరటుగా ప్రవర్తిస్తున్నావని అర్థమవుతోంది. ఆలస్యాన్ని క్షమించి నిన్ను ఇంటర్వ్యూ చేస్తాం....” ఎమ్.డి. సత్యసంకల్పం ఆరితేరిన బేరగాడిలా దువ్వే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"మంచి నిర్ణయం!" పాత్రో మెచ్చుకున్నాడు.

"యస్, గుడ్ డెసిషన్! దీనబాంధవమూర్తి బుర్రని ఆవేశంగా వూపుతూ అన్నాడు.

శివరామ్ వాళ్ళని చిరునవ్వుతో చూస్తూ ఉండి పోయాడు. అతని చేతిలో సిగరెట్ పొగ చిమ్ము తోంది.

"నేను మహాబలేశ్వర్రావు అనే తప్పుడు పేరుతో అప్లై చేశానని ఇందాకే చెప్పాను. అలాంటి నన్ను ఎలా యింటర్వ్యూ చేస్తారు?" నవ్వుతూ ప్రశ్నించాడు శివ రామ్.

"విష్ణువుకి ఉన్నట్టు నీకు వెయ్యి పేర్లు ఉండొచ్చు. ఉయ్ డోంట్ కేర్! మా క్కావాల్సింది నీ అప్లి కేషన్‌లో, సర్టిఫికెట్స్‌లో ఉండే పేరే!" ఎస్టాబిష్ మెంట్ వ్యవహారాల్లో బుర్ర పండిపోయిన ప్రాణేశరావు కల్పించుకుని అన్నాడు.

ఎమ్.డి. సత్యసంకల్పం తన సెక్షన్ హెడ్‌ని మెప్పుగా చూశాడు. "యస్; మనకి అవసరమైంది అంతే!"

సిగరెట్ పొగ ఊదుతూ శివరామ్ కుర్చీలో ముందుకి వాలాడు. "అయితే ఇంటర్వ్యూ చేసి, నాకు ఉద్యోగం ఇస్తారా?"

అతి విచిత్రమైన విషయం విన్న వాళ్ళల్లా నలుగురూ మొహాలు చూసుకున్నారు. సత్యసంకల్పం వాలుగా శివరామ్‌ని చూశాడు.

"ఆ గ్యారంటీ నరమానవుడు ఇవ్వలేడు. ఇంటర్వ్యూ చేస్తాం. అందులో వ్యక్తమయ్యే నీ శక్తి సామర్థ్యాల మీదా, వినయవిధేయతల మీదా ఫలితం ఆధారపడి

ఉంటుంది!"

అతని మాటని బాలమురళి సంగీతంలా భావించి తతిమ్మా ముగ్గురూ తలలు ఊగిస్తూ వుండిపోయారు.

"మహాబలేశ్వర్రావ్, ఇక్కడ స్మోక్ చేయకూడదు. సిగరెట్ ఆర్పెయ్!" సందుచూసుకుని ప్రాణేశరావు ధైర్యంగా అన్నాడు

శివరామ్ అతనివైపే చూస్తూ సిగరెట్ పీకని టేబుల్ అంచుమీద నొక్కి ఆర్పేశాడు. కోటుజేబు లోంచీ పాకెట్ తీశాడు. కొత్త సిగరెట్ని పెదాల మధ్య యిరికించాడు. అగ్గిపెట్టె అందుకున్నాడు.

"డోంట్ స్మోక్!" సత్యసంకల్పం హుంకరించాడు.

శివరామ్ ప్రాణేశరావుమీంచి తన చూపుల్ని అతని మీదికి మళ్ళించాడు. పెదాలమధ్య సిగరెట్ అతన్ని వెక్కిరిస్తున్నట్టు కదిలింది. "కాసేపట్లో నేను చెప్పబోయేది విన్నాక, మీరు నలుగురూ తలో అగ్గిపెట్టే పట్టుకుని, ఒకేసారి పుల్లలుగీసి నా సిగరేట్ ముట్టించడానికి పందా లేసుకుని ఎగబడతారు!"

"వాట్ నాన్ సెన్స్...." సత్యసంకల్పం ప్రారంభించాడు.

"షటప్!" శివరామ్ కంఠం టపాకాయలా పేలింది.

ఉక్కిరిబిక్కిరవుతూ చూస్తున్న శివరామ్ నవ్వుతూ చూశాడు. అతని వేళ్ళమధ్య అగ్గిపుల్ల వెలిగింది. సిగరెట్ పొగ చిమ్మింది.

"నేను ఫేక్ అప్లికేషన్ పంపానని చెప్తున్నాకూడా నన్ను ఇంటర్వ్యూ చేయడానికి మీరు సిద్ధపడుతున్నారంటే ఏదో పిచ్చి ప్రశ్నలు అడిగి పీడ వదలించుకోవా

లని చూస్తున్నారని నాకు అర్థమవుతోంది!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"అంత తెలిసిన వాడివి ఇక్కడెందుకున్నావు? గెట్ ఔట్!" సత్యసంకల్పం ఉక్రోషంతో అరిచాడు.

"మిమ్మల్ని మరొక్కసారి ఇంటర్వ్యూ చేయడానికి ఉన్నాను మిస్టర్ మేనేజింగ్ డైరెక్టర్!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

సత్యసంకల్పం పిడికిలి సమ్మెటలా టేబుల్‌ని చరిచింది. వైపోట్టుతీసేసిన కందగడ్డలా తయారైన మొహాన్ని శివరామ్ నవ్వుతూ చూశాడు. తటాలున లేచి నిలుచున్నాడు. అందరూ అతన్ని తలలెత్తి ఆశ్చర్యంగా చూశారు.

"సత్యసంకల్పం, రాజమండ్రీనుంచీ వచ్చిన సుకుమార్ నన్నాళ్ రుద్రయ్య—నుండీ ఉద్యోగం యివ్వడానికి నువ్వు రెండు లక్షలకి బేరం కుదుర్చుకున్నావ్. మీడియేటర్ కన్నారావ్ నీకు లక్ష అడ్వాన్స్‌గా చెల్లించాడు. అవునా?" శివరామ్ ప్రశ్న గదిలో ప్రతిధ్వనించింది.

"నాన్సెన్స్!" సత్యసంకల్పం అరిచాడు. అతన్ని నిర్లక్ష్యం చేస్తూ శివరామ్ పాత్రోవైపు తిరిగాడు.

"పాత్రో, పాత్రోచితంగా ఉద్యోగం ఇవ్వాలని అనుకున్న నువ్వు, ఇంటర్వ్యూ బోర్డు సభ్యుడైన వెంటనే నీ ఆ వీపాకుతున్న గ్రామ పంచాయితీ సర్పంచ్‌కి కాబోయే అల్లుడైన కోటేశ్వరరావుకి ఉద్యోగం ఇప్పించడంకోసం, లక్షన్నరకి బేరం చేసి, అంతా అడ్వాన్స్‌గా పుచ్చుకొన్నావ్!" శివరామ్ అతని రియాక్షన్ కోసం చూడకుండా దీనబాంధవమూర్తివైపు తిరిగాడు.

"నువ్వు దీనబాంధవుడివి. అందుకే యిద్దరు అభ్యర్థులకి

యేర్పాటు చేస్తున్నట్టు నటించి ఒక అభ్యర్థి చిదంబరం నుండీ లక్ష అడ్వాన్సుగా పుచ్చుకొన్నాడు!" శివరాం కంఠం గర్భగుడిలో జేగంటలా ధ్వనించింది.

"మిస్టర్ సత్యసంకల్పం, మీ ఇంటర్వ్యూ కోసం పనులన్నీ మానుకుని వచ్చాం. ఎవడో అనామకుడి చేత పనికిమాలిన మాటలు అనిపించుకుంటున్నాం? ఈ దారుణాన్ని మీరు సహించినా మేం సహించం!" దీనబాంధవమూర్తి బొబ్బలెట్టాడు.

"యెస్! దిసీజ్ టూ మచ్! దిసీజ్ డామేజింగ్! ఐ విల్ సీ దట్ ...."

"షట్టప్!" శివరామ్ హుంకరించాడు. కోపంతో, అవమానంతో తాత్కాలికంగా మూగవాళ్ళయిపోయినా ముగ్గురూ గుటకలు మింగుతూ చూశారు.

"ముగ్గురూ యెవరికివారు తలా వో కాండిడేట్‌ని సెలక్టు చేసుకుని, జేబులు నింపుకున్నారు. ముగ్గుర్లో యే వ్యక్తికి ఉద్యోగం వచ్చినా ఇద్దరికి లాభిస్తుంది. మేనేజింగ్ డైరెక్టర్ కీ, తన అభ్యర్థిని గెలిపించిన ఇంటర్వ్యూ బోర్డు మెంబర్ కీ! యెటొచ్చీ సత్యసంకల్పానికి ఢోకా లేదు. పోటీలో యెవరు గెలిచినా అతనికి ఆదాయమే!" శివరామ్ నవ్వుతూ ఆగి, ప్రాణేశ్వరరావువైపు చూశాడు.

"నన్ను బైట పెట్టొద్దు; ప్లీస్!" అంటున్నాడు ప్రాణేశ్వరరావు కళ్ళలో.

"ముగ్గురూ నష్టపోకుండా, ముగ్గురి బేరాలూ, పరువూ చెడిపోకుండా చక్కటి మార్గంకోసం యిప్పుడు అన్వేషిస్తున్నారని నేను ఊహించగలను! ఎక్కువ ఆఫర్ చేసే వ్యక్తికి ఫీల్డాఫీసర్ పట్టాభిషేకం చేసి, తతిమ్మా బేరగాళ్ళిద్దరికీ యేదో ఉద్యోగం క్రియేట్ చేసి ఇరికించేయాలని

ప్లాన్ చేస్తున్నారు. ఆ ప్లాన్ని రిజైన్ చేసి అసలు జరప డానికే ఎస్టాబ్లిష్‌మెంట్ ఎక్స్‌పర్టు ప్రాణేశరావు ఈ సమావేశంలో పాల్గొంటున్నాడు! దీన్నంతా సాధన కలిగే మొనగాడు ఎవరైనా ఉంటే చెయ్యి పైకెత్త వచ్చు!" శివరామ్ ఛాలెంజ్ చేస్తూ నవ్వాడు.

ఆగ్రహంతో ఊగిపోతూ ఎమ్.డి. సత్యసంకల్పం మళ్ళీ కుర్చీలోంచి లేచాడు. జేవురించిన ముఖాల్లో తన యెదురుగా కూచున్న యిద్దరు పెద్దమనుషుల్నీ ఉద్రేకంతో చూశాడు.

"అయాం సారీ. మీకు యిబ్బంది కలుగుతోంది. పిచ్చాసుపత్రినుండీ తప్పించుకు వచ్చిన వీడివల్ల మన కార్యక్రమానికి అంతరాయం కలిగింది. లెట్స్ గో టు ది కాన్ఫరెన్స్ హాల్...." అంటూ అతను ప్రాణేశరావు వైపు చూశాడు.

"ప్రాణేశరావు, ఈ పిచ్చివాణ్ని ఇక్కణ్నుంచీ బైటికి గెంటించి, తరవాత మమ్మల్ని కల్సుకో!"

పెద్ద రిలీఫ్‌తో పాత్రో, దీనబాంధవమూర్తీ ఆదరాబాదరా పైకి లేచారు. ప్రాణేశరావు యింకా ఆశ్చర్యంలోనే తన్నుకుంటున్నట్టు రెప్పవేయకుండా శివరామ్‌నే చూస్తున్నాడు. చదివింపులు చేస్తున్న ముగ్గురికీ ఉద్యోగాలు యేర్పాటు చేయడంకోసం సాగుతున్న వాళ్ళ ప్రయత్నం గురించి తను అన్న మాటలు నిజమే అని ప్రాణేశరావు మొహం, కళ్ళూ శివరామ్‌కి చెప్తున్నాయి.

"దెన్ ఉయ్ హావ్ టూ క్రియేట్ టూ పోస్ట్స్...." అన్న ఎమ్.డి. మాటల్ని తలుపుతోస్తూ తను విన్న సంగతి వాళ్ళకి తెలిసినట్టులేదు. తన ఊహకి ఆ మాటే తల్లి అనీ వాళ్ళకి తెలీదు!

మరో గదిలోకి వెళ్ళడానికి సిద్ధమవుతున్న ముగ్గుర్నీ శివరామ్ నవ్వుతూ చూశాడు. లిటాలున వెనుదిరిగి గుమ్మం వైపు జోరుగా నడిచాడు. కదులుతున్న ముగ్గురూ అతన్ని అర్థంకానట్టు చూస్తూ ఆగి, ముఖాలు చూసుకున్నారు. ముగ్గురి చూపులూ కలిసినట్టుగా శివరామ్‌వైపు తిరిగాయి.

శివరామ్ మూసిన తలుపు దగ్గరగా ఆగాడు. అతని చెయ్యి డోర్ హాండిల్ని పట్టుకుంది. మెల్లిగా తలుపు తిప్పి స్తంభాల్లా అచేతనంగా నిలబడ్డ ముగ్గుర్నీ, కంగారుగా చూస్తున్న ప్రాణేశ్వరావునీ తీక్షణంగా చూశాడు.

"ఒక్క క్షణం ఆగండి! తరవాత మీ దారి మీదీ, నా దారి నాదీ! కంఫర్టబుల్‌గా నన్ను పిచ్చివాడికింద జమకట్టేసి, జారుకోడానికి ప్లాన్ చేశారు. ఉద్యోగం వస్తుందన్న ఆశతో మీ ముగ్గురికీ అడ్వాన్సులు చెల్లించి ముందు గదిలో కూచుని కలలు కంటున్న ముగ్గురు కుర్రాళ్ళనీ మొదటి విడత లోపలికి పిలుస్తాను...."

"స్టాప్ ది నాన్సెన్స్...." సత్యసంకల్పం అరిచాడు.

అతన్ని వెక్కిరింపుగా చూస్తూ శివరామ్ ప్రారంభించాడు: "ఒకడికి ఫీల్డాఫీసర్ పని అనే బహుమతి యిచ్చి, తతిమ్మా యిద్దరికీ రెండు కన్సొలేషన్ బహుమతులు యివ్వడానికి మీరు రూపొందిస్తున్న ప్లాన్ని వాళ్ళకి వివరిస్తాను. లక్షలక్షలు వాళ్ళనుండీ గుంజుకుంది నిజమే అని వాళ్ళచేత చెప్పిస్తాను. తమని యెందుకిలా మోసం చేస్తున్నారో చెప్పమంటూ వాళ్ళే మిమ్మల్ని ఇంటర్వ్యూ చేస్తారు: చేయిస్తాను!"

శివరామ్ చెయ్యి కొద్దిగా కదిలింది. తలుపు అరడుగు కదిలింది. శివరాం తలని నిర్లక్ష్యంగా తలుపువైపు తిప్పాడు.

"ఆగు!" ఎమ్.డి. సత్యసంకల్పం కంఠంలోని ఆదుర్దా శివరామ్‌కి చక్కిలిగింతలు పెట్టింది. వెనక్కి తిరిగి నవ్వుతూ చూశాడు. సత్యసంకల్పం పెదవులూ, దవడలూ నిశ్శబ్దంగా కదులుతున్నాయి. మరో అడల్ట్ డోస్ తగిలితే గానీ లాభంలేదని శివరామ్ గ్రహించాడు.

"నైవేద్యం పెట్టి వరంకోసం కాచుకున్న సుకుమార్, కోటేశ్వర్రావూ, చిదంబరంమిమ్మల్ని ఇంటర్వ్యూ చేశాక లోకంకోసం దిష్టిబొమ్మలుగా మీరు పిలిపించిన తతిమ్మా అయిదుగురు బలిపశువుల్ని లోపలికి పిలుస్తాను కథంతా వర్ణనలతో, అలంకారాలతో — టీకాతాత్పర్యాలతో వివరిస్తాను. వాళ్ళకి జరుగుతున్న అన్యాయాన్ని బొమ్మ గీచి చూపిస్తాను. ఆ తరవాత వాళ్ళు అయిదుగురూ మిమ్మల్ని ఇంటర్వ్యూ చేస్తారు. ఆ ఈదురుగాలి దెబ్బ నుండి మీరు కోలుకోగానే ఈ ముగ్గుర్నీ, ఆ అయిదుగుర్నీ ఒక్కటిగా—అన్నదమ్ముల్లా, ప్రాణమిత్రుల్లా కలిపేసి మూకుమ్మడిగా మీ ముగ్గుర్నీ 'ఇంటర్వ్యూ' చేయిస్తాను."

"స్టాప్!" ఎమ్.డి. సత్యసంకల్పం కంఠం విని అతని దగ్గరగా ఉన్న ముగ్గురూ అదిరిపడ్డారు. శివరామ్ పాలిపోయిన అతని ముఖాన్ని చిరునవ్వుతో చూశాడు.

"ఇంకొంచెం ఉంది: నేను మీకు ఏర్పాటుచేస్తున్న ఇంటర్వ్యూలు జరిగే చారిత్రక క్షణాల్లో నీ పెర్సనల్ స్టెనోగ్రాఫర్, ఇక్కడ నించుని మొత్తం షార్టుహాండ్‌లో రికార్డుచేస్తుంది. ఆ తరవాత దాన్ని ఫోటో కాపీలు తీయించి, దేశంలోని పత్రికలకి బహూకరిస్తాను...."

"ఐ సే, స్టాపిట్!"

శివరామ్ హుంకరించిన సత్యసంకల్పాన్ని చిరునవ్వుతో చూస్తూ తలుపుని మరికొంచెం తోశాడు.

"తలుపు మూసెయ్!" సత్యసంకల్పం కంఠం వణికింది.

శివరామ్ తలుపు మూసేశాడు. తృప్తికరంగా సిగరెట్టు వెలిగించాడు.

"నోరు మూయమన్నావ్; మూసుకున్నాను. తలుపు మూయమన్నావ్ మూసేశాను. ఇప్పుడేం చేయమంటావ్?" శివరాం నవ్వుతూ అడిగాడు.

సత్యసంకల్పం పళ్ళు కొరుక్కుంటూ చూశాడు. "ఇలా రా!"

శివరాం నవ్వుతూ టేబుల్ దగ్గరగా నిలిచి, అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"హూ ఆర్ యూ?"

"పేరు శివరామ్ అని ఇందాకే చెప్పాను.... ఊరు.." శివరాం నవ్వుతూ ప్రారంభించాడు.

"అదికాదు!" సత్యసంకల్పం గద్దించాడు.

"మరేది?" శివరాం నవ్వుతూ ప్రశ్నించాడు.

"నిజం చెప్పు: నువ్వెవరు? ఎందుకొచ్చావ్?"

"నేనెవరో యెన్నిసార్లు చెప్పినా నీకు అర్థంకాదు. నాలుగైదుసార్లు బఫెలో ఫెర్రిలైజర్స్ ఫీల్డాఫీసర్ పోస్టుకి అప్లికేషన్స్‌ని ఆహ్వానించి, సరైన గిరాకీ దొరక్క ఇంటర్వ్యూల్ని కాన్సిల్ చేస్తూ వచ్చిన నిన్నూ, ఇంటర్వ్యూల్ని నోట్లకట్టలుగా మార్చేసుకునే ఇంద్రజాలికుడైన నీ మిత్రుణ్ని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చిన మహేంద్రజాలికుణ్ని!" శివరాం గంభీరంగా అన్నాడు.

సత్యసంకల్పం బలహీనంగా కుర్చీలో కూలబడ్డాడు. పాత్రో, దీనబాంధవమూర్తి కూడా కూలబడ్డారు. ఉన్నట్టుండి సత్యసంకల్పం ఉలిక్కిపడ్డాడు. తనున్న ఉన్నత

మయిన హోదా అతనికి తటాలున గుర్తొచ్చినట్టుంది.

"బఫెలో ఫెర్టిలైజర్స్ ప్రయివేట్ సంస్థ. మాకు తగిన వ్యక్తి దొరికేదాకా ఇంటర్వ్యూలు కొట్టిపారేస్తూ వుంటాం. మా ఇష్టంవచ్చిన వ్యక్తిని, ఇష్టంవచ్చిన ఉద్యోగంలో, ఇష్టంవచ్చినప్పుడు పెట్టుకుంటాం! అడ్డు చెప్పడానికి నువ్వెవరు? హూ ఆర్ యూ?"

శివరాం పకపక నవ్వాడు. తటాలున నవ్వు ఆపేసి సత్యసంకల్పాన్ని తీక్షణంగా చూశాడు. "ప్రయివేట్ సంస్థ అయినంత మాత్రాన నువ్వు ఇష్టానుసారంగా గంతులేయడానికి వీల్లేదు, మేనేజింగ్ డైరెక్టర్! నీ ప్రయివేట్ సంస్థ బండారం నాకు అరచేతిగీతల్లా తెలుసు! నీ సంస్థకి, నీ 'ప్రయివేట్' సంస్థకి యెన్ని బ్యాంకుల్లోంచి యెంత మొత్తాన్ని 'పబ్లిక్' మొత్తాన్ని అప్పు పేరుతో తీసుకున్నావో గుర్తుందా? బఫెల్లో ఫెర్టిలైజర్స్ ప్రయివేట్ ఫర్మ్ అవొచ్చు. బ్యాంకులు ప్రభుత్వం నిర్వహిస్తున్న ఇండస్ట్రియల్ డెవలప్‌మెంటు కార్పొరేషన్లూ మీ అబ్బవి కావు. అవి ప్రభుత్వానివి; ప్రజలవి! ఆ ప్రజా సంస్థలని దేవిరించి నువ్వు నీ ప్రయివేటు సంస్థని సొంత సామ్రాజ్యంగా మార్చుకుంటున్నావ్! ప్రభుత్వం తలుచుకుంటే—తలుచుకునేలా చేస్తాం—నీ ప్రయివేట్ రాజ్యం పబ్లిక్ రాజ్యం అయిపోగలదు! గుర్తుంచుకో!"

సత్యసంకల్పం ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. పరిస్థితి గ్రహించిన ప్రాణేశరావ్ చిన్న కాగితంముక్క మీద యేదో రాసి పాత్రోకి అందించాడు. పాత్రో దాన్ని చదివి, పక్కనేవున్న దీనబాంధవమూర్తికి అందించాడు. కాగితంలోని రాత చక్కగా నచ్చిన దీనబాంధవమూర్తి దాన్ని సత్యసంకల్పానికి అందించాడు. శివరాంకు

యేం చెప్పడమా అని తన్నుకుచస్తున్న సత్యసంకల్పం అరచేతిలో ఇముడ్చుకున్న కాగితంముక్కని కళ్ళు చిట్లిస్తూ చదువుకున్నాడు. మరో సిగరెట్ వెలిగిస్తూ, దాన్నంతా గమనించనట్టు నటిస్తూ వుండిపోయాడు శివరాం.

కాగితంముక్క చుట్టూ పిడికిలి బిగించిన సత్యసంకల్పం ప్రశ్నార్థకంగా ప్రాణేశరావువేపు చూశాడు. కదలిక స్పష్టంగా తెలియకుండా ప్రాణేశరావు తల కదిలింది. అతని కళ్ళు మేనేజింగ్ డైరెక్టర్ వినయంతో చెప్తున్నాయి....

కొంచెం తేరుకున్న సత్యసంకల్పం నిట్టూరుస్తూ కుర్చీ వెనక్కి వాలాడు. టేబుల్ అంచుమీద లావుపాటి వేళ్ళతో డోలు వాయించాడు. డోలు సోలో ఆపేసి, అప్పుడే యేదో నిర్ణయానికి వచ్చినవాడిలా శివరామ్ వేపు అదోలా చూశాడు.

"మిస్టర్, మా సంస్థలో ఫీల్డాఫీసర్ ఉద్యోగం కోసమే నువ్వు ఈ రభస చేస్తున్నావని అర్థమవుతోంది. నీలాగా ధైర్యంగా వ్యవహరించేవాళ్ళకే ఇక్కడ స్థానం వుంటుంది! ఇందాకా నువ్వు చెప్పిన బుర్రకథల్ని మన్నించి, నీకు ఫీల్డాఫీసర్ ఉద్యోగం ఇవ్వడానికి నిశ్చయించుకున్నాం...."

శివరాం నవ్వు అతని కంఠానికి వెలక్కాయలా అడ్డుపడింది. నవ్వాపి శివరామ్ అతన్ని తదేకంగా చూశాడు. "బఫెలో ఫెర్టిలైజర్స్—బర్రె ఎరువును బుర్ర నిండా పెట్టుకున్న నీలాంటి వాడికింద నేను ఉద్యోగం చేస్తానని ఎందుకనుకున్నావ్?"

శివరామ్ ప్రశ్న సత్యసంకల్పాన్ని చెంపపెట్టులా తాకుతోంది. అదురుతున్న పెదవుల్ని కంట్రోలు చేసు

కుంటూ అతను 'చూశావా?' అన్నట్టు సలహా యిచ్చిన ప్రాణేశరావువేపు చూశాడు. ప్రాణేశరావు గుటకలు మింగాడు.

"మిస్టర్ సత్యసంకల్పం, అతనికి యేం కావాలో కనుక్కొని పారేయండి! నిజా నిజాలు యెలా వున్నా ప్రజలూ, పత్రికలూ ఇతనిలాంటివాళ్ళు చెప్పే పాడు మాటల్ని నమ్ముతారు...." ఒక నిర్ణయానికి వచ్చి, ధైర్యంగా సలహా ఇచ్చాడు పాత్రో. దీనబాంధవ మూర్తి కళ్ళు అతని మాటని ఆత్రంగా అండర్ లైన్ చేస్తున్నాయి.

వెనక్కివాలిన సత్యసంకల్పం ముందుకు వొంగి, మోచేతుల్ని టేబులుమీద ఆన్చి, సూటిగా శివరామ్ వేపు చూశాడు.

"ఆల్ రైట్! నీకు ఉద్యోగం వద్దు; మరేం కావాలి?...." దబాయిస్తున్నట్టు మేకపోతు గాంభీర్యంతో అడిగాడతను.

శివరామ్ నవ్వుతూ మెల్లిగా కుర్చీలో కూచున్నాడు. కాలుమీద కాలు వేసుకుని అందరినీ కలయజూశాడు.

"ఇంత సేపటికి ఎరువు మాటలు మానేసి మొలకెత్తే విత్తనంలాంటి మాటన్నావ్! 'వాగులాట కబడీ' ఆడుతూ టైమ్ వేస్టుచేయడం మీకే ప్రమాదం గనక, మీరున్న స్థితి గురించీ, నేనున్న స్టేజీ గురించీ మరోసారి మీ బుర్రల్లోకి ఎక్కిస్తాను: మీ అందరి జాతకాలూ నా డైరీలో ఉన్నాయి. మీ కాంట్ల అకౌంట్లు ఆదీ రీతో ఎలా బాధపడుతున్నాయో నాకు తెలుసు. ఏ యే బ్యాంకుల్లో ఏ యే నెంబర్లతో మీ ముగ్గురికీ ఖాతాలున్నాయో అమరంలా అప్పజెప్పగలను. మీ శరీరాల్లోంచి కారిన చెమట

ఆ ఖాతాల్లో రూపాయలుగా జమ అవలేదనీ నాకు తెలుసు. ప్రస్తుతం అమాయకుల్ని బలి తీసుకోడానికి ఇక్కడ మీరు ఆడుతున్న 'ఇంటర్వ్యూహం' గురించీ నాకు తెలుసని, మీకూ తెలుసు...."

"నాన్సెన్స్....నీకేం కావాలో ఒక ముక్కలో చెప్పు!" సత్యసంకల్పం ఉరిమాడు.

"ఈసారి నా ఉపన్యాసానికి అడ్డు తగిలితే లేచివెళ్ళి తలుపు తీస్తాను. ఎనిమిదిమంది గ్రహాల్ని మీమీదికి వదులాను. నేనూ వాళ్ళతో చేరి నవగ్రహాల్లా మీ ముగ్గురినీ చుట్టేసి, క్షణంలో మీ జాతకాలు మార్చేస్తాను!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

ముగ్గురూ గతుక్కుమంటూ ముఖాలు చూసుకున్నారు. ప్రాణేశ్వరావు తన్నుకొస్తున్న నవ్వుని మింగలేక, దగ్గురూపంలో వెళ్ళగక్కాడు. శివరామ్ మళ్ళీ ప్రారంభించాడు:

"సో. మీ గురించి ఏది లోకానికి తెలిస్తే మీకు ప్రమాదమో ఆ కథ పూర్తిగా నాకు తెలుసని మీకు తెలుసు. ఈ తెలిసిందాన్నంతా మరిచిపోయేంత 'మతిమరుపు రోగం' నాకు రావాలంటే నేను సూచించే రెండు 'చిన్నపనులు' మీరు రెండు చేతులతో చేయాలి. లేదంటే నా దారిన నేను పోతాను. పోయేలోగా సరికొత్త ఇంటర్వ్యూహంలో మిమ్మల్ని ఇరికించి, ఉక్కిరిబిక్కిరి చేస్తాను. మీ అభ్యర్థులు ముగ్గురూ మిమ్మల్ని గానుగ ఆడేస్తారు. దగా చేయబడిన బలహీనులు అయిదుగురూ వీధిలో—అంటే కోర్టులో మిమ్మల్ని పిండి కొట్టేస్తారు. వాళ్ళ తరపున నేనూ, ఇంతసేపూ వోపిగ్గా దీనంతా గమనిస్తున్న ప్రాణేశ్వరావూ, మరి కొంతమంది

మీ ఉద్యోగులూ పాత్రులుగా హాజరవుతాం....”

“శివరామ్! పాడిందే పాడ్డం దండగ! నీకేం కావాలో చెప్పు!” సత్యసంకల్పం విసుగ్గా అడ్డుతగిలాడు. అతను ప్రదర్శిస్తున్న విసుగు వెనక గుండె దడ వుందని శివ రామ్‌కి తెలుసు....

“రైట్!” శివరామ్ నవ్వుతూ అన్నాడు. సిగరెట్ని టేబుల్ మీద నొక్కి లేచి, ఎత్తుగా నిలబడ్డాడు.

“ఏం కావాలి? ఏం కావాలి? అని చాలాసార్లు అడి గారు. నాకేం కావాలో వివరంగా చెప్తాను; జాగ్రత్తగా వినండి....” శివరాం ఆగి నవ్వుతూ చూశాడు. తను ఆశించిన భావం, అదుర్దా, భయం రెండూ కలిగిన భావం వాళ్ళందరి మొహాల్లోనూ అద్దాల్లో ప్రతిబింబంలా స్పష్టంగా అవుపిస్తోంది! అతను సత్యసంకల్పాన్ని తదే కంగా చూశాడు.

“నువ్వు ఉద్యోగాన్ని ఒకడికి రెండు లక్షలకి అమ్మే ప్లాన్ చేశావ్. నీ మిత్రుడు పాత్రో లక్షన్నరకీ, దీన బాంధవుడు మరో లక్షన్నరకీ అదే ఉద్యోగాన్ని మరో యిద్దరికి ప్రామిస్ చేశారు. ఈ మూడు మొత్తాల్ని ముగ్గురూ విడివిడిగా రెట్టింపు చేసి, ఒకటిగా కలిపి అర గంటలోగా నాకు చెల్లిస్తారు....”

“వా అఆఅఆట్?” తన చెవుల్ని నమ్మలేక సత్య సంకల్పం వెర్రివాడిలా అరిచాడు. పాత్రో, దీనబాంధవ మూర్తి అయోమయంగా మొహాలు చూసుకున్నారు.

“రెండూ రెండూ నాలుగూ, ఒకటిన్నరా ఒకటి న్నరా మూడూ, మరో ఒకటిన్నరా ఒకటిన్నరా మూడూ—మొత్తం పది నాకు వెంటనే అందాలి....” శివరామ్ నెమ్మదిగా అన్నాడు.

సత్యసంకల్పం రెప్పలు చీలుతుపోతూ అతని కళ్ళు ఎద్దు కళ్లలా తయారు చేశాయి.

"ఐ కాంట్ బిలీవ్ ....ఐ కాంట్ ....ఐ...."

"పటప్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. "ఇంక రెండో డిమాండ్: మీరు ఇంటర్వ్యూకి పిలిపించిన కుర్రాళ్ళలో రామసీతారావు అనే అతనున్నాడు. మీకు శ్రమ తగ్గించడానికి నేనే అభ్యర్థిని సెలక్టు చేశాను. అతన్ని ఫీల్డాఫీసర్‌గా నియమిస్తూ నా సమక్షంలో ఆర్డర్స్ జారీచేస్తారు...."

"నో!" కంగారుపడిపోతూ సత్యసంకల్పం అరిచాడు. "ఇది..ఇది దారుణం! అన్యాయం! అక్రమం! దుర్మార్గం! నువ్వు....నువ్వు....నువ్వు..బ్లాక్ మెయిల్ చేస్తూన్నావ్!"

"బ్లాక్ మెయిల్, వైట్ మెయిల్, రెడ్ మెయిల్. నేను చేస్తున్న దాన్ని నీ ఇష్టం వచ్చిన పేరుతో పిలుచుకో! రెండు పనులూ చేయడానికి నీకు సరిగ్గా అరగంట గడువిస్తున్నా...."

"యూ బాస్టర్డ్! ఐ విల్ కాల్ ది పోలీస్! ఐ విల్ కాల్ ది సిబిఐ! ఐ విల్ కాల్ ది " సత్యసంకల్పం పూనకం వచ్చిన వాడిలా అరవడం ప్రారంభించాడు. వణుకుతున్న అతని చెయ్యి టెలిఫోన్ రిసీవర్ మీద పడింది.

శివరామ్ మెరుపులా కదిలాడు. సత్యసంకల్పం చేతిని దూరంగా తోసి, రిసీవర్ని అందుకున్నాడు. సత్యసంకల్పం తేరుకునేలోగా చకచకా ఒక నంబర్ని డయల్ చేశాడు.

"గోఫరన్, గో ఎ హెడ్! వీళ్ళంతా పోలీసుల్నే కోరుకుంటున్నారు. ఎ.సి.బి. వాళ్ళనీ, పోలీసుల్ని, క్రైమ్ రిపోర్టర్ ప్రభంజనాన్ని, ఫోటోగ్రాఫర్ని ఒకే వేన్‌లో

తీసుకురా....!"

"..........."

"యస్! అరగంట! నా ఇంటర్వ్యూకి అరగంట చాలు! క్విక్!.......ఫర్వాలేదు. మనకి ఉపయోగించక పోయినా, దేశానికి ఉపయోగిస్తుంది!" శివరామ్ రిసీవర్ని పడేసి నవ్వుతూ చూశాడు.

టేబుల్ మీదున్న సత్యసంకల్పం రెండు చేతులూ వణుకుతున్నాయి. అతని పెదవులూ, దవడలూ, కిందికి జారిన గడ్డమూ ఎంతో ఐకమత్యంతో వణుకుతున్నాయి. ఊపిరి పీల్చుకోడం మానేసి, శిలావిగ్రహాల్లా తలిమ్మా యిద్దరూ రెప్పవేయకుండా సత్యసంకల్పం శరీరంలో కేంద్రీకరించిన భూకంపాన్ని చూస్తున్నారు. ప్రాణేశ రావు కళ్ళు రెప్పల్ని చీల్చుకుంటూ శివరామ్ వైపే చూస్తున్నాయి. ఆ కళ్ళల్లో ఆశ్చర్యం, ఆరాధనా స్పష్టంగా ప్రత్యక్షమవుతున్నాయి.

శివరామ్ గిరుక్కున వెనక్కి తిరిగాడు. హుందాగా నడుస్తూ మూసిన తలుపుని చేరుకున్నాడు. అతని చెయ్యి పైకి లేచింది.

"ఆగు!" సత్యసంకల్పం బొంగురు కంఠం శివరాం చేతిని గాలిలో స్తంభింపజేసింది.

చేతిని దించుకోకుండా శివరాం అతనివైపు తిరిగి విసుగ్గా చూశాడు.

"స్కౌండ్రల్ కమ్ హియర్!" సత్యసంకల్పం తగ్గు స్వరంలో అన్నాడు. అతని ఆగ్రహం వెనక నక్కి దాక్కున్న ఓటమిని శివరాం రెండు చెవులతో శుభ్రంగా విన్నాడు

"యస్, ఎమ్ డీ?" మర్యాద ఉట్టిపడే కంఠంతో

అంటూ శివరాం అతని దగ్గరగా ఆగాడు.

“టెలిఫోన్ అందుకో. సీతో కా, గోవర్ధనో, గోపీచందనో ఎవడో వాడితో మాట్లాడు. ఇందాకా నువ్విచ్చిన ఇన్‌స్ట్రక్షన్స్‌ని కాన్సిల్ చెయ్! కూచుని మాట్లాడుదాం” సత్యసంకల్పం బింకంగా అన్నాడు.

చిన్నగా నవ్వుతూ శివరాం కుర్చీలో కూచుని టెలిఫోన్ని దగ్గరగా లాక్కున్నాడు. నంబర్ డయల్ చేసి, సిగిరెట్ వెలిగించాడు. కాసేపట్లో అతని కంఠం గదిలో ప్రతిధ్వనించింది.

“గోవర్ధన్.... సంప్రదింపులు ఫలిస్తున్నాయి. వెంటనే రావొద్దు. మరో అరగంటలో నేను తిరిగి రాకపోతే, నా ఫోన్ కాల్ కోసం యెదురుచూడకుండా అందర్నీ తీసుకుని విందుకి రా!”

రిసీవర్ని పడేసి శివరాం అర్థమైందా అన్నట్లు సత్యసంకల్పం వైపు చూశాడు.

“ఎలాగో మూడు లక్షలు పారేస్తాం. నువ్విక్కడికి వచ్చిన సంగతీ, తరవాత జరిగిన సంగతులూ, ఇంటర్వ్యూ అన్నింటినీ మరిచిపోయి వెళ్ళిపో!” సత్యసంకల్పం బెట్టుగా అన్నాడు.

“సత్యసంకల్పం, నీ సంకల్పం అసత్యంగా వుంది. వెనకాముందూ ఆలోచించి నేనొక మొత్తం చెప్పాను. బేరాలవల్ల ఆ మొత్తంలో మార్పులు వస్తాయి; కాదనను. అయితే ఆ మార్పులు యెప్పుడూ ఆ మొత్తాన్ని పెంచుతూనే వుంటాయి!” శివరాం నవ్వుతూ అన్నాడు.

పాలిపోతున్న మొహాన్ని సత్యసంకల్పం పాత్రో వైపు తిప్పి, నిస్సహాయంగా చూశాడు.

“మిస్టర్ సత్యసంకల్పం, త్రో ది బార్కింగ్ డాగ్

వాట్ ఇట్ వాంట్స్! వాడడిగింది గిరాటేయండి! తల చెడిపోయి. బీపీ పెరిగిపోయేలా ఉంది. పొద్దుట లేచి, ఏ అభ్యర్థి మొహం చూశానో...." పాత్రో పళ్ళు కొరుక్కుంటూ అన్నాడు. దీనబాంధవమూర్తి తలని గంగిరెద్దులా ఆడించాడు.

సత్యసంకల్పం నిట్టూరుస్తూ తలపంకించాడు. "అరగంటలో సర్దడం సాధ్యంకాదు...." గొణుక్కుంటున్నట్టు అన్నాడతను.

"సాధ్యం అవుతుంది; అయితీరాలి!" శివరాం నవ్వుతూ అన్నాడు. "వాళ్ళిద్దరూ వసూలు చేసుకున్న మొత్తాలకి తక్కువపడింది కలిపి సాయంత్రమో రేపో నీకు అందిస్తారు. ఇద్దరూ నీ ప్రాణమిత్రులుగా? నీది రొలాగా ఫర్వాలేదు. సో, నా సలహా విను; బ్యాంకు నుండీ అఘమేఘాలమీద మొత్తమంతా తెప్పించెయ్!"

"బా....స్టర్డ్...."

శివరాం జోక్ విన్నవాడిలా పకపక నవ్వాడు. "ఆ పని జరిగేలోగా ప్రాణేశరావు సెక్షన్‌లో పని చూస్తాడు. రామసీతారావుని ఫీల్డాఫీసరుగా నియమిస్తూ పక్కా ఆర్డర్స్ తయారు చేయిస్తాడు...."

"దటీస్ సన్నాఫ్ యువర్...." సత్యసంకల్పం ఉగ్రుడై పోయాడు.

"హోల్డాన్! ఆ ఆర్డర్ లేకపోతే నీ సొమ్ము నీ దగ్గరే ఉండిపోతుంది! నా దారిన నేను..."

"రామసీతారావెవడో.... వాడు నీ బంధువా?" పళ్ళు కొరుక్కుంటూ సత్యసంకల్పం ప్రశ్నించాడు.

శివరాం అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "అతను నా మేనల్లుడు. ఎందుకంటే, నువ్వు నా మేన

మోసవి!"

"ఇది ఘోరం! నువ్వడిగిన భిక్షం పారేస్తాం. జోలె నింపుకుని, తోకముడుచుకుని పారిపో! మా ఎస్టాబ్లిష్‌మెంట్ వ్యవహారాల్లో నువ్వు వేలు పెట్టడం నేను సహించను!" సత్యసంకల్పం బెదిరింపుగా అన్నాడు.

శివరాం రవ్వల్లా మెరుస్తున్న కళ్ళతో అతన్ని తదేకంగా చూశాడు. "సంకల్పం, ఆమాట మరోసారి అని చూడు!"

"ఒకసారి కాదు; వంద సార్లు అంటాను! ఏం చేస్తావ్?" సత్యసంకల్పం గాండ్రించాడు.

శివరాం అతన్ని రెప్పవేయకుండా చూశాడు. "ఏం చేస్తానో నేను చెప్పను. నీ మిత్రులిద్దరూ, నీ శిష్యుడు ప్రాణేశరావూ నీకు అర్థమయ్యేలా చెప్తారు!"

పాత్రో గొంతు సవరించుకున్నాడు. "మిస్టర్ సంకల్పం, లేనిపోని గొడవలు లేవదియ్యకండి. బాలూ, బ్యాటూ రెండూ అతని చేతిలోనే ఉన్నాయి! జరిగేదేదో జరిగిపోనివ్వండి. చరిత్ర ఇవాళ్టితో మునిగిపోదు!"

"యస్! అతను అడిగినవన్నీ యిచ్చేయండి. చేయబోయిన చిన్న పొరపాటుకు పేపర్లలోకెక్కి చిన్నబోవడం నాకిష్టంలేదు...." దీనబాంధవమూర్తి మెల్లిగా అన్నాడు.

పంక్చర్ చేయబడిన సైకిల్ ట్యూబులా, సత్యసంకల్పం నిట్టూర్చాడు. ఓటమి దళసరి ముసుగులా అతని మొహాన్ని కప్పేసింది. నుదురు ముడతలుగా మారింది. రెండోసారి నిట్టూర్చి అతను సాలోచనగా శివరాంవైపు చూశాడు.

"పొయ్యి ఊదే గొట్టంలా శబ్దం చేస్తూ నిట్టూరుస్తూ నువ్వు టైం వేస్టు చేస్తే నాకేం అభ్యంతరంలేదు. అయితే సేఫ్టీ పీరియడ్‌లో అప్పుడే అయిదారు నిమిషాలు...." శివరాం ఆపేశాడు.

సత్యసంకల్పం తన మొహాన్ని ప్రాణేశరావువైపు తిప్పాడు. "ప్రాణేశరావ్, రామసీతారావో వాడెవడో ఫైల్స్ చూసి, అపాయింట్‌మెంటు ఆర్డర్ టైప్ చేయించి పట్రా. వెళ్ళు!" అన్నాడు విషాదగీతం పాడుతున్న గాయకుడిలా.

ప్రాణేశరావు మెల్లిగా లేచాడు. సత్యసంకల్పం ఏదో గుర్తువచ్చిన వాడిలా లెటర్ హెడ్ మీద వణికే చేత్తో ఏదో బరికాడు. ఫర్రున చించి ఆ కాగితాన్ని ప్రాణేశరావువైపు విసిరాడు. "అకౌంట్సు హెడ్‌కి యిచ్చేయి. పదిహేను నిమిషాల్లో మొత్తం యిక్కడుండాలని చెప్పు....అన్నట్టు యెవరితోనూ యేమీ చెప్పకు. బ్యాంకు నుంచీ రాగానే, అపాయింటుమెంటు ఆర్డర్‌తో బాటు దాన్ని నువ్వే పట్రా!" ఆజ్ఞాపించాడతను ఎమ్.డి. హోదాలో.

తలపంకిస్తూ ప్రాణేశరావు స్వప్నచారిలా నడుస్తూ నిష్క్రమించాడు.

తీరుబడిగా, విశ్రాంతిగా కూచుని సిగిరెట్ వెలిగిస్తున్న శివరాంని సత్యసంకల్పం కొత్తగా చూశాడు. హార్ట్‌స్ట్రోక్ నుంచీ యిప్పుడిప్పుడే కోలుకుంటున్నవాడిలా తయారయ్యాడతను.

"మహాబలేశ్వ...." సన్నటి కంఠంతో సత్యసంకల్పం ప్రారంభించాడు.

"శివరాం!" శివరాం నవ్వుతూ సరిదిద్దాడు.

"ఆల్ .... రైట్ ........ శివరాం, నువ్వాడమన్నట్టుగా ఆడాల్సిన పరిస్థితి ఏర్పడింది; ఆదేశాం. జరిగిందంతా పూర్తిగా మరిచిపోతావుగా?" ప్రాధేయపడుతున్నట్టు ప్రశ్నించాడతను.

"పూర్తిగా; పర్మనెంటుగా!" శివరాం కులాసాగా నవ్వుతూ అన్నాడు.

సత్యసంకల్పం నిట్టూర్చి, క్షణకాలం తటపటాయించాడు. "శివరాం...."

"యస్?"

"మాట యిచ్చిన ముగ్గురికీ మేం ఉద్యోగాలిచ్చుకుంటాం. దాన్ని గురించి మళ్ళీ....మళ్ళీ... తిరగదోడవుగా?"

శివరాం పకపక నవ్వాడు. "తిరగతోడానికి నేనెవర్ని? కాకపోతే, మీరు ముగ్గురూ 'బఫెలో ఫెర్టిలైజర్స్'లో పెద్ద పెద్ద ఉద్యోగాల్ని క్రియేటు చేసి, ఆకాశం అంటే రేట్లతో ముగ్గురికి వేలం వేసేస్తున్నారని ఒకేవొక వ్యక్తికి తెలియజేసేసి, విశ్రాంతి తీసుకుంటాను!"

సత్యసంకల్పం ఆశ్చర్యంగా, ప్రశ్నార్థకంగా చూశాడు. "ఎవరికి?" తడబడుతూ అడిగాడతను.

తలలు వంచి, ఏకాగ్రతతో తనవేపే చూస్తున్న ముగ్గుర్నీ శివరాం చిరునవ్వుతో చూశాడు. "ఇతరదేశాల్లోని ఎరువుల ఫ్యాక్టరీల్ని సందర్శించడానికి వెళ్ళి, ఈ ఉదయమే ఫ్రాంక్‌ఫర్ట్ చేరుకున్న మీ ప్రొప్రయిటర్ భావరాజుకి!"

ముగ్గురూ ఒకేసారి ఉలిక్కిపడ్డారు. సత్యసంకల్పం కంగారునుండీ ముందుగా తెప్పరిల్లాడు. అసహాయత

ఆగ్రహంగా మారి ఆవిర్లుగా అతనిలోంచీ పైకి చిమ్మింది.

"స్కాండ్రల్! నీకన్నీ తెలుసు...." పళ్ళు కొరుకుతూ అన్నాడతను.

"అదే నా పెట్టుబడి!" అన్నాడు సగర్వంగా శివరాం.

## 6

తలుపు మూసి, దానికే ఆనుకుని సిగిరెట్ వెలిగించాడు శివరాం. అద్దంముందు కూచుని, పొద్దుతిరుగుడు పువ్వులా మొహాన్ని తనవేపు తిప్పి ఆత్రంగా చూస్తున్న లతని చిరునవ్వుతో చూశాడు. ఇంకా మేకప్ అతికించని లత మొహం రాత్రంతా మంచులో తడిసి శుభ్రంగా తయారైన గులాబీలా ఉంది.

"డార్లింగ్...." పెదాలకు దగ్గరగా ఉంచుకున్న లిప్‌స్టిక్‌ని కదపకుండా అంది లత.

"హౌడీ, హనీ?" శివరాం ఉషారుగా అన్నాడు.

"నెవర్ బెటర్! కమ్ నియర్ డార్లింగ్...." లత కంఠం ప్రేమతో పదునెక్కింది.

హోటల్ కుర్రాడు గుమ్మం పక్కనే వుంచిన వీఐపీ సూట్‌కేస్‌ని బూటుతో బలంగా తోశాడు శివరాం. గరగర చప్పుడు చేస్తూ వీల్స్‌మీద పరుగెట్టి, మంచానికి ఢీకొని ఆగింది సూట్‌కేస్.

సూట్‌కేసు వెంట పరుగెట్టిన లత చూపులు మళ్ళీ శివరామ్ మొహంమీదికి దూకాయి. ఇంకా తలుపుకే ఆనుక్కున్న శివరాంని ఆమె విశాల నేత్రాలు ఆక్షేపణగా చూశాయి. లిప్‌స్టిక్‌ని మేకప్ సరంజామాలోకి విసిరికొట్టి లత స్టూల్ మీద కూచునే అతనివేపు తిరిగింది.

"పిలిస్తే గానీ దగ్గరకు రాకూడదా?" అందామె కళ్ళతో, కంఠంతో కోపం నటిస్తూ.

శివరాం నవ్వు తెల్లటి పళ్ళని ఆమెకు చూపించింది. "పిలవని పేరంటానికి వెళ్ళి, అదిలించి, అదరగొట్టి తాంబూలాలన్నింటినీ వొళ్ళో పోసుకొచ్చే నన్ను నువ్వు పిలవాలా?"

"తాంబూలం అంటే గుర్తొస్తోంది! దక్షిణ ఎంత?" లత ఉషారుగా అడిగింది.

"లెక్క పెట్టుకున్నంతే!"

"పదా?" లత ఉద్రేకంతో అడిగింది.

"హుఁ. పది పైసలు తక్కువైనా మనం పట్టుకోంగా!" శివరాం పొగని రింగులుగా వదిలాడు.

లత లేడిలా గంతేసి, లేచి నించుంది. ఖరీదైన లంగా, ఖరీదైన జాకెట్టులో మణిపురి ఆట బొమ్మలా నించున్న లతని శివరామ్ కళ్ళు మెచ్చుకొంటూ చూశాయి. మెల్లిగా అతను కదిలాడు. లత అతనివేపు కదలబోయింది.

"హుఁ. కదలకు. అలాగే వుండు. నేను దగ్గరకు రాగానే వెనక్కి తిరుగు. అద్దంలో నిన్ను చూస్తూ అంతా చెప్తాను!" నవ్వుతూ అన్నాడు.

ఎర్రటి నాలుకతో అతన్ని వెక్కిరిస్తూ లత అద్దంవేపు తిరిగింది. కాసేపట్లో శివరాం ప్రతిబింబం ఆమె ప్రతిబింబం వెనుక ప్రత్యక్షమైంది. ఆమె బాబ్డ్ హెయిర్‌ని సవరిస్తూ అతని రెండు చేతులూ భుజాల మీదికి వాలాయి.

"చెప్పు!" లత ప్రతిబింబం అతని కళ్ళల్లోకి చూస్తూ అంది.

"ఏమిటి?"

"పిలవని పేరంటానికి వెళ్ళే నువ్వు ఈసారి పిలిచిన ఇంటర్వ్యూకు వెళ్ళావ్! ఫోన్ కాల్‌తో నన్ను గోవర్ధన్ అనే మగరాయుడిగా మార్చేశావ్. కథ కొలిక్కి వస్తోందని అప్పుడే అనుకున్నాను...."

"హనీ, కథ కొలిక్కి వచ్చితీరుతుందని నాకు ఎప్పుడో తెలుసు." శివరాం సగర్వంగా అన్నాడు.

"కథ ఎట్లా ప్రారంభమైందో నాకు బొత్తిగా అంతు పట్టడంలేదు. నీకు ఇంటర్వ్యూ ఎలా వచ్చింది?" లత ప్రతిబింబం కళ్ళు చిట్లించింది.

శివరాం చిన్నగా నవ్వాడు. "ఇంటర్వ్యూ శివరాంకు రాలేదు. మహాబలేశ్వర్రావుకు వచ్చింది."

"వాడెవడు?" లత అడ్డు తగిలింది.

"నా కవల సోదరుడు! లోకంలో బతకాలంటే, ఓపిగ్గా లోటుపాట్లు గమనిస్తూవుండాలి. మన రాష్ట్రంలో బఫెలో ఫెర్టిలైజర్స్ పెద్దసంస్థ. గవర్నమెంటు కాంట్రాక్టర్లు సిమెంటులో యిసుక కలిపినట్టు, పాలవాళ్ళు పాలల్లో నీళ్ళు కలిపినట్టు, పత్రికలవాళ్ళు వార్తల్లో ఊహాలు కలిపినట్టు, సినిమావాళ్ళు కథలో బూతులు కలిపినట్టు — రసాయనాల్లో రేగడిమట్టి కలిపి ఫస్టుక్లాసు ఫెర్టిలైజర్ పేరుతో అమాయకులయిన రైతులకు అమ్ముతూ ఆ సంస్థ కోట్లు సంపాదించుకుంది. అడపా దడపా కుర్రాళ్ళకు ఉద్యోగాలిస్తుంది; నామమాత్రం రోజువారీ వేతనంతో. ఏడాదో రెండేళ్ళో గడిచాక, వాళ్ళు రెగ్యులరైజేషన్ అడిగే సమయం వచ్చేసరికి, 'ఉపాధి కల్పన' శాఖలో ట్రెయినింగ్ అయిరమ్మని అదే రోజు డ్యూటీ మీద వాళ్ళని డెప్యూట్

చేస్తుంది ...”

“డార్లింగ్, అర్థం అయ్యీ కాకుండా అవస్థపెట్టేస్తోంది....” లత అడ్డు తగిలింది.

“అడ్డు రాకుండా వింటే అంతా అర్థమవుతుంది ఇది దీర్ఘం అయితే కానీ అసలు కథక అర్థం వుండదు!” శివరాం నవ్వుతూ అన్నాడు. “సో, రెండు మూడేళ్ళు అతి తక్కువ జీతంతో పనిచేసిన నిస్సహాయుల్ని ట్రెయినింగ్ పేరుతో బైటికి తోసేసి, ఆ సమయంలో పని సాగాలన్న సాకుతో మరి కొంతమంది నిరుద్యోగుల్ని రోజు వారీ జీతాల మీద చాకిరీకి యేర్పాటు చేసుకుంటుంది.... ....”

“అంతేగా? మరేం చేయాలి?” లత సందేహం వెలిబుచ్చింది.

“అంతే అయితే ఫర్వాలేదు. కానీ ఏడాది ట్రెయినింగ్ పూర్తి చేసుకువచ్చిన వాళ్ళని, ఖాళీలు లేవంటూ తిప్పికొట్టేస్తారు. లేకపోతే, సమయం చూసి, పిలిచి రెగ్యులర్ స్కేల్సు ఇస్తామని తగిలేస్తారు....”

“అన్యాయం!”

“ఈ అన్యాయాన్ని బఫెలో ఫెర్టిలైజర్స చాలా యేళ్ళుగా సాగిస్తూ, రెగ్యులర్ స్కేల్స్ వల్ల కలిగే అదనపు ఖర్చును తప్పించుకుంటూ ఎనిమిదిరూపాయల రోజు వారీ జీతం పేరుతో కూలీ ఇచ్చి పనులు చేసుకుంటోంది. ఈ విషయం పేపర్లలో చాలాసార్లు గుప్పుమంది. దీనికంతకీ మూలకారణం బఫెలో మేనేజింగ్ డైరెక్టర్ సత్యసంకల్పం. అంచేత రెండేళ్ళుగా బఫెలో కార్యక్రమాలమీద వో కన్నేసి వుంచాను....”

“అలాగా?”

"ఇప్పుడు ఇంటర్వ్యూలు జరిగిన ఫీల్డుఆఫీసర్స్ ఉద్యోగాల విషయంలో కూడా ఈ అవకతవక జరిగింది. వార్తల్లోకి యెక్కాక పర్మనెంట్ పోస్టింగ్స్ చేస్తామంటూ దరఖాస్తులు పిలిచారు. ఇంటర్వ్యూలు యేర్పాటు చేశారు. కాన్సిల్ చేశారు. సో మహాబలేశ్వర్రావు పేరుతో నేనూ అప్లై చేశాను...."

"డార్లింగ్, ఆ పేరుతో నీకు సర్టిఫికెట్సు లేవుగా?" లత ఆశ్చర్యపోతూ అడిగింది.

శివరాం చిన్నగా నవ్వాడు. "డబ్బుంటే, డాక్టరేట్లే వస్తాయి! సర్టిఫికెట్లు వో లెక్కా? వివరాలు అడక్కు. అన్నీ సంపాయించాను. ఇంటర్వ్యూ వచ్చింది. ఈసారి జరుగుతుందని కనిపెట్టాను. ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షన్ హెడ్ సహకారాన్ని కొనేశాను. అభ్యర్థుల లిస్టూ, ఇంటర్వ్యూ చేసే పెద్దవాళ్ళ లిస్టూ సంపాయించాను. వాళ్ళందరినీ పరిశీలించాను. బఫెలో ఫెర్టిలైజర్స్ ఇంటర్వ్యూ రోజుకి ముందురోజు ఆ ఎనిమండుగురికీ ప్రిలిమినరీ ఇంటర్వ్యూ యేర్పాటుచేశాను...."

"డార్లింగ్...."

"యస్?"

"నువ్వు పెట్టిన ఇంటర్వ్యూకి వాళ్ళెలా వచ్చారు? నీ ఉత్తరాలు వాళ్ళకి అనుమానం...."

"నా ఉత్తరాలా? లేవే!" శివరాం నవ్వాడు.

"డార్లింగ్..." లత చిరాకు నటించింది.

"బఫెలో ఫెర్టిలైజర్స్ లెటర్ హెడ్ మీద ఎస్టాబ్లిష్‌మెంటు సెక్షన్ గురుడు ప్రాణేశరావు సంతకం చేశాడు...."

"నిజంగా?"

శివరామ్ నవ్వాడు. "అతని సంతకంతో నాకో లెటర్ హెడ్ వచ్చిందా? దాని ఆధారంతో మ్యాజిక్ ప్రింటర్స్‌లో లెటర్ హెడ్ తయారుచేయించాను. సెక్షన్ హెడ్ సంతకం కిందున్న రబ్బరుస్టాంపుని పన్నెండు రూపాయల ఖర్చుతో పుట్టించాను. కళ్ళు మూసుకుని అతని సంతకాన్ని గీశాను! సో, ప్రిలిమినరీ ఇంటర్వ్యూ లెటర్స్ పకడ్బందీగా తయారయ్యాయి!"

"మైగాడ్!" లత ఆశ్చర్యంతో అరిచింది.

"సీ 'మై శివరామ్' హాస్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"తరవాత!" లత ఉత్కంఠతో ప్రశ్నించింది.

"పాపం ఎనమండుగురూ భయభక్తులతో ఇంటర్వ్యూకు వచ్చారు. హోటల్ లక్స్‌లో వాళ్ళని ఇంటర్వ్యూ చేశాను. ముగ్గురు వీరులు లక్షలాది రూపాయలతో ఉద్యోగాల్ని కొనే ప్రయత్నంలో వున్నారనీ, అడ్వాన్సులు కూడా చెల్లించారనీ తెలుసుకున్నాను ..."

"గుడ్ గాడ్!"

"ఇంటర్వ్యూ బోర్డు మెంబర్లలో ఎవరెవరు ఎవరెవరికి అమ్ముడుపోయారో కనుక్కున్నాను. ఆ మెంబర్ల చరిత్రల్ని ఒక్క రోజులో కనిపెట్టాను. ఇంటర్వ్యూకి చాలా ఆలస్యంగా హాజరయ్యాను...." శివరాం ఆగి, ఆమెనుండీ దూరంగా జరిగాడు.

లత అద్దంముందునుండీ వెనక్కి తిరిగింది. మంచం మీద కూచున్న శివరాంని మెరిసే కళ్ళతో చూస్తూ నడిచింది. అతనిపక్కనే వాలి, ఆత్రంగా చూసింది. "ఆ తరవాత?"

"ఏముంది? కథ కొలిక్కి వచ్చింది!" శివరాం

నవ్వుతూ అన్నాడు.

లత కోపం అభినయిస్తూ అతని రెండు బుగ్గల్నీ సాగదీసింది. "నోరు మూసుకుని వివరంగా చెప్పు!"

శివరాం చిరునవ్వుతో చూస్తూ వుండిపోయాడు. లత కళ్ళు పెద్దవి చేసింది.

"కమాన్ డార్లింగ్ చెప్పు!"

"నోరు మూసుకుని చెప్పమన్నావుగా? కళ్ళతో చెపుతున్నా" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత్న చివాల్న పైకి లేచింది. "ఏడిపిస్తున్నావ్! చీర కట్టుకుని షికారు వెళ్ళిపోతా!"

బుంగమూతి పెట్టిన లతని శివరాం మంచంమీదికి లాగాడు. ఆమె మొహంలోకి నవ్వుతూ చూస్తూ ప్రారంభించాడు: "ఇంటర్వ్యూకి వెళ్ళాను. కానిప్పట్లో నా నిజ స్వరూపం చూపించాను. వాళ్ళాడుతున్న ఇంటర్వ్యూ నాటకాన్ని 'నడివీధి నాటకం'గా మార్చేస్తానన్నాను. ఒకే ఉద్యోగాన్ని ముగ్గురికీ అమ్మిన మొత్తాన్ని రెండింతలు చేసి కక్కమన్నాను. లేకపోతే అభ్యర్థులందరి చేతా వాళ్ళనే ఇంటర్వ్యూ చేయిస్తానన్నాను. ఇంటర్వ్యూ హాంలో ఇరికించాను. హడిలి చచ్చారు; అడిగింది యిచ్చారు...."

"గుడ్ హెవెన్స్!"

"ఇంకా కొంచెం వుంది! వేలంలో ఉద్యోగాన్ని సొంతం చేసుకోవాలనుకున్న ముగ్గురికీ కాకుండా మరో అభ్యర్థికి—రామసీతారావుకు—ఫీల్డాఫీసర్ ఉద్యోగం ఇప్పించాను!" శివరాం ముగించాడు.

"డార్లింగ్, ఆ ముగ్గురూ కాకుండా అయిదుగురు వచ్చారుగా? అందర్లోకీ ఆ రామసీతారావు—యేమిటో

తిక్క పేరు.—అతనికే ఎందుకు ఇప్పించావ్?" అంత సందే
హాన్ని వ్యక్తం చేసింది.

"హనీ, చక్కటి ప్రశ్న అడిగావ్!" శివరాం నవ్వుతూ అన్నాడు. "ముందు నేను వాళ్ళందరినీ చక్కగా ఇంటర్వ్యూ చేశాను. రామసీతారావే తగిన వ్యక్తి అని నిర్ణయించాను...."

"ఎలా?"

"డబ్బుతో ఉద్యోగాన్ని కొనే దుర్మార్గ ప్రయత్నం చేసిన ముగ్గురినీ మొట్టమొదట్లే ఒక గ్రూప్ కిందికి చేర్చి, కొట్టిపారేశాను. పోతే ఇంకా అయిదుగురున్నారు. వాళ్ళలో ఒకతను యేదో చిన్న కంపెనీలో రికార్డు అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు. అంటే అతనికి ఈ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం రాకపోయినా బతగ్గలడు. రెండో అతను యేదో కాన్వెంటులో టీచరుగా వున్నాడు. అతను అక్కడే కంటిన్యూ అయితే మరేం నష్టంలేదు. మూడో అతను వృత్తిలోకి వచ్చేస్తున్న కథా రచయిత. తెలుగులో ప్రస్తుతం బోల్డన్ని పత్రికలున్నాయి. అన్నింటికీ కథలు కావాలి. కథలకి డిమాండ్ వుంది. రచయితగా సమాజాన్ని మార్చివేయాలన్న ఆవేశాన్ని అతను వ్యక్తం చేశాడు. అంత ఆవేశాన్ని ఉద్యోగం గొలుసుల్లో బంధించరాదు! సో, అతనూ పోయాడు. ఇక నాలుగో వ్యక్తి ఆర్టిస్టు. బొమ్మలూ, కార్టూన్లూ, సైన్ బోర్డులూ వగైరా పనులు చేస్తాడు. అదో ఎక్స్ట్రా క్వాలిఫికేషన్ గా, రచయితలాగే—అతనూ చెప్పుకున్నాడు...."

శివరామ్ ఆగి మరో సిగరెట్ వెలిగించాడు. లత ఆతన్నే చూస్తూ, కథ చెప్పమని చూపుల్తోనే తొందర

పెడుతోంది.

"ఇకపోతే, మిగిలిన వ్యక్తి రామసీతారావు. అతను మామూలు మనిషి. అందరికీ వున్న క్వాలిఫికేషన్ వుంది. ఇతర వ్యాపకాల్లో ఇమడలేకపోయాడు. ఏ పనీ లేదు. అయితే కడుపువుంది. ఆధారపడిన సంసారం వుంది. డబ్బిచ్చి ఉద్యోగం కొనేవాళ్ళు, ఆ డబ్బుతో యేదో వ్యాపారం చేసుకోవచ్చు. టీచరు టీచరుగా వుంటే తప్పులేదు. గుమాస్తా గుమాస్తాగానే వుండొచ్చు. ఇక రచయితా, ఆర్టిస్టూ—వాళ్ళు లోకానికి కావాలి. ఆ కళల్లో వాళ్ళు సమాజానికి ఉపయోగపడే అవకాశం వుంది. ఇలా ఆలోచించి, ఎనిమిదిమందిని ఒక్కడికి తగ్గించాను!"

"ఎక్సలెంట్! డార్లింగ్, యూ ఆర్ గ్రేట్!" లత వుద్రేకంతో అరిచింది. రెండు చేతులనీ అతని భుజాల చుట్టూ వేయబోతూ యేదో గుర్తొచ్చి ఆగింది.

"డార్లింగ్ ...."

"యెస్, హనీ?"

"వాళ్ళు.... పోలీసుల దగ్గరకు వెళ్ళరూ?"

సిగరెట్ పీకని గదిమూలకు విసిరి శివరాం పకపకా నవ్వాడు. "వెళ్ళరు. ఎందుకంటే వెళ్ళలేరు! ఎందుకంటే, వెళ్తే నా గురించి చెప్పాలి. నా గురించి చెప్పాలంటే తమ గురించీ వాళ్ళు చెప్పుకోవాలి! వాళ్ళు చెప్పుకోకపోతే నేను చెప్తాను!"

"ఫర్వాలేదంటావా?" లత మళ్ళీ సందేహించింది.

"హనీ, చీర కట్టుకో. పోలీసుల పేరెత్తి ముఖ్యమైన పని గుర్తుచేశావ్. అతనితో మాట్లాడాలి...."

"ఎవరతను?"

# 109

"మనం యే అడ్వెంచర్ చేసినా అతనికి తెలియ చేయాలి. లేకపోతే అతను బాధపడతాడు!"

"డార్లింగ్ ...."

"కమాన్. చీర! ఈలోగా ఫోన్‌లో అతనితో మాట్లాడతాను...."

"డార్లింగ్ ....అతను .. అతను" లత ఆలోచిస్తూ అంది.

"అతనే; డిటెక్టివ్ టెంపో...." శివరామ్ రిసీవర్‌ని అందుకుని సిగరెట్ ముట్టించాడు.

('శివరామ్ అడ్వెంచర్స్' సీరీస్‌లో
ఇది మూడవ నవల.)

# విమాన దోపిడి

## భీమవరపు పురుషోత్తం

(గత సంచిక తరువాయి)

**8**

అంతే! బిగ్గరగా అరిచి కోదండాన్ని హెచ్చరిస్తూ పిస్టల్ తీసాడు.

అప్పటికే నలుగురూ డేనియల్ వెనుదిరగడం చూశారు! సుందరరాజన్ చంకలో కర్ర వదిలేసి దాదాపుగా తమను సమీపించిన తెల్లజాతీయుడిపై పు చురుగ్గా ఉరికి, గన్ అందుకొని తను క్రిందికి పడిపోతూ అతడ్ని కూడా చెట్లచాటుకి లాగేశాడు. అతడికి తెలుసు ఆ అవకాశం పోగొట్టుకుంటే లెదర్ బాగ్ సంపాదించడం, వాళ్ళను అంతంచేయడం అసంభవం అని!

డేనియల్ పేల్చిన పిస్టల్ గుళ్ళు పడిపోయినవాళ్ళకు రెండు మూడంగుళాల పైనుండి చెట్ల బెరడులోనికి దూసుకొనిపోయాయి. మిగతా ముగ్గురు తెల్లజాతీయులు చెట్ల వెనక్కి తప్పుకున్నారు.

అతికష్టంమీద మోకాళ్ళమీద లేచిన సుందరరాజన్ స్టెన్‌గన్ డేనియల్ వైపు గురిపెట్టి కాల్చాడు!!

అది తప్పించుకోడానికి ఏ అడ్డూలేని విశాలమైన ఇసుక మైదానం కావడంతో డేనియల్ రక్తపు మడుగులో క్రిందికి జారిపోయాడు అరుస్తూ. క్షణాల్లో అతడు నిర్జీవుడయ్యాడు.

క్షణాలమీద జరిగిపోతున్న కాల్పులను వెర్రిగా చూస్తూ పడవ చాటున అతుక్కుపోయాడు కోదండం. వెంటనే సుందరరాజన్ కోదండంవైపు పేల్చిన గుళ్ళు ఇసుకలోనికి, కొన్ని పడవలోనికి దిగబడ్డాయి.

డేనియల్ అంతమయ్యాడని గ్రహించిన కోదండం భయభ్రాంతుడయిపోయాడు. ఇసుకలో పడివున్న డేనియల్ మృతదేహం అస్పష్టంగా కనబడుతూంది అతడికి. కాల్పులు జరుపుతున్నది యెవరో స్పష్టంగా కనిపించకపోయినా అది సుందరరాజ నేనని లీలగా పసిగట్టగలిగాడు!

చాలాసేపు నిశ్శబ్దం తాండవించిందక్కడ!

తెల్లజాతీయులు చెట్ల వెనుకనుండి కదలడంలేదు. సుందరరాజన్, డేనియల్‌ని చంపగలగడంతో కొంత ఆనందంగా వున్నాడు. ఇప్పుడు తీరిగ్గా ఆలోచించసాగాడు మిగిలిన శత్రుశేషాన్ని కూడా పూర్తిచేయడానికి....!

పడవ వెనక దాగిన కోదండం ఎంతకీ వెలుపలికి వచ్చేలా కనిపించడంలేదు. అసహనంగా కదిలాడతడు. వెనక్కి చూశాడు. తెల్లజాతీయులు చెట్లకు అతుక్కుపోయి వున్నారు.

విసుగ్గా పైకి లేవబోయాడు అటువైపుకు నడవడానికి

అప్పటికే కాలయాతన భరించలేక పడవ వెనుకనుండి పైకి లేచిన కోదండం కాల్పులు జరపడంతో, అతడి తలపై చెట్టు బెరళ్ళు బుల్లెట్ల తాకిడికి తూట్లు తూట్లు పడిపోయాయి.

వెంటనే నేలకు వంగి వచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకున్నాడు సుందరరాజన్. గన్ గురిచూసుకొని నిర్విరామంగా కాల్పులు జరిపాడు!!

తన తొందరపాటుకు చింతిస్తూ కోదండం చప్పున క్రిందికి వంగబోయాడు. కానీ అప్పటికే ఆలస్యం జరిగింది! కంఠంలోనూ తలలోనూ దూరిన బుల్లెట్లతో నోటి నుండి రక్తం కారుతూండగా నిశ్శబ్దంగా పడవ వెనక్కి జారిపోయాడతడు.

రిలీఫ్ గా నిట్టూర్చి విజయగర్వంతో పైకిలేచాడు సుందరరాజన్. దూరంగా పడున్న తన కర్ర చేతిక్రింద అమర్చుకొని, ఇసుకలో నడుస్తూ పడవ దగ్గరికి వెళ్ళి చూశాడు.

నిర్జీవంగా పడివున్న కోదండం శరీరాన్ని చూసి తృప్తిగా తలపంకించాడు. తెల్లజాతీయుల సాయం పెద్దగా లేకపోయినా, అదృష్టం తనవైపు వుండబట్టే తన పని సానుకూలమయిందన్న నమ్మకం కుదిరిందతడికి.

అప్పుడు కదిలాడు అతడు లెదర్ బాగ్ కోసం! తెల్లజాతీయులు ధైర్యంగా ముందుకొచ్చారిప్పుడు. సుందరరాజన్ మాట్లాడకుండా అక్కడి ప్రదేశాన్నంతా వేగంగా వెదకసాగాడు.

ఒక తెల్లజాతీయుడు అడిగాడు. "మిస్టర్ రాజన్! ఏమిటి ఇంకా ఆలస్యం? ఇక్కడనుండి బయటపడ్డానికి దేవుడి దయవల్ల ఈ పడవ దొరికింది మనకు. ఇక మనం

ఈ దీవిని ఎంత త్వరగా వదిలిపెడితే అంత మంచిది!"

విసుగ్గా చూశాడు సుందరరాజన్. "మిస్టర్ నువ్వు అనవసరంగా కంగారుపెట్టకు నన్ను. వీళ్ళ దగ్గర నా బాగ్ వుండాలి. లెదర్ బాగ్! ముందది కావాలి నాకు!" చెప్పాడు.

తెల్లజాతీయులు అసహనంగా చూశారు సుందర రాజన్ వంక. "ఏముందా బాగ్‌లో? అంతముఖ్యమా!" అడిగారు.

తడుముకోకుండా చెప్పాడు సుందరరాజన్ "నా బట్టలు, సామాన్లు అవసరమైన కొన్ని కాగితాలు ఉన్నా యందులో!"

తప్పేదిలేక వాళ్ళు కూడా వెదుకులాటలో పడ్డారు. ఇంతలో ఒక తెల్లజాతీయుడు అర్చి చెప్పాడు "అరె!? అటు చూడండి!"

అప్రయత్నంగా అందరూ సముద్రంవైపు చూశారు?! దూరంగా పల్చటి నీలంరంగులో వున్న సముద్రపు అలల వెనుక. పొగ! మెల్లగా పైకివస్తూన్న పొగ, అందరి ముఖాల్లో ఆశ్చర్యం! మరో తెల్లజాతీయుడు "ఏదో షిప్పు వస్తూన్నట్టుంది ఇటువైపు!!" అంటూ చెప్పాడు.

## 9

తెల్లజాతీయులకు వెర్రి ఆనందంగా వుంది షిప్పు దీవి వైపే రావడం చూసి! సుందరరాజన్ స్థితిమాత్రం అగమ్యగోచరంగా వుంది.

అసలు తాను ఇంతవరకూ కష్టపడింది బాగ్ కోసమే అని అతడికి తెలుసు. అలాంటిది అన్నీ పూర్తయ్యాక

బాగ్ కనిపించకుండా పోవడం, సరిగ్గా అదే సమయంలో ఆ నిర్మానుష్య దీవిని దాటడానికి షిప్పు రూపంలో అవకాశం రాబోవడం అతడిని అగమ్యగోచరంలో పడవేసింది.

"అరె! ఈ శవాలు ఇక్కడే ఉంటే షిప్పులో వాళ్ళు మనల్ని దగ్గరికి కూడా రానీరు. వీటిని తొలగించాలి ఇక్కడనుండి వెంటనే!" ఒక తెల్లజాతీయుడు చెబుతున్నాడు కంగారుగా.

మిగతా ముగ్గురు కూడా కంగారుపడ్డారు శవాల్ని చూసి. కాసేపటికి వాళ్ళు వాటిని ఈడ్చుకొంటూ చెట్లలోనికి దూరంగా పోయారు. ఒకచోట లోతుగా క్రిందికి గొయ్యిలా వున్న ప్రదేశంలో పడవేశారు. ఇసుకలో రక్తాన్ని పైన ఇసుకజల్లి కప్పివేశారు!

సుందరరాజన్ మాత్రం అప్పుడప్పుడు షిప్పువైపు చూస్తూ బాగ్ కోసం వెదుకుతూనే వున్నాడు. ఇంతలో ఒక తెల్లజాతీయుడు అతడి చేతిలో స్టెన్‌గన్ తీసుకొన్నాడు. "ఏ ఒక్క ఆయుధం మనవద్ద ఉన్నా అది మనకే ప్రమాదం!" కోపంగా చూసిన సుందరరాజన్‌ను ఉద్దేశించి చెప్పాడతడు.

ఆయుధాలు కూడా తీసికెళ్ళి ఎక్కడో పడవేశారు. అనుమానించదగ్గ ఆధారాలేవీ లేకుండా చేశారక్కడ తెల్లజాతీయులు.

క్రమంగా షిప్పు దీవిని సమీపించింది—

చాలా పెద్దదిగా వుంది షిప్పు. తెల్లజాతీయులు ఒడ్డునే ఇసుకలో నిలబడి చేతులు నిర్విరామంగా ఊపుతున్నారు షిప్పువైపు. షిప్పు ఇటువైపు రాదేమోనని వాళ్ళకు భయం వుంది.

సుందరరాజన్ నిరాశగా చెట్లలోనుండి బయటికి వచ్చాడు. అప్పటికి తీరానికి దూరంగా లంగరు వేయ బడింది షిప్పు. బాగా ఎత్తులో షిప్పుపైన ఇనుప ఊచల గోడను పట్టుకొని కొందరు మనుషులు సరిగా బట్టలేని తెల్లజాతీయుల వంక, దీవిలోనికి ఆసక్తిగా, చిత్రంగా చూస్తున్నారు.

షిప్పునుండి ఆరు మోటారుబోట్లు నీటిపైకి దిగాయి. మొదటి బోటులో ఆయుధాలు ధరించిన షిప్ సెక్యూరిటి ఫోర్స్, మిగతా వాటిల్లో రంగురంగుల బట్టలలో ప్రయాణీకులు ఒడ్డుకు చేరుకొన్నారు!

సగానికి పైనే ఇసుకలోనికి వచ్చి ఆగిన బోట్లనుండి దిగారందరూ.... సెక్యూరిటి ఫోర్స్ వాళ్ళు తెల్లజాతీయులను సమీపిస్తూ ప్రశ్నించారు.

"ఎవరు మీరు!?"

ప్రయాణీకులు ఆసక్తిగా వాళ్ళను చుట్టుముట్టారు.

ఒక తెల్లజాతీయుడు చెప్పాడు ధైర్యంగా జరిగింది జరిగినట్టు, డేనియల్, కోదండాల ఉదంతం మినహా.

"చాలా ఏళ్ళుగా యిక్కడే పడివుంటున్న దురదృష్ట వంతులం.... దయచేసి మమ్మల్ని కూడా వెళ్ళేటప్పుడు మీతో తీసుకెళ్ళండి ప్లీజ్!" అంటూ అభ్యర్థించాడు.

ప్రయాణీకుల్లో నుండి నల్లటి పరిశుభ్రమైన సూట్ వేసుకొన్న యింగ్లీషాయన ఫోర్స్ వాళ్ళతో చెప్పాడు.

"వాళ్ళ పరిస్థితి అర్థమవుతోందిగా. పైగా థాయ్ లాండ్‌లో వ్యతిరేక శక్తుల సమస్య సమసిపోయి దాదాపు ఐదారేళ్ళు అవుతూంది. అందువల్ల వీళ్ళను మనతోపాటు తీసికెళ్ళడం ధర్మం!" తెల్లజాతీయులు కృతజ్ఞతగా చూశారు ఆయన వంక.

ఫోర్స్ వాళ్ళకు యిక అప్పటికే వాళ్ళలో అనుమా నించవలసిదేం కన్పించలేదు. ఫార్మాలిటీగా ఒకసారి ఐదుగుర్ని చెక్ చేశారు. తర్వాత విషయమంతా కెప్టెన్‌కి తెలియపర్చి, వాళ్ళను తమతో తీసికెళుతున్నామని తెలి పారు. దానితో తెల్లజాతీయుల ఆనందానికి అవధి లేకుండా పోయింది.

తర్వాత ప్రయాణీకులు ఫోర్స్ సహాయంతో దీవి చూడడానికి, ఒకరినొకరు హెచ్చరించుకుంటూ కదిలారు....!

తెల్లజాతీయులు అదిరిపడ్డారు, తాము శవాలు దాచిన చెట్లవైపే వాళ్ళు వెళ్ళడం గమనించి!

ఒక తెల్లజాతీయుడు తత్తరపాటుగా చెప్పాడు. "అటువైపు నేలంతా లోతుబురద. గోతుల్లోనికి జారి పోయే ప్రమాదం వుంది! పైపెచ్చు అటువైపు బురదకు మొలచిన పొదల్లో పాములు కూడా చేరాయి....ఇటు వైపు అయితే వృక్ష సౌందర్యం చూడడానికి మీకు సౌకర్యంగా ఉంటుంది."

సాధ్యమైనంతవరకూ ప్రయాణీకుల్ని భయపెట్టి దారి మళ్ళించడానికి అతడి ప్రయత్నం ఫలించింది. అతడి మాటలకు భయపడి ఆగిపోయిన ప్రయాణీకులు తమ దారి ఇటువైపుకు మరల్చుకొన్నారు! మిగతా తెల్లజాతీయులు అతడిని అభినందనపూర్వకంగా చూశారు. సుందర రాజన్ కూడా ప్రయాణీకులు దారి మార్చుకోవడంతో రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

అంతకుముందే ఇద్దరు ముగ్గురు ప్రయాణీకులు దీవి లోపలికి వెళ్ళే ధైర్యంలేక ఒడ్డునే వుండిపోయారు.

తెల్లజాతీయులు వాళ్ళను అడిగారు తిరుగుప్రయాణం

రొప్పుడని?

అది క్రూరమృగాలు లేని దీవి కావడం వలన రాత్రికి దీవిలోనే ఉండి ఉదయమే తిరిగి ప్రయాణమవ్వాలని చెప్పారు వాళ్ళు.

దానికి తెల్లజాతీయులు కొద్దిగా నిరాశపడ్డారు. ఎప్పుడు బయటి ప్రపంచంలో పడదామా అని వేగిరం పడుతున్న వాళ్ళకు, తిరుగు ప్రయాణం మర్నాటి ఉదయానికి అని తెలిసేసరికి ఉస్సురనిపించింది.

అయితే అది విని సుందరరాజన్‌కి ఉత్సాహం వచ్చింది. తన బాగ్ వెదుక్కోవడానికి తగిన సమయం వుంటుంది అనుకొన్నాడతడు!

# 10

క్రమేపీ సాయంత్రం కావచ్చింది. దీవిలో చాలా వరకూ తిరిగి ప్రకృతి సౌందర్యాలు చూసి ఉత్సాహం తీర్చుకున్న ప్రయాణీకులు తీరానికి చేరారు అలసిపోయి.

అస్తమించే సూర్యుని ఎర్రని కాంతికి వింతగా మెరుస్తూంది సముద్రపు నీరు. దీవి చుట్టూ వున్న అనంతమైన నీటిపై దీవికి చెందిన యెన్నో పక్షులు ఇంకా యెగురుతూండడం సర్వం మరచిపోయి తిలకించసాగారు ప్రయాణీకులు....

మనీలా నుండి సింగపూర్ బయలుదేరిన ప్రయాణీకులు వాళ్ళు! షిప్పులో వాళ్ళు ఆ దీవి గురించి వినడం, పైగా వాళ్ళెక్కిన షిప్పు దీవి సమీపం నుండే వెళ్ళవలసి రావడంతో, ప్రయాణీకుల కోరికపై షిప్పు కెప్టెన్, సెక్యూరిటీ ఫోర్స్ సహాయంతో వారికా సౌకర్యం కల్పించాడు. దీవి కూడా క్రూరమృగాలు లేనిదని తెలియడంతో వాళ్ళ కోర్కె సులభంగా నెరవేరింది.

సుందరరాజన్ సమయాన్ని వృథా చేయడంలేదు. బాగ్ కోసం గోప్యంగా వెతుకుతూనే ఉన్నాడు. కానీ దాని ఆచూకీ మాత్రం తెలియటంలేదు. అతడు బాగ్ కోసమే వెదుకుతున్నాడని తెలిసినా పెద్దగా పట్టించు కున్నట్టు కనిపించలేదు తెల్లజాతీయులు! వాళ్ళు ఎప్పుడు తెల్లవారుతుందా అని యెదురుచూస్తున్నారు.

చీకట్లు అలుముకోసాగాయి దీవిచుట్టూ. మధ్యాహ్నం ఎర్రగా కాలిన ఎండ సాయంత్రమయ్యేకొలదీ క్రమంగా చల్లబడుతూ వచ్చింది. చీకటిపడ్డాక పూర్తిగా చల్లగా మారిపోయింది. వినీలాకాశంలో నక్షత్రాలు ప్రత్యక్ష మౌతున్నాయి ఒక్కొక్కటిగా.

డిన్నర్ ఏర్పాట్లు చేయబడ్డాయి తీరంలోనే. దాని కోసమే ఎదురుచూస్తున్నారు తెల్లజాతీయులు. వడ్డించిన పదార్థాలే గాకుండా అడిగి మరీ వేయించుకొని తిన్నారు వాళ్ళు. డిన్నర్ పూర్తయ్యాక లైట్ మ్యూజిక్‌తోనూ, పాటలతోనూ చాలాసేపు కాలక్షేపం చేశారు ప్రయాణీకులు. అదొక అద్భుతమైన అనుభవంలా ఉంది వాళ్ళకు.

షిప్‌లో నుండి పడుకోవడానికి కావలసిన సామాగ్రి కూడా తీరంలోకి దించబడింది.... కొందరు చిన్న చిన్న గుడారాలు వేసుకొన్నారు. మరికొందరు ఇసుకలోనే బ్లాంకెట్లు పర్చుకొన్నారు. కొంతమంది దూరంగా పోయి, మంటలు వేసుకొని చుట్టూ మూగి కబుర్లు చెప్పుకో సాగారు.

తెల్లజాతీయులకు, సుందరరాజన్ కు దుస్తులు ఇచ్చారు. డాక్టరు సుందరరాజన్ గాయంపై కట్టువిప్పి ఆయింట్ మెంటు పూసి మాదివేసి కట్టుకట్టాడు. రెండు ఇంజక్షన్లు కూడా చేశాడు. తెల్లజాతీయులు గోళ్ళు కట్ చేసుకొని

సముద్రంలో చాలాసేపు స్నానాలు చేసి బట్టలు వేసుకొన్నారు. చాలా కాలానికి మంచిబట్టలు వేసుకోగలిగినందుకు మురిసిపోతున్నారు వాళ్ళు.

హాయిగా నవ్వుతూ త్రుళ్ళుతున్న ప్రయాణీకుల్ని చూస్తే యిన్ని సంవత్సరాలు తాము పోగొట్టుకున్న స్వేచ్ఛ గుర్తు వచ్చి కొద్దిసేపు బాధపడ్డాడు.

మెల్లగా ఒక్కొక్కడు నిద్రలోకి జారసాగారు. సందడి సద్దుమణిగే కొద్దీ సముద్రపు అలల హోరు స్పష్టంగా వినిపించసాగింది. తెల్లజాతీయులు, సుందరరాజన్ పడవ ప్రక్కనే పడుకున్నారు. సన్నగా వీస్తున్న చలిగాలికి బ్లాంకట్లు కప్పుకుని వెచ్చగా పడుకున్నారు.

తెల్లజాతీయులు గురక శబ్దం చేస్తూ హాయిగా నిద్రిస్తున్నారు. సుందరరాజన్ కి మాత్రం కళ్ళు మూతపడడం లేదు. బాగ్ ఏమయింది అన్నది అతడికి పెద్ద ప్రశ్న అయి కూర్చుంది?! అప్పటికే ఉన్న సమయాన్ని పూర్తిగా వినియోగించుకుని శక్తివంచన లేకుండా వెదికాడతడు! వెదికి వెదికి విసుగుపుట్టింది అతడికి.

ఎప్పుడో తెల్లవారుజామున పట్టింది నిద్ర! మాటల శబ్దాలకు కళ్ళు తెరిచాడు సుందరరాజన్. తెల్లవారిపోయింది పూర్తిగా! అప్పటికే దాదాపు అందరూ లేచి సామానులు సర్దేశారు. సామాన్లతో బాటూ ప్రయాణికులూ మెల్లమెల్లగా షిప్పులోనికి చేరుకుంటున్నారు మోటారుబోట్లలో ...

ఎండమీద పడ్డంతో లేవక తప్పలేదు అతడికి. బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాడు. తెల్లజాతీయులు ఇంకా షిప్పులోనికి వెళ్ళలేదు. తొందరపడుతున్నారు వెళ్ళడానికి. అతడిని కూడా తొందరపెట్టసాగారు.

"ఏమిటి నీకు రావాలని లేదా!" తెల్లజాతీయు డొకడు అడిగాడు అతడి నిరాసక్తత గమనించి.

ఇబ్బందిగా నవ్వి "అలాంటిదేం లేదే! నాకూ రావాలని యెందుకు లేదు!?" అన్నాడు సుందరరాజన్.

ఇక మాట్లాడలేదు అతడు. వాళ్ళంతా బయల్దేరే ఉత్సాహంలో పడిపోయారు. సామాన్లు పూర్తిగా షిప్పులోనికి చేరాయి. ప్రయాణీకులతోబాటు ఒక బోట్‌లో తెల్లజాతీయులూ ఎక్కి కూర్చున్నారు. బోట్ ధ్వని చేస్తూ షిప్పువైపు సాగిపోవడం సుందరరాజన్ చూశాడు.

ఇక ఆఖరిబోట్ ఆగింది. చివరిగా మిగిలిన వాళ్ళు ఎక్కి కూర్చున్నారు. బోటు నడిపే ఫోర్స్‌గార్డ్ అయోమయంగా చూశాడు ఇంకా ఒడ్డునే నిలబడ్డ సుందర రాజన్ వంక! నిట్టూర్చి కదలలేనట్టు అడుగులు వేస్తూ మెల్లగా బోటులో ఎక్కి కూర్చున్నాడతడు.

బోట్ కదిలింది. సుందరరాజన్ తప్ప చివరిగా అందరూ ఆ అజ్ఞాతదీవికి వీడ్కోలు చెప్పారు....

సూర్యుడు మరో బెత్తెడు పైకి వచ్చేసరికి షిప్పు తిరిగి తన గమ్యంవైపు కదిలింది—

# 11

కాలకృత్యాలు తీర్చుకొన్న ప్రయాణీకులు కొందరు షిప్ డెక్ మీదికి చేరసాగారు.

అప్పటికి షిప్పు బయలుదేరి గంటపైనే గడిచింది! పైకి వున్న విశాలమైన భవనం నీడ డెక్ పొడవునా పడ డంతో మరో రెండు గంటలవరకూ ప్రయాణీకుల కక్కడ సముద్రపు నీరు అలలు చూడడానికి అవకాశం వుంటుంది.

వృద్ధులు కుర్చీలు, టేబుళ్ళు వేయించుకొని కూర్చు న్నారు. కొందరు మెట్లదగ్గర కూర్చున్నారు. మిగిలినవారు డెక్ అంచుమీద ఇనుప గొట్టాలమీద చేతులు వేసి మాట్లాడుకోసాగారు మెల్లగా. దాదాపు అందరి చేతు ల్లోనూ బీరు నింపబడిన లావాటి గాజుగ్లాసులున్నాయి.

చేతిలో విస్కీతో అనుకొని డెక్ గోడదగ్గర విచా రంగా నిలబడి బీరు సిప్ చేస్తున్నాడు సుందరరాజన్ ఒంటరిగా.

తర్వాత అతడి ప్రక్కకు చేతుల్లో గ్లాసులతో ముగ్గురు వ్యక్తులు చేరారు. వారిలో ఇద్దరు, దీవిలో అతడు ఖైదు నుండి విడిపించిన తెల్లజాతీయులు. మిగిలిన వ్యక్తి పాత ప్రయాణీకుడే!

"ప్రస్తుతం తెల్లజాతీయుల వేషధారణ, ఆకృతి పూర్తిగా మారిపోయింది. మంచి డ్రస్సుల్లో హుందాగా వున్నారు. శుభ్రంగా షేవింగ్, కటింగ్ చేయించుకొని నిగనిగలాడే నల్లటి బూట్లలో కళ్ళల్లో కాంతులతో మెరిసిపోతున్నారు.

తమ ఆనందాన్ని సుందరరాజన్‌తో కూడా పంచు కోవాలని వుంది వాళ్ళకు!

"మిస్టర్ రాజన్ !ఏమిటి ఈ శుభసమయంలో అదోలా వున్నారు? కమాన్ ఎంజాయ్ విత్ మి" ఉత్సాహపర్చ డానికి ప్రయత్నించారు.

సుందరరాజన్ వాళ్ళను విష్ చేసి ఊరుకున్నాడు. ఒక తెల్లజాతీయుడు గ్లాసులో ద్రవం సిప్ చేస్తూ అడి గాడు "ఎనీ ప్రోబ్లమ్?"

"నో....నో ప్రాబ్లం!" సన్నగా గొణిగాడు సుందర రాజన్ ఏం చెప్పాలో తెలీక.

గాలి మెల్లగా వాళ్ళను తాకి వెళ్ళిపోతోంది. మిగతా ప్రయాణీకుల నవ్వులు ఆగి ఆగి వినిపిస్తున్నాయి...."ఒక వేళ! యేదో బాగ్ కోసం వెతికారుగా చాలాసేపు, దానికోసమా?" అడిగాడు తెల్లజాతీయుడు రెండుక్షణా లాగి గుర్తు వచ్చినట్టు.

తన బాధంతా దానికోసమే కావడంతో సుందర రాజన్ నిట్టూర్చి మౌనంగా వుండిపోయాడు.

అప్పటివరకూ వాళ్ళ సంభాషణకు శ్రోతగా మాత్రమే వున్న, తెల్లటిబట్టలు ధరించిన నాలుగో వ్యక్తి గొంతు విప్పాడు. "బాగ్గా!" అని కొద్దిసేపు ఆగి "అక్కడున్న ఒక కర్రపడవ క్రింద చూశాను నేను దాన్ని! పడవ అడుగున ఇసుకలో కూరుకుపోయి వుంది. లెదర్ బాగ్!" చెప్పాడు.

త్రుళ్ళిపడ్డాడు సుందరరాజన్!! కళ్ళు గిర్రున ఆ మాటలు చెప్పిన వ్యక్తివైపు తిప్పాడు అప్రయత్నంగా అతని చెయ్యి వణికి గ్లాసులోని ద్రవం కొద్దిగా నేల మీదికి తొణికింది.

"మేక్సో మిష్టర్ మేక్సో...!" అప్పటికే ఆ వ్యక్తిని యెవరో తొందరగా పిలవడంతో "ఎక్స్క్యూజ్ మీ" అంటూ నిష్క్రమించాడతడు అక్కడినుండి.

ఆ వ్యక్తిని యేదో అడగాలని నోరు తెరిచిన సుందర రాజన్ అతడు అక్కడనుండి కదలడంతో మిన్నకుండిపోయాడు! సుందరరాజన్ పూర్తి అన్యమనస్కంగా వున్నాడని గ్రహించి, అతడిని కాసేపు ఒంటరిగా వదిలే ఉద్దేశ్యంతో అక్కడి నుండి దూరంగా నడిచారు తెల్లజాతీయులిద్దరూ.

తేరుకొన్న సుందరరాజన్ తన బుద్ధిహీనతని తనే

నిందించుకున్నాడు. పడవవద్ద చూడకుండా బాగ్ కోసం దీవంతా అక్షానిలా వెదికినందుకు. ఇంతలో అతడి కళ్ళు మెరిశాయి యేదో గుర్తొచ్చి.

అక్షాతదీవినుండి కేవలం యాభై మైళ్ళ దూరంలో వాళ్ళ 'హోచిమిన్' సిటీకి చెందిన షిప్ యార్డు తగులు తుందని షిప్పులో వాళ్ళు మాట్లాడుకుంటూంటే గంట క్రితమే విన్నాడతడు! అప్పుడది పెద్దగా పట్టించుకోలేదు. ప్రస్తుతం ఆ సమాచారం తనకు ఖచ్చితంగా వుపయోగ పడుతుందని తెలుస్తూందతనికి!

అతడి ఆలోచనలు పరిగెడుతున్నాయి. యాభై మైళ్ళు చీకటిపడేసరికి చేసుకోవచ్చు తేలిగ్గా. కొంచెం కష్టపడితే పడవను పూర్తిగా సిద్ధం చేసుకోవచ్చు. షిప్ యార్డు చేరుకుంటే చాలు. ఆపై సిటీకి యేదోలా చేరవచ్చు!

పికన్లు గముస్తున్నాయి....ఇదే ఆఖరి అవకాశం అను కొన్నాడు. అతని నిర్ణయం బలపడింది!

కాసేపాగి సగం తాగిన గాజుగ్లాసును వంగి క్రింద పెట్టాడు జాగ్రత్తగా. లావాటి ఇనుపగొట్టాన్ని పట్టుకుని క్రిందికి చూశాడు. సూర్యకాంతి పడిన సన్నటి అలలను కోస్తూ షిప్పు పోతూంది. బాగా యెత్తుగానే వుంది షిప్పు! కానీ డబ్బు ముందు అదంత పెద్ద లెక్కలోది కాదతడికి!

అటూ యిటూ చూశాడు. ఎవరి గొడవలో వాళ్ళు న్నారు. ఒంటరిగా వున్నవాళ్ళ చూపులు కూడా అతని వైపు లేవు. గట్టిగా వూపిరి వదిలాడు—గుండెల్లో మిగిలిన ఆధైర్యాన్ని శరీరం నుండి బయటికి పంపేయ డానికి.

అంతే! చటుక్కున కడిలి స్టిక్ సహాయంతో ఇనుప గొట్టాలమీదికి ఎక్కి కూర్చున్నాడు. నిజం చెప్పాలంటే అతనికి పెద్దగా భయం వేయడంలేదు! అప్పటికే ఇద్దరు ముగ్గురు అతని చర్య గమనించి కేకలు వేయసాగారు. అందరి దృష్టి అటు తిరిగేలోపు అతడు తన హేండ్ స్టిక్ వెనక్కి డెక్ మీదికి జార్చేసి తను ముందుకు ఉరికేశాడు!!

క్షణాల్లో అందరూ గోలగా కేకలు పెడుతూ డెక్ మీదికి చేరుకొన్నారు. క్షేమంగా నీటిలో పడిన సుందరరాజన్ పైకి తిరిగిచూడకుండా జనం కేకలు వింటూ వేగంగా ఈదసాగాడు నీళ్ళల్లో....

షిప్‌లో వాళ్ళందరికీ తెలిసిపోయిందా వార్త! దాదాపు అందరూ డెక్ మీదికి చేరి చాలా దూరంలో నలకలా కనిపిస్తూన్న సుందరరాజన్‌ను ఆశ్చర్యంగా తెల్లబోయి చూస్తూ, ఎవరికి తోచింది వాళ్ళు వ్యాఖ్యానించసాగారు.

ఇందాకటి ఇద్దరు తెల్లజాతీయులు, తెల్లబట్టలు ధరించిన్న వ్యక్తీ ఓ మూలకి చేరారు. "బహుశా ఆ లెదర్ బాగ్ కోసమే వెళ్ళుంటాడని నాకు గట్టి అనుమానం—మొదటినుండీ దాని కోసమేగా కలవరిస్తున్నాడు!" అన్నాడో తెల్లజాతీయుడు.

దానిని రెండో వ్యక్తి అంగీకరిస్తున్నట్టు తల వూపి "అవును! అదే అయివుంటుంది. సమయానికి మేక్సో కూడా ఆ బాగ్ యెక్కడ కనిపించిందో జాడ చెప్పాడుగా. ఏదో విలువయినదే వుంటుందా బాగ్‌లో?!" అన్నాడు సాలోచనగా.

అది విని తెల్లబట్ట వేసుకొన్న మేక్సో నివ్వెరపోతూ

చెప్పాడు.

"అరె! ఆ బాగ్ కోసమా అతడు క్రిందికి దూకి వెళ్ళింది! అది ఇంకా అక్కడే ఉంటుంది.... దానిని చూసిన తర్వాత, తెల్లవారుజామునే దానిని ఫోర్స్ గార్డు ద్వారా మన కెప్టెన్‌కు అందజేయించానుగా! దాని యజమాని యెవరో తెలిసేవరకూ అది తనవద్దే భద్రపరుస్తానని కెప్టెన్ చెప్పాడు!"

* * *

సరిగ్గా యీ సంఘటన జరిగిన నాలుగు రోజుల తర్వాత—

దాదాపు ఇండియాలోని అన్ని దినపత్రికలలోనూ మొదటి పేజీలో ఒక బాక్స్ కట్టబడిన వార్త పడింది....

## దొరికిన లెదర్ బాగ్!!

మనీలా, అక్టోబరు 14: మనీలా నుండి ఇండియాకు వచ్చే విమానంలో ఈ నెల పదవ తేదీన ఇండియాలోని విదేశీ బాంకులకు రావలసిన 35 లక్షల ఇండియన్ కరెన్సీ దోపిడీ జరిగిన ఉదంతం పాఠకులకు విదితమే!

చిత్రంగా ఆ మర్నాడు అంటే 11 వ తారీఖు సాయంత్రం ఒక అజ్ఞాతదీవిని దర్శించడానికి వెళ్ళిన ఓడ ప్రయాణీకుల్లో ఒక వ్యక్తి 35 లక్షలున్న లెదర్ బాగ్ అక్కడ చూడడం, దానిని షిప్ కెప్టెన్‌కు అప్పగించడం జరిగింది! వెంటనే కెప్టెన్ ఎఫ్. ఓ. పార్డర్స్ దానిని భద్రపరిచారు.

దానికారకే సుందరరాజన్ అనే ఇండియాకు చెందిన పాత నేరస్తుడు నీటిలో దూకాడని తెలియడంతో, అనుమానంతో బాగ్ తెరిపించిన కెప్టెన్‌కు అసలు సంగతి బోధపడింది.

విమానంలో దోపిడీ చేసినవారిలో సుందర రాజన్ కూడా ఒకడనటానికి చాలావరకూ ఆధారాలు లభించాయి. 85 లక్షలున్న లెదర్ బాగ్ భారతప్రభుత్వానికి క్షేమంగా అందజేయబడింది. ఈ కేసుపై పరిశోధన ఇంకా జరుగుతూంది....

— అయిపోయింది —

# రెడ్ బాక్స్

## సుంకరి రాంప్రసాద్

"వీల్లేదు!

ఎట్టి పరిస్థితులలోనూ ఆ రెడ్ బాక్స్ ఇంగ్లండు చేరటానికి వీల్లేదు! పట్టలేని ఆవేశంతో గట్టిగా అరిచాడు శివాజీపాటిల్.

అతనివంకే చూస్తున్నారు చౌహాన్, పండిట్. సూది పడితే ఖంగుమని మ్రోగేటంత నిశ్శబ్దం రాజ్యమేలుతున్న ఆ చిన్నగదిలో ఒక్క శివాజీపాటిల్ గొంతు మాత్రం కంచులా ఖంగుమని మ్రోగుతూంది.

"తమ సంస్థానాలను నిలబెట్టుకోవడానికి, తమ జాగీర్లను ఖరారు చేసుకోవడానికి, మ్లేచ్ఛుల ఉచ్ఛిష్టం తినే ఈ తుచ్ఛులు ఈ నవాబులూ....

ధైర్యం విడచి, శౌర్యం మరచి గాజులు ధరించిన ఈ రాజులూ....

తరతరాలుగా, తమ వంశ ప్రతిష్టలకు ప్రతీకలుగా తమ ఖజానాల్లో భద్రపరచబడ్డ వజ్రవైఢూర్యాలను,

మణి, రత్నహారాలను.... ఈ తెల్లదొరలకు కానుకలుగా సమర్పిస్తారా? వాటిని మూటలుకట్టి ఆ దొరలు తమదేశానికి పట్టుకుపోతారా?

ఎవడబ్బ సొమ్మని?

ఎవడబ్బ సొమ్మని వీరు దానాదత్తం చేస్తారు? వారు దోచుకుపోతారు?

ఇది మన ఆస్తి! మనదేశ సంపద! శతాబ్దాలుగా భరతమాత గళసీమను అలంకరించిన అపూర్వ ఆభరణాలు అవి!

వాటిని దోచుకుపోవడానికి యెవడికైనా యెన్ని గుండెలు?" — ఆవేశంతో ప్రళయాగ్నిలా ప్రజ్వరిల్లిపోతున్నాడు పాటిల్.

"కాని, 'ఎలిజబెత్' కార్గో షిప్‌లో అంత కట్టుదిట్టమైన కాపలాతో తీసుకుపోబడుతున్న ఆ పెట్టెను చేజిక్కించుకోవడం యెలా?" ఆత్రంగా ప్రశ్నించాడు చౌహాన్.

"అవును! ఎలా?" అడిగాడు పండిట్.

వారిద్దరివంకా సాలోచనగా చూసి చిన్నగా తల పంకించి "ఇలా" అంటూ లోగొంతుతో ఒక అద్భుతమయిన ప్లాన్‌ను వివరించసాగాడు శివాజీపాటిల్.

వారు "క్రాంతి" విప్లవ సంఘసభ్యులు. దేశమాత దాశ్య శృంఖలాల విచ్ఛేదనకై అహర్నిశలూ శ్రమిస్తున్న ఎన్నో అజ్ఞాత విప్లవ సంఘాల్లో వారిదీ ఒకటి. తిలక్ ఉద్బోధించిన అతివాదంకన్నా గాంధీజీ అనుసరిస్తున్న మితవాదం కన్నా, బోస్, భగవత్‌సింగ్‌లు యెన్నుకున్న ఉగ్రవాదమే స్వాతంత్ర్య సముపార్జనకు ఉత్తమ మార్గమని నమ్మిన విప్లవకారులు వారు.

కోట్ల రూపాయల విలువ చేసే ఆ సంపదను చేజిక్కించుకోగల్గితే, దాని సాయంతో జర్మనీ నుండి ఆయుధాలను కొనుగోలు చేసి, పెద్ద విప్లవ సేనను తయారు చేయాలని వారి ఆశ.

ఆ ఆశయం కోసమే ప్రాణాలను పణంగా పెట్టి మరీ, ఆ సాహసకార్యానికి సిద్ధపడుతున్నారు వారు.

## 2

నల్లని అరేబియా సముద్రజలాలపై రాయంచలా సాగిపోతూంది ఎలిజబెత్ నౌక.

ఆకాశంలో అక్కడక్కడ మిణుకు మిణుకుమంటున్న చుక్కలు అనంతమైన చీకటిధాటికి చిన్నబోతున్నాయి. దూరంగా కడలి కొలనులో జలక్రీడలాడుతున్న మత్తగజాల గుంపులా కన్పిస్తున్నాయి లతుదీవులు.

ఇంజన్ రూమ్‌లోని గ్లాస్ ఫ్రేంలో బిగింపబడిన ప్రపంచపటాన్ని చూస్తూ ఆలోచిస్తున్నాడు కెప్టెన్ ఆర్లీ. ఆ పటంలో వివిధ దేశాల మధ్య సాగే సముద్ర మార్గాలు, వాటి దూరాలతో సహా ముద్రింపబడివున్నాయి.

బొంబాయి నుండి ఆఫ్రికా దక్షిణ అగ్రమైన కేప్‌టౌన్‌కు 4604 మైళ్ళు. కేప్‌టౌన్ నుండి లండన్‌కు 6117 మైళ్ళు. వెరసి మొత్తం 10721 మైళ్ళు ప్రయాణించాల్సి వుంటుంది.

బొంబాయి నుండి కేప్‌టౌన్ వరకూ అరేబియా, హిందూ మహాసముద్రాలపైనా, కేప్‌టౌన్ నుండి లండన్ వరకూ అట్లాంటిక్ మహాసముద్రంపైనా....అలా మూడు సముద్రాలగుండా సాగుతుంది ఆ ప్రయాణం.

ఆ సముద్రాల ప్రవాహదిశలు, అంతర్వాహినుల స్థితి గతులనుబట్టి ఒక్కో సముద్రంపై ఎన్ని నాటికల్స్ వేగంతో (సముద్రయానంలో వేగాన్ని నాటికల్స్‌గా గణిస్తారు.) ప్రయాణం చేయవచ్చో అంచనా వేస్తున్నాడు అతడు.

అంతలో ఒక సెయిలర్ పరుగెత్తుకుంటూ ఆ గదిలోకి వచ్చాడు.

"సర్! ఓసారి అటు చూడండి!" అతని గొంతులో ఆందోళన!

ఆ సెయిలర్ చూపించిన దిశవంక చూసిన కెప్టెన్ వులిక్కిపడ్డాడు. "మైగాడ్!" అన్నాడతడు. అప్రయత్నంగా. ఇంజన్ రూమ్‌లోని సెయిలర్స్ అంతా ఆ వంకే చూస్తున్నారు. అక్కడ....సముద్రం మధ్య చీకటిని చీలుస్తూ ఎర్రని మంటలు నాలికలు చాస్తూ నింగిని అందుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి.

'ఏదో నౌక తగలబడిపోతూంది!" అనుకున్నారు వారంతా ఆందోళనగా.

నౌక వేగాన్ని తగ్గించమని ఇంజన్ కంట్రోలర్స్‌కు చెప్పి, ఆ గదిలోనుండి పరుగులాంటి నడకతో డెక్‌పైకి చేరుకున్నాడు కెప్టెన్ ఆట్లీ. అతనితోపాటు ఆ రూమ్ లోని మరికొద్ది సెయిలర్స్ కూడా.

త్రాటి నిచ్చెన ద్వారా బ్రిడ్జిపైకి చేరుకున్నారు. (షిప్‌లో పొడుగ్గా పిల్లర్‌లా వుండేదానిని బ్రిడ్జి అని వ్యవహరిస్తారు.) బ్రిడ్జిపై నున్న ఒక సెయిలర్ బైనాక్యులర్‌ను కెప్టెన్‌కు అందించాడు. వాటిద్వారా ఆ మంటలవంక చూశాడతడు.

'వారి అనుమానం నిజమే! ఆ తగలబడుతున్నది

నిజంగా ఒక నౌకే!'

మంటలు విరజిమ్ముతున్న ఆ నౌక డెక్ పై హడావుడిగా పరుగెత్తుతున్నారు కొందరు వ్యక్తులు. బైనాక్యులర్ గుండా చూస్తున్న కెప్టెన్ కు వారు ధరించిన తెల్లని నేవల్ దుస్తులు, తమ నౌక వంకే చూస్తూ, సహాయం కోరుతూ, వారు ఊపుతున్న తెల్లని జండాలూ స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్నాయి.

అతడు అలా చూస్తూనే ఆలోచించసాగాడు.

అంతర్జాతీయ సముద్రయాన నిబంధనల ప్రకారం ప్రమాదంలో వున్న ఏదైనా ఓడ సముద్రమధ్యంలో తారసిల్లినప్పుడు విధిగా దానిని, అందలి ప్రయాణీకులను రక్షించడానికి ప్రయత్నించాలి.

కాని, ఏ అన్యవిషయాలలోనూ తలదూర్చకుండా సూటిగా లండన్ వరకూ ప్రయాణం కొనసాగించమని తనకు తన పైఅధికారు లిచ్చిన ఉత్తరువు.

ఏం చేయాలి?

ఏదీ నిర్ణయించుకోలేక అతని మనసు ఊగిసలాడుతున్న క్షణంలో అతని కంటపడింది దగ్ధమౌతున్న ఆ నౌక తెరచాప స్తంభంపై రెపరెపలాడుతున్న జండా! దానిని చూస్తూనే ఉలిక్కిపడ్డా డతడు.

అది బ్రిటిష్ జాతీయ పతాకం!

ఆపదలో నున్నది తమ దేశపు నౌకని అర్థమయ్యాక, యిక తాత్సారం చేయలేదతను. తత్క్షణం దగ్ధమౌతున్న ఆ నౌక దిశగా తమ ఓడను నడపమని ఆజ్ఞలు జారీ చేసాడు. మరికొద్ది నిముషాలలో షార్ప్ గా టర్న్ అయి, శరవేగంగా ఆ మంటలవైపు దూసుకుపోసాగింది షిప్ ఎలిజబెత్!

అయితే ఆ నిర్ణయం ఎంత ప్రమాదకరమైనదో అతనికి తెలియదు! తెలిసివుంటే ఎట్టి పరిస్థితులలోనూ తమ ఓడను ఆ దిక్కుగా నడపమని ఆజ్ఞాపించేవాడు కాదు!

# 3

మంటల్లో చిక్కుకున్న తమ నౌకవంకే చూసుకుంటున్న 'ఎలిజబెత్' వంక ఆనందంగా చూస్తున్నారు చౌహాన్, పండిట్.

కొద్ది క్షణాల్లో తమ ప్లాన్ సక్సెస్ కాబోతూందన్న ఎగ్జయిట్ మెంట్ వారిని వివశుల్ని చేస్తూంది. వారికి ఆ ముందురోజు రాత్రి శివాజీ పాటిల్ వివరించిన ప్లాన్ గుర్తుకు వచ్చింది—

"చాలా కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేయబడ్డాయి ఆ పెట్టెకు. ఆ పెట్టెను ఓడలో చేర్చేముందు గాని, చేరిన తరువాత గాని ఆ పెట్టెను మామూలు పద్ధతుల్లో చేజిక్కించుకోవడం అసాధ్యమనే చెప్పాలి.

ఆ పెట్టెను పొందాలంటే ...

ఓడలోని మొత్తం సిబ్బంది యొక్క ఎటెన్షన్ను మరోవైపు డైవర్టు చేయగలగాలి. ఆ తరువాత కూడా ఆ షిప్ కెప్టెన్ను లొంగదీసుకోగలగాలి. ముందే చెప్పానుగా ఆ సౌండ్ కోడ్ గురించీ, ఆ డెన్ తాళం చెవి గురించీనూ!"

"ఇవన్నీ నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగారు వారిద్దరూ.

చిన్నగా నవ్వాడు పాటిల్.

"ఎలిజబెత్లో పని చేస్తున్న ఒక కళాసీ మన 'క్రాంతి' సంఘ సభ్యుడు."

క్రాంతి విప్లవ సంఘానికి వారు ముగ్గురూ మూల

స్తంభాల్లాంటి వారైనా, ఓ రకంగా పాటిల్ వారికి సాయకుడులాంటివాడు. తమ సంఘ సభ్యుల గురించి వారికికూడా తెలియని ఎన్నో రహస్య విషయాలు ఒక్క పాటిల్ కు మాత్రం తెలుసు.

వారు ఆశ్చర్యంతో తెల్లబోయారు. పాటిల్ మాత్రం నిర్వికారంగా చెప్పుకుపోతున్నాడు.

"ఇక వున్నది ఒకటే మార్గం! ఎలిజబెత్ ను ముక్కలు చేయాలి! అలా చేయగల్గితే.... ముక్కలై మరికొద్ది సేపట్లో మునిగిపోబోతున్న ఎలిజబెత్ ను వీడి ప్రాణాలను రక్షించుకోవడానికి ప్రయత్నిస్తారు ఆ ఓడలోని సిబ్బంది. అదే సమయంలో సెయిలర్స్ దుస్తులు ధరించిన మనం ఆ శిథిలమైన ఓడలోనికి ప్రవేశించి ఆ పెట్టెను చేజిక్కించుకోవాలి!

"అయితే యిక్కడ సమస్య.... ఆ షిప్ ను ఎలా బ్లాస్టు చేయాలన్నది! నౌకలను ధ్వంసంచేసే టార్పెడోలు మన దగ్గరలేవు. నిజమే! కాని ఏ టార్పెడోలు వినియోగించకుండానే ఎలిజబెత్ దానంతట అదే ముక్కలయ్యే ఉపాయం ఒక్కటే వుంది.

"ఆ ప్లాన్ సక్సెస్ కావాలంటే మనం అర్జెంటుగా ఒక నౌకను సంపాదించాలి. సామానులను చేరవేసే చిన్న నౌకైనా ఫర్వాలేదు!

"నేను దానికీ ఒక ఉపాయంఆలోచించిపెట్టాను. ఈ రోజు రాత్రే బొంబాయి రేవునుండి లక్షదీవులకు బయలుదేరి వెళ్తుంది సరకులను తీసుకుపోయే చిన్న నౌక. లక్షదీవులలోని బ్రిటిష్ పటాలానికి రేషన్ తీసుకుపోతున్నది ఆ నౌక.

"అందులో పెద్ద సిబ్బందేమీ వుండదు. ఇంజన్

రూమ్‌లో నుంచే ఇద్దరో, ముగ్గురో సెయిలర్స్ గాక సెక్యూరిటీ కోసం మరో ఇద్దరు సైనికులు. అంతే! వారిని ఏమార్చి ఆ నౌకను స్వాధీనం చేసుకోవడం పెద్ద కష్టమేమీ కాదనుకొంటాను."

ఇంతలో చౌహాన్ మోచేత్తో మెల్లగా పొడవటంతో పండిట్ ఆలోచనలకు బ్రేక్ పడింది.

"ఏం పండిట్! ఈ పడవను ఎలా సంపాదించామో గుర్తుకు తెచ్చుకుంటున్నావా?" చిన్నగా నవ్వుతూ అన్నాడు చౌహాన్.

అవునన్నట్లు తలాడించి మళ్ళీ గతంలోకి జారుకున్నాడు పండిట్ —

ఆ రోజు రాత్రి....

బొంబాయి రేవు నుండి యింకొద్ది నిముషాలలో ఆ సరకుల నౌక బయలుదేరబోతున్నదనగా, ఆ పడవ సరంగును కలిసాడొక వృద్ధుడు.

చిన్న వెండి రూపాయల సంచిని ఆ సరంగు చేతిలో పెట్టి 'తమను లక్షదీవుల వరకూ తీసుకు వెళ్ళమని' బ్రతిమాల సాగాడు. ఒక్కసారి మిగిలిన సిబ్బందివంక సాలోచనగా చూసి సరేనన్నాడు ఆ సరంగు.

అయితే వారు అంత త్వరగా అంగీకరించడానికి కారణం ఆ వృద్ధుడిచ్చిన రూపాయల సంచి కాదు. ఆ వృద్ధుని వెనుక తలపైకి ముసుగును లాక్కొని నిలుచున్న యువతి. ఆమెను చూసి అంగీకరించారు వారు.

అప్పటికే వారి మనసుల్లో ఒక పథకం రూపుదిద్దుకుంది. 'ఆ వృద్ధుడిని ఏ సారా మత్తులోనో ముంచేస్తే.... హాయిగా ఆ పిల్లను పంచుకోవచ్చు. ఆ పిల్ల ఔనన్నా, కాదన్నా, ఎదురుతిరిగినా సముద్ర మధ్యంలో ఆమె

చేయగల్గింది ఏముంది? తమ కౌగిళ్ళలో కరిగిపోవడం తప్ప!

'చల్లని సముద్రపుగాలిలో రమ్ బిగించాక, ప్రక్కలో పసందైన పిల్ల. వాహ్! ఏం రంజుగా వుంటుంది ఈసారి ప్రయాణం!'

వారు లొట్టలు వేసుకుంటూ ఆ యువతి వంక చూస్తున్నారు. తల వంచుకునే మెల్లగా ఆ పడవలోనికి ఎక్కింది ఆమె. ఓ మూల సామాన్ల ప్రక్కగా ఒదిగి కూర్చున్నారు ఆ వృద్ధుడూ ఆమె.

బద్దకంగా కూత వేస్తూ ముందుకు కదిలింది ఆ నౌక. మేలి ముసుగును సవరించుకుంటూ నీలి సముద్రపు టలల వంక అబ్బురంగా చూస్తూందామె.

పచ్చగా కన్పిస్తున్న ఆమె కాలిపిక్కలూ, ఎత్తయిన జఘనాన్ని బట్టి, మేలిముసుగుమాటున దాక్కున్న ఆమె మిగిలిన అందాలను అంచనా వేస్తున్నారు ఆ నౌకలోని సిబ్బందులు.

తమ ఎదురుగా కూర్చున్న వారితో .... "ఈ మధ్యే పెళ్ళయింది బాబూ అమ్మాయికి. అల్లుడు లక్షదీవుల్లో తోటల్లో కూలీ. అమ్మాయిని కొత్త కాపురానికి తీసుకు వెళ్తున్నాను" అన్నాడు ఆ వృద్ధుడు.

చిన్నగా నవ్వుతూ సిగ్గుతో, మొగ్గలా మరింత ముడుచుకుపోయింది ఆ యువతి.

సంధించి విడిచిన శరంలా నీటిపై రివ్వున దూసుకు పోతూంది ఆ నౌక. ఇంకాస్సేపట్లో ఆ పిల్ల పొందులో పొందబోయే సుఖాన్ని తలచుకుంటూ మరింత హుషారుగా పడవను నడుపుతున్నాడు సరంగు.

కాసేపు వృద్ధునితో కబుర్లు చెప్పాక, రమ్ సీసాలను

పైకి తీసారు వారు. ఒక పెద్ద గ్లాసు నిండా రమ్మును పోసి ఆ వృద్ధునికి అందించారు.

గ్లాసును పెదవుల దగ్గర పెట్టుకోబోతూ ఆ యువతి వంక సాలోచనగా చూసాడు ఆ వృద్ధుడు. వారికి అధోముఖంగా తిరిగి, కందువాను చాటుచేసుకొని త్రాగు తున్నట్లు నటిస్తూ, తెలివిగా ఆ మద్యాన్ని సముద్రం లోనికి ఒలకబోసాడు. అప్పటికే వారు ఒక్కొక్కరు రెండు, మూడు గ్లాసులు ఖాళీ చేసారు.

రమ్ గొంతు దిగేసరికి, మెల్లగా వారి శరీరాలు వేడెక్కసాగాయి. రగులుకొన్న కోరికతో వారి కళ్ళు ఎర్రబడ్డాయి. చిన్నగా త్రూలుతూ, సన్నగా ప్రేలుతూ, వెకిలి నవ్వులు నవ్వుతూ, ఆమెవంక ఆకలిగా చూడ సాగారు వారు. పరిస్థితి చేయిదాటబోతున్నదని గ్రహిం చాడు ఆ వృద్ధుడు.

ఆమె వంక చూసి కన్ను గీటుతూ "అమ్మాయీ! బాలుగార్లకు తలా కాస్త మిఠాయి పంచరాదూ!" అన్నాడు కాలి దగ్గరున్న వెదురుబుట్టను ఆమెవైపు తోస్తూ.

ఆమె మూతను తెరచి దోసెడు దూద్ పేడాలను పైకి తీసింది. మెల్లగా లేచి, అడుగులు వేస్తూ తలా ఒక దూద్ పేడాను వారికి అందించింది. వయ్యారంగా నడుస్తూ, సిగ్గుతో వగలుపోతూ, చేతివ్రేళ్ళ కొసలను సుతారంగా తాకిస్తూ ఆమె అందించిన మిఠాయిలను ఆనందంగా నోట పెట్టుకున్నారు వారంతా.

అంతే! మరో రెండు నిముషాల్లో మైకం వచ్చినట్లు తూగుతూ, స్పృహతప్పి దబ్బున క్రిందకు పడిపోయారు' మరుక్షణం ఒక్క గెంతులో ఇంజన్ రూమ్‌లోకి ప్రవేశించి'

మొద్దులా తెలివితప్పి పడివున్న సరంగును ప్రక్కకు లాగి, అతని స్థానాన్ని ఆక్రమించాడు ఆ వృద్ధుడు.

మేలిముసుగును విసరేసి, వంటిపై నున్న లంగానూ, చోళీని చక చకా విప్పటం ప్రారంభించింది ఆ యువతి. అంతవరకూ మరో పెద్ద వెదురుబుట్టలో ముడుచుకు కూర్చున్న పండిట్ మెల్లగా పైకి లేచాడు. అతని తలపై నుండి జల జలా క్రిందకు రాలాయి ఆ బుట్టలోని సీమ రేగుపళ్ళు.

"అయ్యో! గుడ్డలన్నీ విప్పేయకు చౌహాన్! నీ నగ్న సౌందర్యాన్ని చూడలేక ఈసారి నేను మూర్ఛపోవాలి!" అల్లరిగా నవ్వుతూ అన్నాడు పండిట్.

తలకు పెట్టుకున్న విగ్గును ఊడదీస్తున్న చౌహాన్ చిన్నగా నవ్వాడు.

అప్పటికే పెట్టుడు మీసాలనూ, గడ్డాలను ఊడదీసి, చొక్కాను విప్పదీస్తున్నాడు అంతవరకూ వృద్ధునిలా నటించిన శివాజీపాటిల్.

తెలివితప్పి పడివున్న సెయిలర్స్ యొక్క దుస్తులను విప్పదీసి ధరించారు ఆ ముగ్గురూ. ఆ నౌకలోని సిబ్బందినందరినీ ఒక లైఫ్‌బోటులోకి చేర్చారు.

"తెలివితప్పిన వారిని వీరులయిన హిందువులు చంపరు కాబట్టి, మిమ్మల్ని ప్రాణాలతో విడిచిపెడుతున్నాం.

గుడ్ బై జంటిల్మన్!

తెలివి వచ్చాక మీ పాట్లేవో మీరు పడండి!" అని మనసులో అనుకుంటూ ఆ లైఫ్‌బోటును సముద్రంలోకి విడచిపెట్టాడు పాటిల్.

మరికొద్ది నిముషాల్లో శివాజీ సారధ్యంలో ఆ నౌక సముద్రజలాలపై సాగుకుపోవటం ప్రారంభించింది. కొన్ని

గంటలసేపు నిర్విరామంగా ప్రయాణం సాగించాక, ఆ నౌక లక్షదీవుల సమీపానికి వచ్చింది.

ఆయితే ఆ నౌకను లక్షదీవులవైపు నడుపలేదు శివాజీ. లక్షదీవులు మరో మూడు, నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్నాయనగా ఆ నౌకను పశ్చిమానికి త్రిప్పి, సూటిగా ముందుకు పోనిచ్చి, లక్షదీవులను దాటాక, మళ్ళీ అర్ధచంద్రాకారంలో మలుపు త్రిప్పి తూర్పు దిక్కుగా పోనిచ్చాడు.

అరేబియా సముద్రంలో నున్న అందోత్ దీవి గురించి చాలా కొద్దిమందికి తెలుసు. లక్షదీవులకు, మినీకాయ్ దీవులకు మధ్య, కేరళలోని పాల్ఘాట్ పట్టణానికి సరిగ్గా పశ్చిమదిశలో సుమారు 250 కిలోమీటర్ల దూరంలో వుంది ఆ చిన్నదీవి. ఆర్థికంగా గాని, నాగరికంగా గాని యేమాత్రం కూడా అభివృద్ధికి నోచుకోని దీవి అది.

ఆ దీవిని గూర్చి విన్న నావికులెవరూ తమ నౌకలను ఆ దీవి ఛాయలకు కూడా పోనివ్వడానికి సాహసించరు. అలాంటి అందోత్ దీవివైపు సూటిగా తమ నౌకను పోనిచ్చాడు శివాజీ.

# 4

స్పీడోమీటర్‌ను చూస్తోన్న ఇంజన్ కంట్రోలర్ వులిక్కిపడ్డాడు.

తాను ఫిక్స్ చేసిన వేగంకన్నా యెక్కువ వేగాన్ని చూపిస్తోందది. ఆశ్చర్యంగా అద్దాలగుండా బయటకు చూశాడు. అనూహ్యమైన వేగంతో దూసుకుపోతూంది తమ నౌక ఎలిజబెత్.

తను పెంచకుండానే ఒక్కసారిగా అంత వేగం ఎలా పెరిగిందో అర్థంగాక తెల్లబోయాడతడు. స్పీడోమీటర్లో

ప్రమాదస్థాయిని సూచించే రెడ్ డాట్ పైన అసహజంగా కనిపిస్తూంది వేగాన్ని సూచించే సూచిక.

ఛటుక్కున లీవర్‌ను వెనక్కు తిప్పి, వేగాన్ని తగ్గించ డానికి ప్రయత్నించాడతడు.

కాని, ఆశ్చర్యం!

వేగం ఏ మాత్రం తగ్గలేదు. అతడు మరోసారి ప్రయ త్నించాడు. ఇంజన్ ఆపేశాడు. కాని, ఫలితం లేక పోయింది.

మరోసారి....మరోసారి....

అలా అయిదారుసార్లు ప్రయత్నించాక అర్థం అయి పోయింది అతనికి, నౌకను అదుపుచేయటం తన చేయి దాటిపోయిందని!

కాని, ఆ పరిస్థితి ఎలా సంభవించిందో అర్థంకాలేదు అతనికి. టెన్షన్‌తో అతని నుదుట చెమటలు పట్టాయి. నిస్సహాయంగా బయటకు చూశాడతడు.

మంటల్లో చిక్కుకున్న నౌకను దాదాపుగా సమీపిం చింది ఎలిజబెత్. మంటల్లో చిక్కుకున్నది ఓడ కాదు పెద్ద సైజు పడవ.

ఆ పడవ వెనుక, ఆ మంటల వెలుగులో స్పష్టా స్పష్టంగా వల్లని జీబూతంలా కన్పిస్తున్న ఎత్తయిన ప్రదేశంవంక కంగారుగా చూశాడతడు. నీటిలో నుండి బయటకు పొడుచుకొనివచ్చి, వల్లగా, సున్నగా, బోలుగా మెరుస్తోన్న పెనుశిలలను చూసేసరికి భయంతో కంపించి పోయాడతడు.

తన ప్రమేయం లేకుండానే తన నౌక ఒక్కసారిగా అంత వేగాన్ని ఎందుకు పుంజుకుందో అప్పుడు అర్థం అయిందతనికి.

"మైగాడ్! అంటే....అంటే....ఆ కనిపిస్తున్నది అండ్రోత్ దీవా!" ఆ ఆలోచన తట్టిన మరుక్షణం చిగురుటాకులా వణికిపోయాడతడు. భయంతో కీచుగా అరుస్తూ డెక్ పైకి పరుగెత్తాడు.

అప్పటికే బైనాక్యులర్ ద్వారా ఆ శిలలను చూసిన కెప్టెన్ ఆల్టీ కంగారుగా బ్రిడ్జ్ నుండి క్రిందకు దిగి డెక్ పైకి వచ్చాడు.

"కెప్టెన్! ఆ ఆ....అండ్రోత్ దీవి!" వెర్రివాడిలా బొంగురు గొంతులో గట్టిగా అరుస్తూ ఆ శిలలవైపు చూపించాడు ఇంజన్ కంట్రోలర్.

అంతే! ఎవరో ఛెర్నాకోలతో ఛెళ్లున ముఖంమీద చర్చినట్లయింది కెప్టెన్ కు. నల్లగా మాడిపోయింది అతని ముఖం.

"అంటే....అంటే ఆ కన్పిస్తున్నవి అయస్కాంత శిలలా!" గొంతులో తడి ఆరిపోతుంటే చిన్నగా గొణుక్కున్నాడతడు.

ఇనుమును ఆకర్షించడం అయస్కాంత లక్షణం! ఆ అయస్కాంత లక్షణాలను కలిగివుండే శిలలను అయిస్కాంత శిలలని పిలుస్తారు.

ఓరోలజీ (పర్వత శాస్త్రం)లో అయిస్కాంత శిలల గూర్చి యెప్పుడో విద్యార్థి దశలో చదువుకున్న విషయాలు గుర్తుకు వచ్చాయి అతనికి.

భూమి స్వయంగా ఓ పెద్ద అయిస్కాంతం. ఇనుప లోహాణువులు యెక్కువ శాతం వుండే కొన్ని అగ్నిశిలలు (Igneous Rocks) భూమియొక్క అయిస్కాంత క్షేత్ర పరిధిలో ప్రభావితమవటంచేత ఆ శిలలలో కూడా ఆ అయస్కాంత లక్షణాలు యేర్పడతాయి.

అగ్నిపర్వతాల విస్ఫోటనంలో ఉబికిన లావా ఘనీభవించటంచేత యేర్పడ్డ శిలలను అగ్నిశిలలని వ్యవహరిస్తారు. లోహామ్ల జనితములైన (Iron Oxide-$Fe_3O_4$) అట్టి అయస్కాంత శిలలు యెక్కువగా నిక్షిప్తమై వున్నది ఉత్తర స్వీడన్‌లో.

ఇనుముతో చేయబడ్డ ఓడలలాంటివి ఆ శిలల అయస్కాంత క్షేత్ర పరిధిలోకి చొరబడినపుడు, వాటిచే ఆకర్షింపబడి, ఇనుమడించిన వేగంతో వాటిని ఢీకొనడం జరుగుతుంది.

అలాంటి శిలలకు ఆలవాలం కావటంచేతే అండోత్ దీవి గూర్చి తెలిసిన నావికులెవ్వరూ ఆ దీవి దరిదాపుల చేరటానికి కూడా సాహసించరు.

"హో! ఇంకొద్ది క్షణాలలో తమ ఓడ కూడా ఆ అయస్కాంత శిలలను ఢీకొని ముక్కలు కాబోతుందా?" యిక ఆపైన ఆలోచించే శక్తిలేక అసహనంగా తల విదిల్చాడు కెప్టెన్ అట్లీ.

"హరియప్! హరియప్ ఎవ్రిబడీ! లైఫ్‌బోట్లను నీళ్ళలోకి వదలండి, వాటిలోకి దూకి మీ ప్రాణాలను రక్షించుకోండి!" గట్టిగా అరిచాడతడు.

అంతే!

ప్రాణభయంతో పిచ్చివాళ్ళలా డెక్‌పై అటూ ఇటూ పరుగులు ప్రారంభించారు ఆ షిప్‌లోని సిబ్బంది. అదుపు తప్పిన వేగంతో తమ ఓడ ఆ శిలలవైపు దూసుకుపోతున్నప్పుడే వారిలో చాలామందికి అనుమానం వచ్చింది.... ఏదో ఉపద్రవం జరుగబోతోందని.

ఇక షిప్ కెప్టెన్ యెప్పుడయితే డేంజర్ వార్నింగ్

యిచ్చాడో....ఆ క్షణమే హాహాకారాలతో ఆ ఓడ మారిహోగిపోయింది.

5

శివాజీ, చౌహాన్, పండిట్‌లు ఉత్కంఠతో యెదురు చూస్తోన్నారు. 'ఇక కొద్ది క్షణాలలో తమ ప్లాన్ ఫలించి, అమూల్యమైన ఆ సంపద తమ స్వంతం కాబో తుందన్న ఆనందం' వారిని వివశుల్ని చేస్తోంది.

చేజిక్కించుకున్న ఆ సరకుల నౌకను అండోత్ దీవి తీరానికి చేర్చి, సరిగ్గా షిప్ ఎలిజబెత్ సముద్రంలో దృగ్గోచరమైన వెంటనే, ఆ సరకుల నౌకను పెట్రోల్ పోసి ముట్టించారు వారు.

ఆ నౌక ఇనుపరేకులతో గాకుండా, చెక్కలతో చేయ బడటంచేత, ఆ అయస్కాంత శిలలవలన ప్రమాదానికి గురికాలేదు.

మంటల్లో చిక్కుకున్న తమ పడవను, దానిపై ఎగురు తున్న బ్రిటిష్ జాతీయపతాకాన్ని చూసి, తమ పడవను రక్షించడానికి ఎలిజబెత్ తమ నౌకను గ్రుడ్డిగా సమీపి స్తోందనీ, ఆ అయస్కాంత శిలల ఆకర్షణా వలయంలో చిక్కుకుంటుందనీ వారికి తెలుసు.

శివాజీపాటిల్ రచించిన అద్భుతమయిన వ్యూహం అది!

వారు చూస్తూండగానే రివ్వున దూసుకువచ్చి ఆ అయ స్కాంత శిలలను ఢీకొంది షిప్ ఎలిజబెత్. ఒక భయం కర విస్ఫోటనం! తాడి ఎత్తున లేచిన సముద్రజలాల మధ్య రగిలిన బడబాగ్నిలా ఆ శిధిల నౌకలో లేచిన మంటలు! ముక్కలు, చెక్కలుగా ఫెళ ఫెళ మంటూ విరిగిపోయింది ఆ నౌక.

ఉవ్వెత్తున లేచిన సముద్రజలాలతో పోటీపడుతూ, ఛిద్రమైన శకలాలు నింగికి ఎగిసాయి. మిన్నుముట్టిన హాహాకారాలు, ఆర్తనాదాలు ఆ సముద్రపు ఘోషలో కలిసిపోయాయి.

ఏ క్షణమయితే షిప్ ఎలిజబెత్ అయస్కాంత శిలలను ఢీకొని వ్రయ్యలయిందో ఆ మరుక్షణమే సముద్రంలోకి దూకి, వేగంగా ఈదుకుంటూ శిథిలమైన ఎలిజబెత్‌ను చేరుకున్నారు శివాజీ, చౌహాన్, పండిట్‌లు.

సముద్రంలో విడువబడ్డ లైఫ్‌బోట్లను చేరుకోవడానికి డెస్పరేట్‌గా ప్రయత్నిస్తున్నారు. అప్పటికే డెక్‌పై నుండి క్రిందకు దూకిన కొందరు సెయిలర్లు విరిగిన శకలాల మధ్య పడివున్న ఒకరిద్దరు గాయాలతో కదలలేని స్థితిలో నిస్సహాయంగా మూల్గుతున్నారు. షిప్ శిలలను ఢీకొన్న క్షణంలో ఆ అదాటుకు తృళ్ళి రాళ్ళపై పడి, తలలు బద్ద అయి ప్రాణాలనే కోల్పోయారు ఇద్దరో, ముగ్గురో సెయిలర్లు.

అత్యంత బీభత్సకరమైన దృశ్యమది!

చివరి సెయిలర్ కూడా క్రిందకు దూకేశాడని నిశ్చయించుకున్నాక, తను కూడా నీళ్ళలో దూకడానికి డెక్ చివరకు వచ్చాడు కెప్టెన్ ఆట్లీ.

షిప్ యేదైనా ప్రమాదానికి గురైనపుడు, ఆ షిప్ చివరి వ్యక్తి కూడా ఆ షిప్‌ను విడిచాక, ఆ షిప్‌ను రక్షించడం అసాధ్యమని ధృవపరచుకున్నాక మాత్రమే ఆ షిప్ కెప్టెన్ ఆ షిప్‌ను విడచిపెట్టాలి.

హి షుడ్ బి ద లాస్టు మేన్ టు గెట్ అవుట్ ఆఫ్ ద షిప్!

డెక్ రెయిలింగ్స్‌పై కాలు వేయబోతూండగా

గుర్తుకు వచ్చింది అతనికి కార్గో డెక్ లోని పెట్టె విషయం! ఒక్క క్షణంసేపు కలవరంతో కంపించిపోయాడు. అతడు అంతగా కలవరపడింది అమూల్యమైన ఆ సంపదకోసం కాదు. ఆ పెట్టెకు కాపలాగా ఆ డెక్ లో నియమింపబడ్డ గార్డ్స్ గురించి.

అతడు గిరుక్కున వెనుతిరిగి ఆ డెక్ వైపు పరుగుతీశాడు. సరిగ్గా అతడు ఆ డెక్ తలుపును సమీపించేసరికి.... ముగ్గురు సెయిలర్స్ ఆ తలుపుచుట్టూ చేరి, మోకాళ్ళపై వంగి కూర్చొని ఆ తలుపును తెరవడానికి ప్రయత్నిస్తున్నారు.

'అంత ప్రమాదకరస్థితిలో కూడా తమతోటి సెయిలర్స్ ప్రాణాలను రక్షించడానికి ప్రయత్నిస్తున్న ఆ సెయిలర్స్' ఎవరా అని వారివంక ఆశ్చర్యంగా చూస్తూ....

కోటు జేబులోనుండి ఆ తలుపుకు వేయబడ్డ తాళం చెవిని వారివైపు విసురుతూ—

"వెల్ డన్ బోయిస్! ఇదిగో దాని బీగం! దానితో ఆ తాళాన్ని తెరవండి. కమాన్ క్విక్!" అన్నాడు వారి వంక మెచ్చుకోలుగా చూస్తూ.

మెల్లగా ఆ తాళాన్ని అందుకున్నాడు వారిలో ఒకడు. అతడిని చూస్తూ ఉలిక్కిపడ్డాడు కెప్టెన్. అదే క్షణంలో మిగిలిన ఇద్దరి ముఖాలు కూడా అతని కంట పడ్డాయి. ఆశ్చర్యంతో అతని కళ్ళు పెద్దవయ్యాయి.

'వారు ముగ్గురూ తమ షిప్ ఎలిజబెత్ లోని సెయిలర్స్ కాదు. బ్రిటిష్ నేవల్ యూనిఫారమ్స్ ధరించటంవలన వారూ తమ షిప్ సెయిలర్సే' అనుకొని పొరబడ్డాడు.

వారు ధరించిన దుస్తులనుబట్టి మంటల్లో చిక్కుకున్న ఆ నౌకకు సంబంధించిన సెయిలర్స్ అనుకుందామనుకుంటే.... వారు తమ షిప్‌లోకి ఎందుకు వచ్చినట్లు? యింకొద్దిసేపట్లో నీళ్ళలో మునిగిపోయే తమ షిప్ పైకి ఆశ్రయం కోరి వచ్చే వెర్రివాళ్ళుంటారా?

వచ్చినవారు సూటిగా ఆ కార్గో డెక్ తలుపును తెరవడానికి యెందుకు ప్రయత్నిస్తున్నారు?

ఆ డెక్‌లో యేముందో వారికి తెలుసునా? అంటే ఆ పెట్టె కోసమేనా వారు వచ్చింది?'

—ఆ ఆలోచన రాగానే కఠినంగా మారిపోయింది అతని ముఖం.

“ఎవరు మీరు?” అన్నాడతడు కటువుగా.

వారు సమాధానం చెప్పలేదు. భీకరం అందుకున్న వ్యక్తి తల యొత్తకుండా తాళాన్ని తెరవడంలో మునిగిపోయాడు. మిగిలిన యిద్దరూ మాత్రం మెల్లగా లేచి నిలబడ్డారు.

“హేయ్! మిమ్మల్నే! యేం చేస్తున్నారు? ఇక్కడ మీకేం పని?”—నడుముకున్న బెల్టుకు వ్రేలాడుతున్న రివాల్వర్ పై చేయి వేస్తూ అన్నాడు కెప్టెన్.

అంతే!

ఈసారి వారివద్ద నుండి జవాబు వచ్చింది. మాటలతో కాదు! చేతలతో!

మెరుపు వేగంతో పైకి లేచి, కెప్టెన్ చేతిని తాకింది ఒక వ్యక్తి కాలు. అదే క్షణంలో అరచేతిని కత్తిలా బిగించి కెప్టెన్ కంఠంపై కొట్టాడు రెండవ వ్యక్తి. రెండడుగులు వెనక్కు తూలాడు కెప్టెన్. కరెంట్ షాక్

కొట్టినట్లు బాధతో విలవిల లాడిపోయాడు.

అయితే, అది రెండుక్షణాలు మాత్రమే!

తేప్పరిల్లిన మరుక్షణం మరో అడుగు వెనక్కి వేశాడు. చటుక్కున రివాల్వర్‌ను పైకితీసి వారికి గురి పెట్టాడు.

పిడికిళ్ళు బిగించి అతనిపైకి దూకబోతున్న ఆ యిద్దరు వ్యక్తులూ శిలావిగ్రహాల్లా నిలుచుండిపోయారు. ఊహించని ఆ పరిణామానికి వెల వెల బోయాయి వారి ముఖాలు.

# 6

"కమాన్! ఓపెన్ ద డోర్!" కఠినస్వరంతో ఆజ్ఞాపించాడు కెప్టెన్.

విరిగిన షిప్ బాడీగుండా షిప్‌లోనికి నీళ్ళు రావటం వలన, అప్పటికే మెల్ల మెల్లగా నీళ్ళలో మునిగిపోతూంది ఎలిజబెత్.

తాళం తీస్తున్న మూడవ వ్యక్తి ఓరకంటతో పరిస్థితిని గమనించాడు. అతని మెదడులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

డెన్ తలుపులు తెరిచిన మరుక్షణం అందులోని గార్డ్సు పైకి వస్తారు. కెప్టెన్ ఆజ్ఞపై తమను బంధీలను చేస్తారు. అప్పుడు యింతటి తమ బృహత్ ప్రయత్నం వృథా అవుతుంది.

ఏం చేయాలి?

ఆలోచిస్తూ కూర్చుంటే, మరికొద్ది నిముషాల్లో షిప్ నీళ్ళలో మునిగిపోతుంది. అప్పుడు శాశ్వతంగా ఆ పెట్టె తమ చేజారి పోయినట్లే!

ఈలోగానే యేదో ఒకటి చేయాలి!

బట్ వాట్?

—ఏం చేయటమో నిర్ణయించుకోలేక, వణుకుతున్న చేతులతో బీగాన్ని తాళం రంధ్రంలో పెట్టి, బీగాన్ని తిప్పకుండా తాత్సారం చేస్తున్నాడు.

"ఊఁ....క్విక్!" అసహనంగా అరిచాడు కెప్టెన్.

చేసేదిలేక బీగాన్ని చిన్నగా తిప్పాడు. "క్లిక్" మంటూ తెరుచుకుంది ఆ తాళం. గొళ్ళెంనుండి తాళాన్ని ఊడదీసాడతడు.

"తలుపును తెరు!" గర్జించాడు కెప్టెన్.

మ్లానమైన ముఖాలతో నిస్సహాయంగా చూస్తోన్నారు నిలుచున్న ఆ ఇద్దరు వ్యక్తులు.

"ఊఁ! క్విక్!" మరోసారి గద్దించాడు కెప్టెన్.

అంతలో....

నీళ్ళలో మెల్లగా మునుగుతున్న షిప్ యేదో శిల తాకడంవలన చిన్నగా ఊగింది. ప్రక్కకు వాస్తా లోగారు ఆ డెక్ పై మిగిలిన ఆ నలుగురూ. ఒక్కక్షణం పాటు కెప్టెన్ ఏకాగ్రత చెదిరింది.

తలుపును తెరవబోతున్న అతడు ఆ క్షణాన్ని సద్వినియోగపరచుకున్నాడు. చేతిలోని తాళంకప్పను బలంగా కెప్టెన్ చేతిపైకి గురిచేసి విసిరాడు.

బాధగా అరుస్తూ చేతిలోని రివాల్వర్‌ను క్రిందకు జారవిడిచాడు కెప్టెన్. అంతే! ఆ రివాల్వర్ చేజారిన మరుక్షణం, బోనులో నుండి విడివడ్డ సింహాల్లా అతనిపై లంఘించారు మిగిలిన ఇద్దరు వ్యక్తులూ.

ఒక పిడికిలిపోటు గుండెలపై, మరొకటి దవడ ఎముక క్రిందుగా, యింకొకటి ప్రక్కటెముకలపై ఇంకో పంచ్

నాభి క్రింద. అంతే! బాధగా అరుస్తూ గింగిరాలు తిరుగుతూ క్రిందపడ్డాడు కెప్టెన్.

ఒకడు వంగి క్రిందపడ్డ రివాల్వర్‌ను చేతిలోకి తీసుకున్నాడు. మరొకడు జేబులో నుండి పెన్‌నైఫ్‌ను తీసి చటుక్కున కెప్టెన్ పైకి వంగాడు.

"నో! వద్దు చౌహాన్! చంపవద్దు!" అంటూ కంగారుగా అరిచాడు తలుపువద్ద కూర్చున్న శివాజీ.

కాని, అప్పటికే చౌహాన్ చేతిలోని కత్తి కెప్టెన్ గుండెల్లో దిగబడింది. శివాజీ వేసిన కేక వినిపించేసరికి మరో పోటు కంఠనాళాలపై....

చిన్నగా మూల్గుతూ తల వాల్చేశాడు కెప్టెన్ అట్లీ. ఆత్రంగా పరుగెత్తుకు వచ్చిన శివాజీ బాధగా తల విదిలించాడు.

"చౌహాన్! అనవసర రక్తపాతం నా కిష్టం వుండదని నీకు తెల్సుగా! మరి కెప్టెన్‌ను యెందుకు చంపావ్?" అసహనంగా అన్నాడు శివాజీ.

తప్పు చేసినట్లు తల దించుకున్నాడు చౌహాన్. "అతన్ని చంపకుంటే పరిస్థితి చేయిదాటి పోతుందేమోనని...." సన్నగా గొణిగాడు.

"తప్పొప్పులను ఎన్నుకుంటూ కూర్చుంటే నిజంగానే పరిస్థితి మనచేయి దాటిపోతుంది." అన్నాడు పండిట్ వారి మధ్య జోక్యం చేసుకుంటూ.

నిజమే! అప్పటికే మరింతగా మునిగిపోయింది షిప్. నీళ్ళు దాదాపుగా డెక్ అంచులను తాకుతున్నాయి.

ఒక్కపరుగున తలుపును సమీపించి ఆత్రంగా దానిని తెరిచాడు శివాజీ.

లోపల.... డెన్ లో....

ఏం జరిగిందో అర్థంగాక తల్లడిల్లిపోతున్నారు లోప లున్న గార్డ్స్.

మొత్తం ఓడంతా పూర్తిగా చితికిపోయినా, ఓడ అడుగుభాగాన ఉండటంచేత, ఉక్కులో పెట్టెలా నిర్మింపబడటంచేత ఆ డెన్ మాత్రం చెక్కుచెదరలేదు. కాకంటే, అయస్కాంత శిలలను ఆ ఓడ శీర్షాన్న తాకిడికి, ఆ డెన్ లోని గార్డ్స్ పల్టీలుకొట్టి, తల్లక్రిందులుగాపడి మోచేతులూ మోకాళ్ళూ కొట్టుకుపోయాయి. ఒకరిద్దరు గార్డ్స్ విసురుగా డెన్ గోడలకు గ్రుద్దుకోవటం వలన స్వల్పమైన గాయాలయ్యాయి. అంతే!

ఏదో ప్రమాదం వాటిల్లిందని ఊహించారువారు. కాని లాకర్ లో బంధింపబడినట్లు ఆ డెన్ లో చిక్కుపడి పోయారువారు. బయటవారు తలుపును తెరిస్తేతప్ప, వెలుపలికి రాలేని పరిస్థితి.

ఏమయిందో, ఏమిటో తెలియక, కాలుగాలిన పిల్లుల్లా అసహనంగా అటూ, ఇటూ పచార్లు చేస్తున్నారు కొందరు గార్డ్స్. చెక్కుమెట్లగుండా పైకిఎక్కి, తలుపును గట్టిగా మోదుతున్నారు మరో ఇద్దరు గార్డ్స్.

సరిగ్గా ఆ సమయంలో ఛటాలున తెరచుకుంది ఆ డెన్ తలుపు. అంతవరకూ తలుపును మోదిన గార్డు....తలుపును తెరిచిన శివాజీ బృందాన్ని చూసి...."ఏం జరిగింది" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు.

బ్రిటిష్ నేవల్ యూనిఫారమ్స్ లోనున్న వారిని తమ షిప్ కు సంబంధించిన సెయిలర్సే అనుకున్నాడతడు.

"ప్రమాదం సంభవించింది!

అండోత్ దీవి తీరంలోని అయస్కాంత శిలలను ఢీకొంది మన ఓడ."—ఎక్కడలేని ఆందోళననూ గొంతు లోనికి తెచ్చుకొని చెబుతున్నాడు శివాజీ.

అతని మాటలు పూర్తికాకుండానే ఒక్క గెంతులో ద్వారంనుండి బయటకువచ్చి డెక్ పైకి చేరుకున్నాడు ఆ గార్డు, అమితమైన కంగారుతో.

శిథిలమై, సముద్రంలో కృంగిపోతున్న తమ నౌకనూ, డెక్ అంచులను ఢీకొంటున్న సముద్రపుటలలను చూసే సరికి మతిపోయిందతనికి.

షాక్ తిన్నవానిలా నిశ్చేష్టుడైపోయాడు.

తెప్పరిల్లిన మరుక్షణం భయంతో కీచుగా అరుస్తూ... తెరవబడ్డ తలుపుగుండా లోనికి తలపెట్టి....

"కమాన్ ఎవ్రీబడీ! హ్యారియట్ ఇంకొద్ది క్షణాలలో మనషిప్ సముద్రంలో మునిగిపోబోతూంది. పారిపోండి! పారిపోయి ప్రాణాలను రక్షించుకోండి!"

అతని అరుపులు తుపాకీ తూటాల్లా పనిచేసాయి. ప్రాణభయంతో పిచ్చిగా అరుస్తూ, ఒకరినొకరు తోసుకుంటూ ద్వారంగుండా బయటకు వచ్చారు ఆ డెన్‌లోని గార్డ్సు. బయటపడ్డ మరుక్షణం డెక్ పైకి పరుగులుతీసారు.

కూత వేటు దూరంలో సముద్ర జలాలపై తేలుతున్న లైఫ్ బోట్లలో కన్పిస్తున్న తమ తోటి సెయిలర్స్‌వంక గట్టిగా అరుస్తూ....ఒక్కరొక్కరుగా సముద్రంలోనికి దూకసాగారు వారు.

వారిని చూస్తూ, తేలిగ్గా నిట్టూర్చి ఒక్కరొక్కరుగా ఆ డెన్‌లోనికి దిగారు - శివాజీ, చౌహాన్, పండిట్‌లు.

ఆ దేక్షణంలో.... పెట్రోల్ టాంక్ అంటుకోవడంతో బాంబ్ షెల్ బ్రద్దలయినట్లు ఫెటేలున ప్రేలిపోయింది

షిప్ ఎలిజబెత్. భయంకర విస్ఫోటనంతో ఫెళ, ఫెళ మంటూ నిలువుగా చీలిపోయింది ఆ షిప్.

ఆ తాకిడికి ఉక్కుతో చేయబడ్డ ఆరెన్ సైతం చిట్లి దానిమ్మపండులా విచ్చుకుంది. కట్టు తెగిన వరదలా ఉవ్వెత్తున ఆరెన్‌ను ముంచెత్తాయి సముద్రపు నీళ్ళు.

## 8

ఏ అమూల్యమైన సంపదకోసం ఇన్ని శ్రమలనూ ఓర్చారో, దేనికోసం ప్రాణాలకు తెగించి మరీ ఇంత సాహసం చేసారో....ఆ అమూల్యసంపద నిక్షిప్తం చేయబడ్డ పెట్టె....దట్ రెడ్ బాక్స్....

సరిగ్గా వారికి నాలుగు అడుగుల దూరంలో ఉండనగా జరిగిందా ఉత్పాతం!

ఏదో రాక్షస హస్తం ఎత్తి కుదిపేసినట్లు వెల్లుగా ఊగింది ఆ రెన్. ఆ ఊపుకు ఒక్కొక్కరు ఒక్కొక్క దిక్కుకు తుళ్ళిపోయారు వారు.

ఎగిరి తలక్రిందులుగా పడటంలో చౌహాన్ తల సూటిగా నేలను తాకటంతో....ఆ క్షణమే స్పృహను కోల్పోయాడతడు. నేలపై బోర్లాపడటంతో పండిట్ ముక్కు చితికిపోయింది. పెదవులు చిట్లి రక్తం చిమ్మింది. మోచేతులు, మోకాళ్ళు కొట్టుకుపోయాయి.

విసురుగా రెన్ గోడకు గుద్దుకున్నాడు శివాజీ. ఫ్లాట్‌గా వీపు గోడకు తగలడంచేత అతనికి పెద్ద దెబ్బలేం తగలలేదు. వెన్నుకాస్తా నొప్పిపెట్టసాగింది. అంతే!

వారు ఆ దిగ్భ్రమనుండి తేరుకోకుండానే, పగిలిన ఆరెన్ గోడలనుండి ఉబికి వస్తున్న సముద్రపు నీరు వారిని ముంచెత్త సాగింది.

ఆ షాక్ నుండి మొదటగా తేరుకున్నది శివాజీ. చల్లని సముద్రపునీరు శరీరానికి తగిలేసరికి, ఉలిక్కిపడుతూ కంగారుగా చుట్టూ చూసాడు.

కాస్త దూరంలో బాధగా మూలుగుతూ మెల్లగా పైకిలేస్తున్నాడు పండిట్.

"పండిట్!"

నీటిని చూస్తూ కలవరపడుతున్న పండిట్ శివాజీ పిలుపు విని వెనుతిరిగి చూసాడు.

"కమాన్ పండిట్ క్విక్!" అంటూ పెట్టెవంక పరుగుతీశాడు శివాజీ. పండిట్ అతడిని అనుసరించాడు.

ఏమాత్రం తాత్సారం చేసినా ఆ పెట్టె తమ చేజారి పోతుందని, శాశ్వతంగా సాగర గర్భంలో కలిసి పోతుందనీ వారికి తెలుసు.

ఆత్రంగా ఆ పెట్టెను పైకెత్తారు. పెట్టెను మోసు కుంటూ మెట్లవైపు అడుగులు వేశారు.

అప్పటికే దాదాపు కాలి పిక్కలను దాటివచ్చేశాయి నీళ్ళు. నీళ్ళలో అడుగులు సరిగ్గా పడటంలేదు. ఆపైన ఆ పెట్టె బరువు.

మెల్లగా మెట్లమీదకు ఆ పెట్టెను చేర్చారు. అప్పుడు గుర్తుకు వచ్చింది. వారికి చౌహాన్ విషయం.

"మైగాడ్! చౌహాన్....చౌహాన్ ఏడీ!" ఇద్దరూ కూడ బలుక్కున్నట్లు ఒకేసారి అరిచారు చిన్నగా.

ఆత్రంగా చుట్టూ కలియజూసారు.

క్షణ. క్షణానికీ పెరుగుతున్న నీటిమట్టం తప్ప మరేమీ కనిపించటం లేదా డెన్‌లో.

"ఏమయ్యాడు? ఇంతలో నే ఎక్కడికి మాయ మయ్యాడు?"....విపరీతమైన ఆందోళనతో చలించి

పోసాగారు వారు. ఒక్క క్షణం ఒకరివంక ఒకరు పాలిపోవగా చూసుకున్నారు.

పెట్టెను ఎత్తి, మరో రెండు మెట్లపైన పెట్టి, క్రిందకు ఉరికారు వారు. అప్పటికి మోకాళ్ళదాకా పెరిగింది నీటి మట్టం.

'అక్కడే, ఎక్కడో నీళ్ళ అడుగున చౌహాన్ స్పృహతప్పి పడిఉంటాడని' వారి నమ్మకం! చెరో దిక్కులో నీళ్ళలో దేవులాడుతూ చౌహాన్ కోసం వెదుక సాగారు.

ఒకటి.... రెండు.... మూడు....

ఒక్కొక్క క్షణం గడుస్తున్నకొద్దీ వారిలో టెన్షన్ పెరిగిపోతూంది. ఆ డెన్ లోని ప్రతి అంగుళాన్ని గాలించారు. కాని, విచిత్రం.... చౌహాన్ ఎక్కడా కనిపించ లేదు.

'ఉన్నపాటున డెన్ లో ఉన్న వ్యక్తి ఎలా అదృశ్యమయినట్లు?' ఆశ్చర్యంగా ఒకరినొకరి చూసుకున్నారు వారు.

వీరి ఆలోచనలతో ప్రమేయం లేనట్లు నీటిమట్టం క్షణ క్షణానికి పెరిగిపోతూంది. తొడలను దాటి నడుం అంచులను తాకుతున్న నీటివంక ఆందోళనగా చూశారువారు.

మెల్లగా ఈదుకుంటూ చీలిన డెన్ గోడలను సమీపించారు. డెన్ కు ఏర్పరచిన పెద్ద తలుపులా నిలువుగా చీలిన ఆ ఖాళీగుండా సముద్రపునీరు పొంగి పొర్లి వస్తూంది.

ఆ చీలికగుండా బయటకు చూశారువారు. ముక్కలయిన షిప్ బాడీకి, డెన్ గోడకూ మధ్య, నిండివున్న సముద్ర జలాలలో అస్పష్టంగా కన్పిస్తున్న ఆ భయానక దృశ్యాన్ని చూస్తూ నిశ్చేష్టులైపోయారు వారు.

భయంతో వారి గొంతులు ఆర్చుకుపోయాయి.

శరీరాలు సన్నగా కంపించాయి.

'ఓ' అంటూ చిన్నగా అరిచారువారు. ఆ బీభత్సాన్ని చూడలేక వారి ముఖాలు వివర్ణమయ్యాయి.

# 9

ఆ వార్తతో బొంబాయి రేవు గుప్పుమంది.

అందోత్ దీవి సమీపంలో షిప్ ఎలిజబెత్‌కు ఘోర ప్రమాదం సంభవించిందని తెలిసి, ఆందోళనతో వణికిపోయారు ఆ రేవులోని బ్రిటిష్ ఉన్నతాధికార్లు.

వారు ముఖ్యంగా ఆందోళన చెందుతున్నది. ముక్కలయిన ఆ షిప్ గురించిగానీ, సముద్రంపాలైన ఆ షిప్ సిబ్బంది గురించిగానీ కాదు. అమూల్యమైన ఆ సంపద కోసం. ఆ రెడ్ బాక్స్ కోసం.

'నిజమే ఆ బాక్స్ పోయిందంటే బ్రిటిష్ రాణికి ఏమని సంజాయిషీ యివ్వాలి?'—అదీ వారిని కలవరపరుస్తున్న ప్రశ్న!

బొంబాయి పోర్టుకు సంబంధించిన బ్రిటిష్ ఉన్నతాధికార్లతో ఒక రహస్య సమావేశం ఏర్పాటయింది. రెస్క్యూ అండ్ సెర్చింగ్ ఆపరేషన్స్ కోసం ఎనిమిది పెట్రోల్ బోట్స్ తక్షణమే అందోత్ దీవికి తరలింపబడ్డాయి.

ఒక్కొక్క బోటులోను పదిమంది సైనికులు పంపబడ్డారు. ప్రతి అరగంటకొకసారి, పరిస్థితినంతా బొంబాయి పోర్టుకు రిపోర్టు చేయాలని, వారికి ఆర్డర్స్ జారీ చేయబడ్డాయి.

సిగ్నలింగ్ రూమ్‌లో కూర్చుని ఆ బోట్స్‌నుండి వచ్చే మెసేజస్ కోసం అసహనంగా ఎదురుచూస్తున్నారు ఆ పోర్టు ఉన్నతాధికార్లు.

అయితే ఆ ఉన్నతాధికార్లకూ, సెర్చింగ్‌కు వెళ్తున్న సైనికులకూ అర్థంకాని విషయం ఒక్కటే!

'నిర్ణీతమార్గాన్ని వదలి, షిప్ ఎలిజబెత్ అండోత్ దీవివైపు ఎందుకు వెళ్ళినట్లు? అదీ....ఆ దీవి తీరాన అయస్కాంత శిలలున్నాయని తెలిసి కూడా!'

కొన్నిగంటల తరువాత ఆ పెట్రోల్ బోట్స్ అండోత్ దీవి సమీపానికి చేరుకున్నాయి.

సముద్రం మధ్యలో అంటే దీవి తీరంలోనున్న అయస్కాంత శిలల ఆకర్షణా పరిధికి అందనంత దూరంలో ఆ పెట్రోల్ బోట్స్ ఆపబడ్డాయి.

పది, పన్నెండు లైఫ్‌బోట్లను సముద్రంలోనికి దించి, వాటిపై సెర్చింగ్‌కు బయలుదేరారు ఆ పెట్రోల్ బోట్స్‌లోని సైనికులు.

వారు తీరాన్ని సమీపించేసరికి ఎలిజబెత్ పూర్తిగా నీళ్ళల్లో మునిగిపోయింది. కేవలం దాని బ్రిడ్జి పిల్లర్ మాత్రం నీళ్ళల్లోనుండి బయటకు కన్పిస్తూంది. బోట్లను నడుపుకుంటూ వారు ఆ షిప్‌ను సమీపించారు.

స్విమ్మింగ్ సూట్లను ధరించి, వాటర్‌గన్‌లను పట్టుకుని సిద్ధంగా ఉన్న దాదాపు ఇరవైమంది సైనికులు నీళ్ళలోనికి దుమికారు. చేపల్లా ఈదుకుంటూ విరిగి ముక్కలైన ఎలిజబెత్‌ను చుట్టుముట్టారు.

శిథిలమైన షిప్ బాడీ శకలాలను దాటి లోనికి ప్రవేశించారు. కాని, అక్కడ కన్పిస్తున్న బీభత్సకరమైన దృశ్యాన్ని చూశాక వారి అడుగులు ముందుకు పడలేదు.

భయంతో వారి ముఖాలు పాలిపోయాయి. వాటర్ గన్‌లను పట్టుకున్న వారి చేతులు సన్నగా వణకసాగాయి.

(ముగింపు వచ్చే సంచికలో)

సీరియల్-

# ఎడారి కోయిల

## బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

కొద్దిక్షణాలు అక్కడే నిల్చుండి వాటిని పరిశీలనగా చూశాడు సిద్ధార్థ. తనిప్పుడేం చెయ్యాలి? ఆ గుహల్లో ఎవరుంటున్నారు? మనుషులా, మృగాలా? తనకిప్పటి వరకు నరసంచారమన్నదే కనిపించలేదు. నిజంగా ఈ పరిసరాల్లో మనుషులు నివసించటంలేదేమో....!?

అయితే, అతని ఆలోచనల్ని తారుమారు చేస్తూ ఒక్కసారిగా బిలబిలమంటూ పది పన్నెండుమంది మనుషులు అతన్ని చుట్టుముట్టారు. వాళ్ళందరి చేతుల్లోను పొడవాటి కర్రలున్నాయి. వాటికి రెండువైపులా సూదిగా చెక్కబడి వున్నాయి. వాడిబాణంకన్నా షార్ప్‌గా వున్నాయి మొనలు.

సిద్ధార్థ నిర్ఘాంతపోయిచూశాడు వాళ్ళవంక. కర్రలన్నీ సూటిగా అతని శరీరానికి గురిచేయబడి వున్నాయి.

• • •

అతి ప్రయాసమీద కొండ నెక్కింది కోయిల.

అది చాలా యెత్తుగా వుంది. నిట్టనిలువుగా, యెక్క

దానికి మాత్రం వీలులేకుండా నునుపుతేలి వున్నది.

రెండడుగులు యెక్కితే మూడడుగులు కిందికి జారి పోతూ, అక్కడక్కడ పెరిగిన పిచ్చిమొక్కల్ని ఆధారంగా పట్టుకుంటూ, అవికూడా ఒక్కోసారి వూడి చేతిలోకి వచ్చేస్తూంటే, మరికొన్ని అడుగులు కిందికి జారి పోతూ, మరో మొక్కనో, చేతికందిన బండనో పట్టుకొని ఆపుకుంటూ కొండపైకి చేరుకొంది.

అప్పటికి సూర్యుడు నడినెత్తిమీదికొచ్చేశాడు. ఆమె కొండ యెక్కటం కనీసం ఓ గంట ముందు జరిగివుంటే, ఆమెకు ప్రమాదంలో చిక్కుకున్న సిద్ధార్థ తప్పక కనిపించి వుండేవాడు. ఆమె అతన్ని యెలాగో రక్షించుకో గలిగేది. కాని అప్పటికే ఆలస్యమైపోయింది.

కోయిల కొండమీది నుంచి చుట్టూ పరీక్షగా చూసింది.

సుదూరంగా పొగ లేస్తున్నట్టు కనిపిస్తున్న ప్రాంతాన్ని ఆమె సులభంగా గుర్తుపట్టగలిగింది. దాదాపు ఇరవై మైళ్ళ పరిధిలోని దృశ్యాలన్నీ అస్పష్టంగా అక్కడికి కనిపిస్తున్నాయి.

పైకి లేస్తున్న పొగ నిజంగా పొగ కాదని, ఎడారిలో ఇసక కాలేటపుడు పైకి లేచే వేడి సెగలని ఆమెకు బాగా తెలుసు.

ఆమెకు చాలా ఆనందమనిపించింది. తనకి చాలా దగ్గర్లోనే ఎడారి వున్నది—అంటే తను కొన్ని మైళ్ళదూరం గాల్లో యెగిరి వచ్చిందన్నమాట—ఇసక తుఫాన్ కారణంగా.

మరి....తనలాగే సిద్ధార్థ కూడా ఇదే ప్రాంతాలలో యెక్కడో వుండాలి కదా! తనకి అన్నివైపులా

దృశ్యాలు కనిపిస్తున్నాయి. ఆ నరమాంసభక్షకుల కాళ్ల కూడా కనిపిస్తోందక్కడికి. కాని....సిద్ధార్థ జాడ మాత్రం కనిపించటంలేదు. కారణమేమిటి?

తన కోసం, తన ప్రతిజ్ఞ చెల్లించటంకోసం తనవెంట వచ్చి తుఫాన్‌కు బలై పోయాడు. అతను జీవించి వుంటే తప్పక తనకిప్పుడు కనిపించి వుండేవాడు.

ఆమె కళ్ళనుండి కన్నీరు అవిరళ ధారగా ప్రవహిస్తోంది. అంతక్రితంవరకు ఘోర్క జాతి మీదున్న కక్ష, ప్రతీకారం, పగ, పదింతలు పెరిగింది. వాళ్ళ కారణంగానే తనకు జన్మనిచ్చిన తండ్రి పోయాడు. తన మనస్సుకు నచ్చిన ఆత్మీయుడయిన సిద్ధార్థ కూడా వాళ్ళ మూలానే తనకు కాకుండా పోయాడు. తనకిప్పుడు గమ్యం తెలిసింది. తక్షణమే బయల్దేరివెళ్ళి ఆ రాక్షసుల్ని సమూలంగా నాశనం చేయాలి!

కోయిల పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆ క్షణమే గాల్లో యెగిరివెళ్ళి ఆ బందిపోట్లని మట్టుపెట్టాలనే వీరావేశం పుట్టుకొచ్చింది.

కాని రెండు ఆటంకాలెదురయ్యాయి.

మొదటిది: తను నిరాయుధురాలు. విల్లమ్ములు తుఫాన్‌లో యెప్పుడో యెక్కడో జారిపోయాయి.

రెండవది: కొన్ని మైళ్ళదూరం కాలినడకన వెళ్లాలి. దానికి కొంత వ్యవధి కావాలి.

ముందుగా ఆయుధాలు సంపాదించాలి. కనీసం విల్లమ్ములైనా సరే! విల్లు తను తయారుచేయగలదు. దాని నారి ఒక రకమైన జంతు నరాలతో తయారుచేస్తారు. ఆ జంతువు ఎడారిలోనే దొరుకుతుంది. దాన్ని సాధించటానికి కొన్ని రోజులు పడుతుంది. బాణాల మొనలు

తయారు చేసుకోవటానికి మరికొన్ని రోజులు.

ఉహుఁ. తనకంత వ్యవధి లేదు. రాత్రి సమయానికి ఘోర్క జాతి స్థావరం చేరుకోగలిగితే, వాళ్ళుపయోగించే పట్టాకత్తుల్ని రహస్యంగా చేజిక్కించుకోవచ్చు. లేదా, ఈలోపల తన కెవరైనా బందిపోటు తారసపడక పోడు — వాడ్ని యుక్తిగా జయించి ఆయుధం సంపాదించవచ్చు.

ఈ ఆలోచన రాగానే ఇక క్షణం కూడా ఆలస్యం చెయ్యాలనిపించలేదు కోయిలకు.

చివరిసారిగా ఆశతో సిద్ధార్థ కోసం నలువైపులా ఓ సారి పరీక్షగా చూసింది — కాని ప్రయోజనం లేక పోయింది.

దూరంగా ఏవో కొండగుహల్లా కనిపిస్తున్నాయి గాని, అక్కడ నరసంచార మున్నట్టే లేదు.

కళ్ళు తుడుచుకుని, ఎడారికి పోయే దారిని మరోసారి పరిశీలనగా చూసి గుర్తుపెట్టుకొని కొండ దిగటం ప్రారంభించింది.

ఎక్కడానికి పడినంత శ్రమ దిగటానికి పడాల్సిన పని లేకపోయింది. ఓ అరగంటలోనే దిగేసింది. ఉరకలు వేస్తూ ముందుకు సాగింది.

అప్పుడు కూడా ఆమె కళ్ళు సిద్ధార్థ కోసం వెతకటం మానలేదు. తదేక దీక్షతో వెతుకుతూ ముందుకు సాగింది.

అప్పుడు సమయం సాయంత్రం నాలుగు గంటలు కావస్తోంది. సూర్యుడి తీక్షణత తిగ్గుముఖం పట్టింది. చుట్టూ చెట్లుండటంవల్ల ఎండ పొడలుగా నేలమీద పడుతోంది. అంతక్రితంవరకు మహాప్రవాహంలా, సముద్రంలా కనిపించిన నీరంతా ఎప్పుడో ఇంకిపోయింది. నేల తడిపొడిగా

కనిపిస్తోంది. ఎండ వేడిమికి చాలా వేగంగా ఆరిపోతోంది.

ఆ ప్రయత్నంగా చెట్లమీదికి చూసిన కోయిల అదిరిపడింది.

ఓ చెట్టుమీద కూచున్న ఆకారాన్ని ఆమె తేలిగ్గానే గుర్తు పట్టింది.

దాన్ని తమ ఎడారివాసులు హూత్ బిల్లీ అని వ్యవహరిస్తారు. పులిజాతికి చెందిన అతి క్రూరమృగమది.

చూడటానికి చిన్నసైజు పులిలాగే వుంటుంది. ఏమాత్రం శబ్దం చెయ్యకుండా అమాంతం మనుషులమీద జంతువులమీద ఎత్తునుంచి దుమికి, వాళ్ళని కదలనివ్వకుండా పట్టుకుని చంపి అరగిస్తూంది.

అది ఎప్పుడోగాని ఎడారిలోకి అడుగుపెట్టదు. ఆహారం దొరక్కపోతేనే అది ఎడారివాసులమీద దాడి చేస్తుంది.

గతరాత్రి వర్షం కారణంగా దానికి ఆహారం దొరికి వుండదు. దాని కళ్ళలో స్పష్టంగా కదలాడుతున్న ఆకలిని గుర్తించి వణికింది కోయిల.

మరోకప్పుడైతే దాన్ని నిర్భయంగా ఎదుర్కొని నేల కూల్చి వుండేది. కాని, ఇప్పుడు చేత కట్టెపుల్లకూడా లేని నిరాయుధురాలు! దాని దాడినుంచి తప్పించుకోవటం కల్లోనిమాట!

ఆమె మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది.

అయితే హూత్ బిల్లీ ఆమెకు అవకాశమివ్వకుండానే గాల్లో పల్టీకొడుతూ ఆమె మీదికి దుమికింది.

  

తనని చుట్టుముట్టిన వ్యక్తులవంక ఆశ్చర్యంతోను, కొద్దిపాటి భయంతోను చూశాడు సిద్ధార్థ.

వాళ్ళు చాలా మొరటుగావున్నారు. అనాగరికంగా ఉన్నారు. వీళ్ళకన్న ఎడారివాసులే చాలా మెరుగనిపిస్తున్నారు.

వాళ్ళు చిన్నగోచీ తప్ప శరీరంమీద మరే ఆచ్ఛాదనా ధరించలేదు. వాళ్ళ శరీరమంతా ఎలుగుబంటు మాదిరిగా నల్లటిబొచ్చు ఉన్నిలా కప్పేసింది. గడ్డాలు మీసాలుతో ముఖమంతా నిండిపోయి కేవలం ఎర్రటికళ్ళు, ముక్కు మాత్రమే పైకి కనిపిస్తున్నాయి. అందరి మెడల్లోను చెట్టు తీగెలతో కట్టిన వింత హారాలున్నాయి.

వాళ్ళు ఒకేసారి తమ వద్దనున్న సూది మొనల్లా చెక్కిన కర్రల్ని సిద్ధార్థ ముఖంమీద గుండెలమీద మోపి గోలగా ఏదో అడిగారు.

వాళ్ళమాట ఒక్కటీ అర్థంకాలేదు సిద్ధార్థకు. కోయిలగూడెం వాళ్ళు నయం, కనీసం హిందీకి దగ్గరగా వుండే భాషలో మాట్లాడారు. తనకీ కాస్త అర్థమయింది. వీళ్ళు మరీ అర్థంకాని పిచ్చికేకలు వేస్తున్నారు.

మళ్ళీ వాళ్ళంతా కోరస్‌గా అరిచారు.

సైగలద్వారా తను ఎలా అక్కడికొచ్చి పడ్డాడో చెప్పాడు సిద్ధార్థ. అందులో కోయిలకి సంబంధించిన విషయం ఒక్కటి కూడా చేర్చలేదు.

వాళ్ళు అర్థంకాలేదన్నట్టు ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

సరిగ్గా అప్పుడే ఆకాశంలో ఏదో విమానం వెళుతున్న శబ్దం వినిపించింది. ప్రొపెల్లర్ ధ్వనితో అత్యంత పాన్ని

హిత్యమున్న సిద్ధార్థ పాటు చెవులు ఆ శబ్దాన్ని గ్రహించాయి.

సిద్ధార్థ ఆశగా తలపైకెత్తి చూశాడు. ఎక్కడో సుదూరంగా మేఘాలకిపైగా పయనిస్తూ పిచ్చిక పరిమాణంలో కనిపించి మాయమయింది విమానం.

అతనితో బాటు ఆ వ్యక్తులు కూడా తల పైకెత్తి ఆకాశంలోకి చూశారు.

ఆ విమానంలాంటి మరో విమానం నించి జారిపడి పోయానని మళ్ళీ వివరించాడు సిద్ధార్థ.

వాళ్ళకి అప్పటికీ అర్థంకాలేదు.

సిద్ధార్థకి కోపొచ్చినంత పనయింది. వీళ్ళకెంత చెప్పినా అర్థంకావటంలేదంటే బాగా మట్టిబుర్రలై వుండాలి!

మళ్ళీ ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. తనువాళ్ళకి శత్రువుకాననీ, మిత్రుడినేనని అర్థంఅచ్చేలా రెండు చేతులు కలిపి పైకెత్తాడు. ఏమీ లాభం లేకపోయింది.

అతను తమమీద తిరగబడే ప్రయత్నమేదీ చెయ్యక పోవటంతో వాళ్ళు కొంత శాంతించినట్టే కనిపించారు.

కాని అతన్నిమాత్రం విడిచిపెట్టలేదు.

వాళ్ళు ఎక్కడినుంచి ఊడిపడ్డారో సిద్ధార్థ కప్పుడర్థ మయింది. మరో గుహలోనించి వస్తున్న మరో నలుగురు మనుషుల్ని చూశాక.

వాళ్ళుకూడా అదే గెటప్‌లో వున్నారు. తన ప్రాణాలు తోడెయ్యటానికి ప్రత్యక్షమైన మరో నలుగురు యమభటుల్ని చూసి మరింత దిగాలు పడిపోయాడు.

ఇక వాళ్ళకేం చెప్పినా కంఠశోషేనని గ్రహించి మౌనం వహించాడు.

వాళ్ళతన్ని ఒడిసిపట్టుకుని జంతువుని వధ్యశాలకు

లాక్కుపోయినట్టు బరబర లాక్కుంటూ గుహ అంతర్భాగానికి తీసుకుపోయారు.

అప్పుడు మధ్యాహ్నం మూడుగంటలు కావస్తోంది.

అయినా గుహాలోపల చాలా చీకటిగావుంది. ఆ వ్యక్తులు మరింత లోపలకు లాక్కునిపోయారు సిద్ధార్థని.

లోపల యేదో హితవుకాని వాసన వస్తోంది. సిద్ధార్థకి వాంతి వచ్చినట్టనిపించింది. అయితే గత రెండు రోజులుగా ఆహారం లేకపోవటంవల్ల కడుపులో యేమీలేదు. కాసేపు వికారంగా అనిపించింది. తర్వాత సర్దుకున్నది....

లోపల నెగడు మండుతోంది. నెగడు ముందు ఓ వయసుమళ్ళిన వ్యక్తి కూచునివున్నాడు. చూడటానికి శాంతస్వభావుడిలాగానే కనిపించాడు. తక్కినవాళ్ళకన్న భిన్నంగా వున్నాడు.

వాళ్ళు సిద్ధార్థని పెడరెక్కలు విరిచికట్టి ఆ ముసలాయన ముందు నిలిపారు.

ఆ వృద్ధుడు చాలాసేపటివరకు దీక్షగా సిద్ధార్థవైపు చూస్తూ వుండిపోయాడు. తర్వాత తన మనుషులవైపు చూసి సైగ చేశాడు.

సిద్ధార్థను అలాగే వదిలేసి వాళ్ళందరు బయటకు వెళ్ళారు.

వృద్ధుడు లేచి నిలుచున్నాడు. సిద్ధార్థకి దగ్గరగా వచ్చి సూటిగా అతని కళ్ళలోకి చూశాడు. సిద్ధార్థ కలవరపడ్డాడు. అతని చూపుల్లో యేదో అయస్కాంత శక్తి వున్నట్టు కనిపించింది.

“ఇక్కడకెందుకొచ్చావు! నువ్వెవరు?” అన్నాడు స్వచ్ఛమైన ఆంగ్లంలో, వృద్ధుడు.

పక్కన బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు సిద్ధార్థ. చాలాళ్ళ తర్వాత ఇంగ్లీషు మాట విన్నందుకు కాదు. ఆ నాగరికుడనుకొంటున్న ఆ వ్యక్తి నోట అంతర్జాతీయ భాష వింటున్నందుకు!

తనవంక విస్తుపోయి చూస్తూన్న సిద్ధార్థ వంక నవ్వుతూ చూశాడా వృద్ధుడు.

"టెల్ మీ యంగ్ మాన్ హూ ఆర్యూ? హౌడిడ్ యు కమ్ ఓవర్ హియర్?"

ఆశ్చర్యంనించి, విస్మయంనించి తేరుకుని వృద్ధుడివంక చూశాడు సిద్ధార్థ.

చకచక తన విషయమంతా క్లుప్తంగా ఆయన కెరిగించాడు.

ముసలాయన జాగ్రత్తగా విన్నట్టే కనిపించాడు.

"అయితే నువ్వు పైలెట్ వన్న మాట! వెరీగుడ్! త్వరలోనే నీ స్వస్థలం వెళ్ళిపోగలుగుతావు.... అన్నట్టు యేమైనా తిన్నావా?" అడిగాడు వృద్ధుడు.

తల అడ్డంగా తిప్పాడు సిద్ధార్థ.

చప్పట్లు చరిచాడు వృద్ధుడు.

అంత క్రితం సిద్ధార్థని పెడరెక్కలు విరిచికట్టి లాక్కొచ్చిన ఆనాగరికులు వచ్చి నిల్చుని అభివాదం చేశారు వృద్ధుడికి.

కళ్ళతోనే సైగ చేశాడు వృద్ధుడు.

వాళ్ళు వెళ్ళి క్షణాల్లో ఆహారం ఆకుదొన్నెల్లో తీసుకొనివచ్చి సిద్ధార్థ ముందు పెట్టారు.

బాగా అరముగ్గిన పళ్ళు, కాల్చిన దుప్పి మాంసం చూడగానే సిద్ధార్థకు ఆకలి కట్టలు తెంచుకుంది. ఒక్క

పూరిగా ఆహారంమీద దాడిచేసి అయిదునిమిషాల్లో ఆ పదార్థాలను ఖాళీ చేసేశాడు సిద్ధార్థ.

ఎన్నాళ్ళుగానో అలవరచుకున్న సంస్కారం, డీసిప్లిన్ ఆ క్షణంలో అతనికి గుర్తుకు రాలేదు. ఆకలిని చల్లార్చుకోవటమే తన ఏకైక లక్ష్యమన్నట్టు తిన్నాడు.

వృద్ధుడు అంతసేపు అతనివైపే తదేకదీక్షతో చూస్తున్నాడు. ఎందుకో మధ్యలో తల పైకెత్తి చూసిన సిద్ధార్థ ఆయన తనవైపే చూడటం గమనించి సిగ్గుపడిపోయాడు.

"ఆకలి ఆన్ సైడ్ బోయ్! ఇంకా యేమైనా తెప్పించమంటావా?" ఆదరపూర్వకంగా చూస్తూ చిన్నగా నవ్వుతూ అడిగాడు వృద్ధుడు.

"నో సర్! థాంక్యూ వెరిమచ్! పోయే ప్రాణాన్ని కాపాడారు" అన్నాడు సిద్ధార్థ కృతజ్ఞత తొణికిసలాడుతున్న గొంతుకతో.

ఆ వృద్ధుడు తన అనుచరులకి సైగ చేశాడు. వాళ్ళు దూరంగా పోయి నించున్నారు.

వృద్ధుడు సిద్ధార్థవైపు తిరిగి, "ఇప్పుడు చెప్పు, నేను నీ కే విధంగా సహాయపడగలనో...!?" అన్నాడు.

సిద్ధార్థకి ఎన్నాళ్ళుగానో పీడిస్తున్న సమస్యకు సమాధానం తెలుసుకునే అవకాశం దొరికింది.

"సర్, మీ రెవరో నాకు తెలియదు. కాని అవసరానికి ఆపద్బాంధవుడిలా ఆదుకున్నారు. మీ అనుచరుల వాలకం చూస్తే నన్ను యే దేవతకో బలిచ్చేస్తారేమోనని పించింది. కాని మిమ్మల్ని చూశాక మీరు అలాంటి వ్యక్తి కాదనే నమ్మకం కుదిరింది. నేను వారం రోజుల క్రితం

ఈ ఎడారి ప్రాంతంలో చిక్కుపడిపోయాను. అటు ఢిల్లీ గానీ, ఇటు హైదరాబాదుగాని పోయే మార్గం చెప్పండి. ఇదే ప్రాంతానికి చెందినదో తెలియచేయండి. మీ మేలు మరవను" అన్నాడు.

"ఇది భారత భూభాగానికి చెందినదే గాని పాకిస్తాన్ బార్డర్ యిక్కడికి చాలా దగ్గర. చాలా జాగ్రత్తగా వ్యవహరించవలసిన ప్రాంతం. మిమ్మల్ని క్షేమంగా తోవ చూపించి రమ్మని నా మనుషుల్ని పంపిస్తాము. దగ్గర్లో బస్ రూట్ గాని, విమానాశ్రయం గాని, రైల్వేలైను గాని లేవు.

ఎడారికి పక్కగా వున్న దారిన దాదాపు ఇరవై మైళ్ళు ప్రయాణం చేస్తే ఓ పెద్ద గ్రామం వస్తుంది. అక్కడ్నుంచి ఒంటెమీద ప్రయాణంచేస్తే బస్ సౌకర్యమున్న ఓ బస్తీ తగులుతుంది. అక్కడ్నుంచి నీవు కావలసిన రూట్ కు వెళ్ళొచ్చు. నా కూడా యింతకన్నా వివరాలు తెలియవు. ఆ బస్తీలో ఎంక్వయిరీ చెయ్యి" చెప్పాడు వృద్ధుడు.

సిద్ధార్థకి ఏదో మార్గాంతరం దొరికినందుకు, కనీసం ఓ గమ్యముంటూ తెలిసినందుకు మనసు తేలిక పడింది....

ఇంతలో అతనికి తను చూసిన పాడుబడిన కోట, అక్కడి వింత అనుభవం గుర్తుకువచ్చింది. అడగనా వద్దా అనుకుంటూ తటపటాయించాడు.

అతని ఆంతర్యం గ్రహించినట్టు వృద్ధుడు అడిగాడు:

"నా గురించి తెల్సుకోవా లనుకుంటున్నావు కదూ....!?" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

అంతవరకు తనకా ఆలోచన రానందుకు తనని తాను

నిందించుకుని, "అవును సర్, మీరు చూడగా విదేశీయుల్లా వున్నారు. ఏదో పెద్ద హోదాలో ఉద్యోగం చేసినవారిలా వున్నారు. ఇక్కడ యిలాంటి నిర్జన ప్రాంతంలో నిస్సారమయిన చోట యెందుకిలా అజ్ఞాతవాసం చేస్తున్నారు? అభ్యంతరం లేకపోతే మీ గురించి తెలుసుకోవాలని వుంది" అన్నాడు సిద్ధార్థ.

వృద్ధుడు చిరునవ్వు నవ్వి, "నేను విదేశీయుణ్ని కాదు యంగ్ మాన్! అచ్చమైన భారతీయుడిని. నా పేరు సోమేశ్వర్. మా పూర్వీకులు రాజవంశీయుల కొలువులో పెద్ద హోదాల్లో వెలిగినవాళ్ళు. నీవు దారిలో పాడుబడిన కోట ఒకటి కనిపించే వుంటుంది.

మా ముత్తాత తండ్రి ఆ కోటలోనే పని చేశారు. తర్వాత బ్రిటిష్‌వారి కాలంలో ఆ కోటని స్వాధీనం చేసుకొని గాచరికాల్ని రద్దు చేయటంతో క్రమేణా అది పాడుబడిపోయింది. మా ముత్తాత మా తాతగారిని తీసుకొని హరిద్వార్ వెళ్ళిపోయారు. అప్పట్నుంచి మేము అక్కడ సెటిలయిపోయాం."

"మరి మీరు యిన్నేళ్ళ తర్వాత....ఇక్కడ....!?" అంటూ అర్థోక్తిలోనే ఆపి ప్రశ్నార్థకంగా చూశాడు సిద్ధార్థ. అతనికి ప్రమద్వర గురించి, గతరాత్రి తన అనుభవాల గురించి ఆయనకు చెప్పాలని తహతహగా వుంది. సోమేశ్వర్ తనంతట చెప్పకపోతాడా అని యెదురు చూస్తున్నాడు.

సోమేశ్వర్ మనసులో గతస్మృతులు అలజడి రేపుతున్నాయని సిద్ధార్థ గ్రహించాడు.

"క్లుప్తంగా చెపుతాను. నేను పిహెచ్‌డి చేశాను కేంబ్రిడ్జిలో. ఢిల్లీ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పని

చేశాను. ఆ తర్వాత మినిస్ట్రీ ఆఫ్ ఎక్స్‌టెర్నల్ ఎఫయిర్స్‌లో కీలకమయిన పోస్టులో కొన్నాళ్ళున్నాను. ఆ సమయంలోనే విదేశాలకు మనదేశ రహస్యాల్ని డబ్బుకు కక్కుర్తిపడి అమ్ముకొంటున్నానని నా మీద అన్యాయంగా ఆరోపించి జైలుపాలు చేశారు. ఆ సమయంలో ఆధారాలన్నీ నన్ను దోషిగానే నిరూపించటాని కుపయోగపడ్డాయిగాని, నా నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోలేకపోయాయి.

"చెయ్యని నేరానికి జైల్లో మగ్గిపోవటం కన్నా స్వేచ్ఛావిహంగంలా పారిపోవటం మేలనుకున్నాను. ఓ జైలునించి మరో జైలుకి తరలిస్తున్న సమయంలో వీలుచూసుకుని తప్పించుకున్నాను. ఎలాగో యిక్కడి కొచ్చి పడ్డాను. ఈ యాత్రికుల మధ్య, నేనెవరో ఎవ రికీ అక్కర్లేని ఈ ఎడారిలో బతికేస్తున్నాను. కావా లనే ఒకప్పుడు నా పూర్వీకులు నివసించిన యీ ప్రాంతా నికి చేరుకుని నా శేషజీవితం ప్రశాంతంగా, నిశ్చింతగా గడిపేస్తున్నాను.

"నేను చేసింది తప్పే! ప్రభుత్వాదేశాన్ని, చట్టాన్ని ధిక్కరించటమేనని నాకు తెలుసు. కాని, ఈ చట్టమే నిర్దోషినైన నన్ను దోషిగా కోర్టులో నిలబెట్టి శిక్షించి నపుడు నేనా శిక్షనెందుకు భరించాలి? కోర్టు ఆదేశా న్నెందుకు శిరసావహించాలి? అందుకే తప్పించుకొచ్చే శాను.

"టెల్ మీ నా యంగ్ మాన్, నేను చేసింది అప రాధమా? మనిషి చేసిన చట్టానికి మానవత్వమున్న మని షిగా నిరపరాధినైన నేను తల ఒగ్గి జీవచ్ఛవంలా జైలు గోడల మధ్య మగ్గి మగ్గి ఒగ్గునై రాలిపోవాలా? చెప్పు!"

సోమేశ్వర్ గొంతులో ఆవేదన, ఆవేశం, ఆక్రోశన అన్నీ ధ్వనించాయి.

సిద్ధార్థ వెంటనే తల అడ్డంగా తిప్పి, "మీరు చేసిందాంట్లో దోషమేమీ కనిపించటంలేదు నాకు. మీ స్థానంలో నేనున్నా అదే పని చేసివుండేవాడిని. ఇక్కడ చీకూచింతా లేకుండా, స్వార్థపూరిత ప్రపంచానికి, కుళ్ళిపోయిన సంఘానికి, బూజుపట్టిన వ్యవస్థకి దూరంగా ప్రశాంతజీవనం గడుపుతున్న మీరు ధన్యులు!" రెండు చేతులూ జోడించి మనస్ఫూర్తిగా నమస్కారం చేశాడు.

సోమేశ్వర్ ముఖంలో వేయి జ్యోత్స్నలు వెలిగాయి. ఆనందంగా సిద్ధార్థ రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"నువ్వయినా నన్నర్థం చేసుకున్నావు యంగ్ మాన్. ....అయామ్ సారీ, నీ పేరేమిమిటో అడగలేదు. అదీగాక నిన్ను ఏకవచనంలో సంబోధిస్తున్నాను, యేమీ అనుకోవు కదా!...."

"నో, నో....వయసులోను అనుభవంలోను యెన్నోరెట్లు పెద్దవారు. మీరు నన్నలా పిలవటం ఆత్మీయతని చాటుతోంది. నా పేరు సిద్ధార్థ....మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను"

"థాంక్యూ! కాసేపట్లో చీకటి పడబోతోంది. చీకట్లు ముసురుకోక ముందే ఆ గ్రామం చేరిపోవటం క్షేమకరం. నావాళ్ళు నిన్నా గ్రామంవరకు చేరుస్తారు, సరేనా?"

"అంతకన్నా నాకు కావలసిందేముంది సర్! మీ మేలు యీ జన్మంతా గుర్తుంచుకుంటాను,"

"పదే పదే నన్ను పొగిడి, నా అతిశయాన్ని పెంచొద్దు మిస్టర్ సిద్ధార్థా! నేను రాగద్వేషాలకి, స్వార్థానికి, సుఖానికి అతీతంగా బతుకుతున్నవాడ్ని. నా చివరిరోజులు ఇలాగే ప్రశాంతంగా గడిచిపోవాలని భగవంతుడ్ని కోరుకుంటూ బతికేస్తున్నాను. ఈ అమాయక ప్రాణులు నన్నో గొప్పవాడిని, మహాత్ముడిని చేసి తమ భక్తిని వెల్లడించుకుంటున్నారు తప్పితే, నేను వీళ్ళ కోసం చేసిందేంలేదు. వీళ్ళ ఋణం నేను తీర్చుకోలేనిది" దూరంగా నించున్న ఆ అనాగరిక వ్యక్తుల్ని చూపిస్తూ అన్నాడు సోమేశ్వర్.

సిద్ధార్థ కళ్ళకి ఇప్పుడా మొరటుమనుషులు భయంకరంగా, అసహ్యంగా కనిపించటంలేదు. మహోన్నత వ్యక్తులుగా నిస్వార్థపరుల్లా, అమాయకుల్లా కనిపిస్తున్నారు.

మనసు కోతిలాంటిది! అది ఎలా ఆలోచిస్తే అలా కనిపిస్తారు ఎదటివాళ్ళు. తనున్న పరిస్థితుల్లో తన నీడను కూడా తానుమానించాడు. కళ్ళకు కనిపించేది మాత్రమే నిజంకాదు. మనోచక్షువుతో చూడగలగాలి! అది సోమేశ్వర్ సాధించాడు. అందుకే ఈ మనుషులకి ఆరాధ్య దైవమయ్యాడు.

సిద్ధార్థ ఇంకా అలాగే నిల్చుని ఆలోచించటం చూసిన సోమేశ్వర్ ఆదరపూర్వకంగా నవ్వి. "ఏమిటింకా సందేహం?" అన్నాడు.

సిద్ధార్థ కోటలోని తన అనుభవం క్లుప్తంగా చెప్పాడాయనకి.

సోమేశ్వర్ భ్రుకుటి ముడిపడింది,

"నువ్వా యువరాణిని, మహారాజుని కల్లో చూశావా?"

"అవునుసర్ .... ఆ తర్వాత మెలకువ వచ్చాక వర్షం వస్తున్న సమయంలో తలదాచుకోవటానికి అదే కోట లోపలికి ప్రవేశించాను. అప్పుడు కూడా నాకు ఆ సుందరి కనిపించింది."

సోమేశ్వర్ ఆశ్చర్యంనించి తేరుకుని, "ఎప్పుడో మూడువందల ఏళ్ళకిందటి రాచవంశస్థులు నీకు కల్లో కనిపించటం, అచ్చం అప్పుడు జరిగినట్టే జరగటం— అంతా వింతగా నమ్మలేని విషయంలా అనిపిస్తోంది...."

"అప్పుడు కూడా ఇలాగే జరిగిందా?"

"అవును. యువరాణి ప్రమద్వరాదేవి ఓ సామాన్యుడ్ని వరించి తన అంతఃపురానికి రప్పించుకున్నది. అది తెలిసిన ఆమె తండ్రి నయాన భయాన చెప్పినా ఆమె తనపట్టు వదలకపోవటంతో తనే స్వహస్తాలతో ఆమెను, ఆమె ప్రియుడ్ని నరికేశాడు. మా తాత ఆ కథని రసవత్తరంగా నాకు ఒళ్ళో కూచోబెట్టుకుని చెప్పటం ఇప్పటికీ గుర్తుంది...."

"అయితే నిన్నరాత్రి నేను చూసిన దృశ్యాలు...."

"అవి కల్లో కాదుకదా!"

"కాదు.... మెలకువగా వున్నప్పుడే జరిగింది. నాకంతా గుర్తుంది."

"ఆనాటి రాకుమారి, ఆమె ప్రియుడు దయ్యాలై ఆ కోటలోని భవనాల్లో తిరుగుతుంటారని చెప్పుకుంటా రిక్కడివాళ్ళు. నేను ఇప్పటివరకు నమ్మలేదు. నీ అనుభవాన్నిబట్టి వీళ్ళు చెప్పుకునేదంతా నిజమేనని నాకిప్పుడు అనిపిస్తోంది. ఆ కోటని అందుకే పాడు పెట్టి వుంటారు."

సిద్ధార్థ సాలోచనగా తలూపాడు, అతనికి కలల్లో

చూసిన దృశ్యాలు యింకా కళ్ళకు కట్టినట్టే వున్నాయి. వాటితో గతరాత్రి అనుభవాన్ని పోల్చుకుంటే సరిగ్గా సరిపోయింది—సోమేశ్వర్ చెప్పినదంతా.

"నాకు సెలవిప్పించండి" చేతులు జోడించి సోమేశ్వర్ కళివాదం చేశాడు సిద్దార్థ.

మనస్ఫూర్తిగా దీవిస్తూ, "యువ్వు క్షేమంగా నీ స్వస్థలం చేరుకుని నీ వాళ్ళతో సుఖంగా వుండాలని కోరుకుంటున్నాను." అన్నాడు.

ఆ తర్వాత ఇద్దరు అనుచరుల్ని పిలిచి ఏం చెయ్యాలో చెప్పాడు.

"నీకు ఆహారంకూడా ప్యాక్ చేసి తెస్తారు వీళ్ళు. కాదనకుండా వెంటతీసుకు వెళ్ళు." అన్నాడు సోమేశ్వర్.

ఆయన ఆదరణకు కళ్ళు చెమర్చాయి. ఆ వృద్ధుడికీ, తనకీ ఏనాటి దీ బంధం? ఆయన నిస్వార్థబుద్ధికి మనసులోనే జోహార్లు అర్పించాడు సిద్దార్థ.

మరో అయిదు నిమిషాల తర్వాత వాళ్ళ ప్రయాణం సాగింది.

వాళ్ళు ఓ అరగంట ప్రయాణం చేశారు.

అప్పుడు ఓ స్త్రీ ఆర్తనాదం వాళ్ల చెవులబడింది.

సిద్దార్థ, అనుచరులిద్దరు వేగంగా అటు ఉరికారు.

• • •

హూలాల్ బిల్లీ తనమీదకు ఉరకటం గమనించిన కోయిల తనకా క్షణంతో ఈ లోకంనించి ఋణం తీరిపోయిందనుకున్నది. ఆ మెకు తెలీకుండానే ఆమె గొంతునించి ఆర్తనాదం వెలువడింది.

అదే ఆమె ప్రాణాన్ని కాపాడింది!

ఆమె జరిగిందేమిటో గ్రహించేలోపల హూలాల్ బిల్లీ

గాల్లోనే ప్రాణాలు సగం వదిలేసింది.

రెండు బల్లేలవంటి కొయ్య కర్రలు దాని శరీరంలో నుంచి బయటకి దూసుకువెళ్ళటం, అది పెద్ద గర్జనతో నేలకూలి పోవటం, చాలా వేగంగా జరిగిపోయాయి.

హలాత్ బిల్లీ ఇంకా కొనప్రాణంతో గిలగిల కొట్టుకుంటున్నది.

సరిగ్గా అప్పుడు పడింది కోయిల దృష్టి వేగంగా పరుగెత్తుకొస్తూన్న ముగ్గురు మనుషులమీద.

వారిలో ముందుగా కనిపించినవ్యక్తి సిద్దార్థ అని గుర్తించగానే ఆనందంతో వెర్రికేక వేసింది కోయిల. ఏమైపోయాడోనని తనంతదాకా భయపడుతున్న సిద్దార్థ సజీవంగా కళ్ళెదుట నిలవగానే ఆనందంతో ఆమెగొంతు పూడుకుపోయింది.

"నువ్వు . నువ్వేనా....?" అంటూ అతనివైపు పరుగెత్తింది.

సిద్దార్థ అంత విచిత్రంగా ఆమెను మళ్ళీ కల్సుకో గలననుకోలేదు. అతనికిది చాలా అద్భుతంగా అనిపించింది.

"కోయిలా....నువ్వా?....చాలా సంతోషం. మేము రక్షించుకున్నది నిన్నేనన్నమాట!.... ఎవరిదో స్త్రీ ఆర్తనాదం వినిపించిన వెంటనే ఇటు పరుగెత్తుకొచ్చాం. సరిగ్గా అప్పుడే ఈ జంతువు చెట్టుమీదినుంచి నీ మీదికి ఉరకటం గమనించాం. ఇదిగో....వీళ్ళిద్దరు మహావేగంగా ఈ ఆయుధాలని గురిచూసి విసిరారు దీనిమీద. వెంటనే నేలకూలిపోయింది. వీళ్ళగురి అసాధారణం!" ప్రశంసగా వాళ్ళిద్దరివైపు చూస్తూ చెప్పాడు సిద్దార్థ.

కోయిలకూడా వాళ్ళిద్దరివైపు అబ్బురంగా చూసింది. తన ప్రాణదాతలు వాళ్ళు! చేతులెత్తి మొక్కింది. గోచీలు తప్ప శరీరంమీద మరే ఆచ్ఛాదనాలేని ఆ కొండరటు మనుషులు దేవతల్లా కనిపించారామెకు.

"నువ్వు క్షేమంగావున్నావు. నాకదేచాలు సిద్దార్థా" అన్నదామె మొదటిసారిగా అతని పేరు నుచ్చరిస్తూ.

వింతగా ధ్వనించిన తన పేరును విని ఆశ్చర్యంగా ఆమెవైపు చూశాడు. ఆమె తనని పేరుతో పిలవటం కాదు అతన్నాశ్చర్య పరచింది—ఆమెపడ్డ ఆవేదన, ఆరాటం ఆ ఒక్కమాటలోనే ప్రస్ఫుటంగా ధ్వనించాయి.

ఎందుకీమెకు తనంటే ఇంత ఆపేక్ష? ఇదేజన్మబంధం? ఆమె తనకేమవుతుంది? తనకోసం ఎందుకింత ఆరాట పడుతోంది?

"నాకు ఘూర్కజాతి సావరం ఏ దిశలో వున్నదో తెలిసిపోయింది. రాత్రి రెండోఝాముకల్లా అక్కడికి చేరిపోవచ్చు." ఉత్సాహంగా చెప్పింది కోయిల.

"మీరిద్దరు వెళ్ళిరండి. సోమేశ్వర్ స్వామికి నా నమస్కారాలు చెప్పండి!" అని అర్థంవచ్చేలా వాళ్ళకి సైగలతో చెప్పాడు సిద్దార్థ.

వాళ్ళు ఒక్క అడుగకూడా కదపలేదు.

"వీళ్ళెవరూ, వీళ్లతో ఎక్కడికి వెళుతున్నావు?"

సిద్దార్థ ఆమెతో జరిగిందంతా చెప్పాడు.

"ఇన్నాళ్లకి నీ దేశం చేరుకునేమార్గం తెలిసినందుకు నాకు చాలా ఆనందంగావుంది. నువ్వెక్కడున్నా నువ్వు సుఖంగా ఆనందంగా వుండటమే నేను కోరుకునేది! వెళ్ళిరా నేస్తం!" అంది కోయిల.

ఆ మాటలంటున్నపుడు ఆమె మాటల్లో లీలగా ధ్వనించిన విచారాన్ని, నిరాశను గుర్తించగలిగాడు సిద్ధార. ఆమె తన సుఖాన్ని క్షేమాన్ని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నది, సందేహంలేదు. కాని ఆమె అదే సమయంలో తన సాన్నిహిత్యాన్ని కూడా కోరుకుంటోంది. అందుకే తను శాశ్వతంగా ఆమెనుంచి దూరమైపోతున్నాడని తెలిసి దుఃఖపడుతోంది.

సిద్ధార స్థిరమైన నిర్ణయంతో చెప్పాడు!

"వీళ్లని వెనక్కి పంపించివేస్తున్నాను కోయిలా! పద, మనిద్దరం ఘూర్కజాతి స్థావరానికి వెళ్దాం."

కోయిల ముఖంలో వేయి జ్యోత్స్నలు ఒక్కసారిగా వెలిగాయి. సిద్ధార నిజాయితీ, మాట నిలకడ ఆమెకు బాగా నచ్చాయి. అయితే అతను కష్టాలపాలు కాకూడదు. కర్తవ్య నిర్వహణలో తన ప్రాణాలుపోవచ్చు. తన మూలంగా అతని ప్రాణానిక్కూడా ప్రమాదం ముంచుకొస్తుంది.

"సిద్ధారా, నువ్వు వీళ్లసాయంతో ఎడారి దాటి క్షేమంగా వెళ్ళిపో! నేను వెళుతున్నాను. ఇదే నీకు నా వీడ్కోలు!" అన్నది కోయిల—స్థిరమైన గొంతుతో.

సిద్ధార ఆమె ముఖంలో వేగంగా కదుల్తున్న భావాల్ని స్పష్టంగా గుర్తించాడు — అద్దంలో చూసినంత స్పష్టంగా!

"వీళ్లభాష నీకు తెలుస్తే వెనక్కి వెళ్ళిపొమ్మని చెప్పు. నేను చెప్పింది వీళ్లకర్థమైనట్టు లేదు." అన్నాడు సిద్ధార.

విస్మయంగా చూసింది కోయిల అతనివైపు.

"నేనేం చెప్తున్నాను, నువ్వేం చెప్తున్నావు? వీళ్లతో నిన్ను వెళ్లమంటున్నాను."

"నేను వెళ్ళదలచుకున్నది వీళ్ళతో కాదు—నీతో. ఇంతవరకు నీ జాడ తెలియక అల్లాడాను. గత్యంతరంలేక నా దారి వెతుక్కుంటూ వెళ్ళిపోవటానికి సిద్ధమయ్యాను. ఇంతలో అదృష్టవశాత్తు నువ్వు కనిపించావు. నా గమ్యం నువ్వే!"

"సిద్ధార్థా, నేను చెప్పేది విను...."

"నీకు నా మాటమీద ఏ మాత్రం గౌరవమున్నా నేను చెప్పినట్టు చెయ్యి."

కోయిల నోటికి టక్కున తాళం పడిపోయింది. అతనలా అన్నాక, ఇక తనేమనగలదు?

వాళ్ళిద్దరివైపు తిరిగి ఏదో అడిగింది కోయిల. అది అంతదాకా సిద్ధార్థ విన్న భాషకాదు. వాళ్ళు వెంటనే సమాధానం చెప్పారు. అదికూడా సిద్ధార్థ కర్థంకాలేదు.

కోయిల అతనివైపు తిరిగి చెప్పింది.

"వాళ్ళ స్వామిమాటను జవదాటలేరట. మళ్ళీ వాళ్ళ స్వామి చెపితేనేగాని వెనక్కి వెళ్ళేదిలేదట. నిన్ను క్షేమంగా గూడెం చేర్చిగాని వెనుతిరగనంటున్నారు."

సిద్ధార్థ నిర్ఘాంతపోయాడు. సోమేశ్వర్ మాట వీళ్ళకి వేదవాక్కు!

సిద్ధార్థ కోయిలవైపు తిరిగి, "వాళ్ళనెలాగైనా తిరిగి పొమ్మని, వాళ్ళు స్వామిమాట మీరినట్టుగాకాదని నచ్చ చెప్పు." అన్నాడు.

కోయిల అంతరాంతరాల్లో సిద్ధార్థ తనతోనే ఉండాలనిపిస్తోంది.

కోయిల చేతులు జోడించి వాళ్ళకు నమస్కరించి ఎంతోసేపు నచ్చ చెప్పాక వాళ్ళు వెనక్కి మళ్ళటానికంగీకరించారు.

వాళ్ళేముందు, హూలాక్ బిల్లీ శరీరంనుంచి మొన తేలిన రెండు కర్రల్ని పైకిలాగి వాళ్ళకిచ్చారు. కోయిలతో ఏదో చెప్పారు. కోయిల చిరునవ్వుతో తలూపింది.

తర్వాత వాళ్ళిద్దరు కోయిల సిద్ధార్థల దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

కోయిల సిద్ధార్థతో ఆ కర్ర ఆయుధాల గొప్పదనం గురించి చెప్పింది. అవి ప్రత్యేకమైన కర్రలతో తయారు చేసిన ఆయుధాలు. వాటి మొన గుచ్చుకున్న మరుక్షణం అవతలి వ్యక్తిగాని, జంతువుగాని గిలగిల కొట్టుకుంటూ మరణించాల్సిందే! అవి అంత శక్తివంతమైనవి.

హూలాక్ బిల్లీవంటి క్రూరజంతువు క్షణాల్లో ప్రాణాలు వదలటం ప్రత్యక్షంగా చూసిన వారిద్దరికీ ఆ మాటల్లోని నిజం బోధపడింది

మరో నిముషానికే వాళ్ళ వెనుకనుంచి హృదయ విదారకమైన ఆర్తనాదం వినిపించింది. ఒకసారి కాదు— రెండు సార్లు.

ఇద్దరు చటుక్కున వెనుతిరిగి చూసి నిర్ఘాంతపోయారు.

సోమేశ్వర్ అనుచరులిద్దరు రెండు హూలాక్ బిల్లీలతో హోరాహోరీ ముష్టియుద్ధం చేస్తున్నారు. అవి రెట్టించిన క్రోధంతో వాళ్ళిద్దర్నీ విపరీతంగా గాయపరుస్తున్నాయి.

ఉన్న రెండు ఆయుధాల్ని తమకిచ్చేసి వాళ్ళిద్దరు ప్రమాదంలో ఇరుక్కుని ప్రాణాలకి తెగించి ఆ రెండిటితోను పోరాడటం చూశాక వాళ్ళిక ఉపేక్షించలేకపోయారు.

వాళ్ళు తమకిచ్చిన కర్ర ఆయుధాలు ఇంకా తమ చేతుల్లోనే ఉన్నాయి.

కోయిల, సిద్ధార గురిచూసి ఆయుధాల్ని హూత్ బిల్లులమీదకు బలంగా విసిరారు ఆవిరెండూ గురి తప్ప కుండా ఆ రెండిటి శరీరాలగుండా దూసుకుపోయాయి.

పెనుగర్జన చేస్తూ అవి రెండూ నేలకూలిపోయాయి.

కోయిల సిద్ధార ఒక్క పరుగున అనుచరుల్ని సమీపించారు. అప్పటికే వాళ్ల పరిస్థితి చెయ్యిదాటిపోయింది. హూత్ బిల్లులు వాళ్లని చాలా దారుణంగా గాయపరచాయి. వాళ్ల శరీరాలు నెత్తుటి ముద్దలావున్నాయి.

కోయిల సిద్ధార వాళ్ళని ఒళ్ళోకి తీసుకున్నారు. అయితే వాళ్ళ ప్రాణాలు అప్పటికే కళ్ళలోకి వచ్చేశాయి.

“మీరు వెంటనే ఈ ప్రాంతం వదిలేసి పారిపోండి. ఈ ప్రదేశమంతా ఈ క్రూరమృగాలు రాజ్యం చేస్తుంటాయి. ఎలాగో మేము వాటిలో ఓ దాన్ని చంపినట్టు యెక్కడున్నంచో చూసి పసిగట్టి మామీద దాడి చేశాయి ఈ రెండు బిల్లులు. యింకా చాలా వుంటాయి. మందలుగా నివసిస్తుంటాయి. మీరు చాలా తొందరగా యీ చోటు వదిలి వెళ్ళిపోండి, ప్రమాదం” అన్నారు వాళ్ళు.

“మీ యిద్దరిని యీ స్థితిలో వదిలి వెళ్ళలేము. సోమేశ్వర్ స్వామి దగ్గరకు మిమ్మల్ని చేరవేస్తాం” అన్నది కోయిల.

వాళ్ళిద్దరు చేతులు జోడించి, “మేమిక బతికేదిలేదు. వృధా ప్రయాస. దయచేసి పారిపోండి.... పారి....” అంతే! వాళ్ళ కళ్ళు యింకా కోయిల సిద్ధారలను చూస్తూన్నట్టే వున్నాయి. కాని శరీరాలు నిర్జీవమయి పోయాయి.

సరిగ్గా అప్పుడే దూరంగా వికృతమైన కూతలు వినిపించాయి వాళ్ళకు.

వాటిని కోయిల వెంటనే గుర్తించింది.

“సిద్ధార్థా, హూణ్ బిల్లీల కూతలు. మనం ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా ఈ స్థలం వదలి వెళ్ళిపోవాలి” అన్నది లేచి నిల్చుంటూ.

ఇద్దరూ హూణ్ బిల్లీల శరీరాల నుంచి బాణం కర్రను పైకి లాగి చేత ధరించారు. కోయిల ముందు పరుగెడుతుంటే ఆమెతో సమానంగా సిద్ధార్థ కూడా పరుగెడుతున్నాడు.

* * *

దాదాపు ఓ గంటసేపు వాళ్ళు అలా పరుగులు పెడుతూనే వున్నారు. అప్పటికి పచ్చిక బయలు పూర్తిగా అంతమైపోయింది.

ఎదురుగా ఇసుకతిన్నెలు ప్రత్యక్షమయ్యాయి. ఎడారి ప్రారంభమయింది.

“మనం ఘోర్క్. బందిపోట్ల స్థావరంనించి బాగా ముందుకి, పచ్చిక మైదానాల్లోకి విసిరివేయబడ్డాం తుఫాన్ కారణంగా. ఇప్పుడు మళ్ళీ వెనక్కి ప్రయాణం చేస్తున్నాం. నా అంచనా ప్రకారం ఈ రాత్రి తెల్లవారకుండానే మనం వాళ్ళ స్థావరం చేరుకోగలం” అంది కోయిల.

సూర్యాస్తమించి దాదాపు అరగంట అయినా, బహిరంగస్థలం కావటంవల్ల చీకట్లు ఆవరించుకోలేదింకా. సమయం ఆరున్నర గంటలయివుంటుంది.

పరుగెత్తటంవల్ల సిద్ధార్థ బాగా అలసిపోయాడు. అయితే కోయిల ఏమాత్రం అలసట చెందలేదు. కారణం

చెమటలతో ఆమె నుదురంతా తడిసిపోయింది. ఆమె ధరించిన దుస్తులు కూడా అక్కడక్కడ తడిశాయి.

కోయిల పానుచెవులకు ఎక్కడి నుంచో అనుమానా స్పదమైన గురక వినిపించింది.

చటుక్కున ఆగిపోయి సిద్ధార్థను కూడా చేయిపట్టి ఆపేసింది.

వాళ్ళకి చాలా దగ్గర్లోనే ఇసకలో దాక్కునివున్న ఆకారాలు ఆమె చాలా షార్ప్‌గా గుర్తించింది.

"సిద్ధార్థా, చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. మొన్న నామీద దాడిచేసిన ఎడారి భల్లూకం నీకు గుర్తుండే వుంటుంది. ఇప్పుడు మరో రెండింటిని మనం యెదుర్కోవలసి వుంటుంది. సిద్ధంగా వుండు" అని ఆమె అంటూండగానే ఎడారి భల్లూకాలు లేచి నిల్చున్నాయి.

ఇసక దులుపుకుని గాల్లోకి యెగిరాయి. వాటిని చూస్తూనే అదురుపుట్టింది సిద్ధార్థకి. తను గతంలో నేల కూల్చిన భల్లూకంకన్నా ఆకారంలో పెద్దవి. వాటిని చూసినంత మాత్రనే కొత్తవాళ్ళు, పిరికివాళ్ళు ప్రాణం వెంటనే వదిలేస్తారు. అలా వున్నాయి వాటి ఆకారాలు.

ఒంటినిండా నల్లని బొచ్చుతో, పొడవాటి మూతితో భయంకరంగా, అసహ్యంగా వున్న భల్లూకాలు వాళ్ళ మీదికి ఉరుకుతున్న సమయంలోనే చాలా వేగంగా పని చేశారు కోయిల, సిద్ధార్థ.

తమమీది ఉరుకుతున్న భల్లూకాల పొడవాటి మూతుల్లో బాణంకర్రలని దించేశారు.

అంతే! ఎడారిలోని ఇసక పెనుతుఫాన్‌ని సృష్టించినంత

పెడబొబ్బలతో భల్లూకాలు కిలకిలాలాయి.

కొంతసేపటి వరకు వాటి గర్జనలు ఆ ప్రదేశంలో మార్మోగుతూనే వున్నాయి.

ఎడారి భల్లూకాలతో తమకిది మూడో అనుభవం. మొదటిసారి తను కోయిలని ఓ భల్లూకంనుంచి కాపాడాడు. మరోసారి వీటి నెదుర్కొనే శక్తిలేక తవాళ్లా ఇసకలో పడుకుని ఊపిరి బిగబట్టి వాటి బారినుంచి తమని కాపాడుకున్నారు. మరోసారి వాటిని ఎటాక్ చేసి ధైర్యంగా నిలిచారు—గెలిచాల్చారు.

కోయిలకి చాలా ఆనందంగా వుంది.

"మనం దారితప్పలేదు. ఎడారిభల్లూకాలు ఇసక మేటల్లో దాక్కొని వుంటాయి. వాటి నివాసస్థలాలకి ఘోర్ బందిపోట్ల స్థావరం చాలా దగ్గర. అంటే యిక్కడికి చాలా సమీపంలోనే మన శత్రువులున్నారన్నమాట!" అంది.

గతంలో కూడా తామిలాగే బందిపోట్ల స్థావరానికి అతి దగ్గరలోకి వచ్చాక ఇసకతుఫాన్లో చిక్కుకుపోయారు. అప్పుడు కూడా కోయిల యిలాగే ఆనందపడిపోతూ చెప్పింది—దగ్గరకొచ్చేశామని. ఆ మాటలు గుర్తుకు వచ్చాయి యిప్పుడు సిద్ధార్థకి.

వెన్నెల పుచ్చపువ్వులా కాస్తోంది. వెన్నెల వెలుగులో ఇసక మేటలు చిత్రకారుడు చిత్రించిన పర్వతసానువుల్లా వున్నాయి.

భల్లూకాల శరీరాల్లోంచి బాణం కర్రల్ని పైకి లాగి మళ్ళీ చేతధరించారు వాళ్ళు.

నిజంగానే ఆ కర్ర ఆయుధాల వాడి తిరుగులేనిది. ఏ జంతువు శరీరంలో నాటినా ఆ మరుక్షణం ప్రాణాలు

వణలేసి నిర్జీవమై పోతున్నది. చాలా ప్రత్యేకంగా తయారుచేసుకున్న ఆయుధాలవి! వాటితో తమ ప్రాణాలు అనుక్షణం కాపాడుకుంటున్నారు. కాని వాటిని తయారు చేసినవాళ్ళు మాత్రం అమానుషంగా, దారుణంగా బిల్లల వాతబడి ప్రాణాలు పోగొట్టుకున్నారు.

సోమేశ్వర్ స్వామి అనుచరుల్ని తలచుకోగానే సిద్ధార్థకి గుండె బరువెక్కింది.

“అలా వుండిపోయావేమిటి? ముందుకు సాగుదామా?” అన్న కోయిల మాటలతో ఆలోచనల్లోంచి బయటపడ్డాడు.

ఇద్దరూ మళ్ళీ కాలు కదిపారు.

అప్పుడు ఆకస్మాత్తుగా గుర్తుకు వచ్చిందతనికి, కోయిల యేమీ ఆహారం తీసుకొని వుండదని! సోమేశ్వర్ తనకి మూట కట్టించి యిచ్చిన ఆహారం గుర్తుకు వచ్చింది. అది తన భుజానికే వేలాడుతున్న విషయం కూడా మరిచాడు.

మూట విప్పి ఆమె ముందుంచాడు. కోయిల విస్మయంగా చూసింది. బాగా పచనం చేయబడ్డ దుప్పి మాంసమూ, అరముగ్గిన పళ్ళూ ఘుమఘుమలాడుతున్నాయి.

“తిను!” అన్నాడు సిద్ధార్థ.

ఆమె తల అడ్డంగా తిప్పి, “ఊహూ! శత్రువుల్ని సర్వనాశనం చేసేవరకు అన్నపానాలు ముట్టను—” అన్నది.

సిద్ధార్థ మందలిస్తున్న ధోరణిలో అన్నాడు: “వాళ్ళని నాశనం చెయ్యాలంటే మనకెంతో శక్తి అవసరం. ఒంట్లో జవసత్వాలు లేకుండా వాళ్ళనెలా యెదిరించి

పోరాడతావు?"

ఎంతగానో నచ్చచెప్పగా చివరికి అతి తక్కువగా తీసుకొన్నది కోయిల.

మళ్ళీ ఇసుకపురి పయనం కొనసాగింది.

*   *   *

ఒకటి రెండుచోట్ల గోధుమవన్నె త్రాచులు వాళ్ళ కెదురైనా వాళ్ళనేమీ చెయ్యకుండా దూరంగా తొలగి పోయాయి. కోయిల చేతికున్న మూలిక ప్రభావమా? 'ఏమో, కావచ్చు!' అనుకున్నాడు సిద్ధార్థ.

దూరంగా గుడ్డిదీపాల కాంతి మసక మసకగా కని పిస్తుంటే కోయిల ఆనందంలో చిన్నపిల్లలా కేరింతలు కొట్టింది.

"అదే ఘూర్కా బందిపోట్ల స్థావరం! ఇంకో గంటలో మనమక్కడికి చేరిపోగలం!"

ఆమె ఆనందం చూసి సిద్ధార్థ మనస్ఫూర్తిగా సంతో షించాడు. ఆమె ప్రతిన చెల్లబోతోంది. అందుకు తన కృషి కూడా తోడవుతున్నందుకు. ఆ బృహత్కార్యంలో తను కూడా పాలుపంచుకుంటున్నందుకు అతనికి చాలా గర్వంగా వుంది.

'దారిలో యింకెలాంటి ఆటంకాలు లేకుండా బంది పోట్ల స్థావరం చేరగలిగేలా చూడు భగవాన్!' అని మొదటిసారిగా భగవంతుణ్ని గాఢంగా ప్రార్థించాడు సిద్ధార్థ.

మరో గంట తర్వాత వాళ్ళు ఆ దీపాలు కనిపిస్తున్న ప్రాంతానికి మరింత చేరువయ్యారు.

కోయిల అడుగుతీసి అడుగు వేసినప్పుడల్లా కావన్‌గా చెవులు దోరబెట్టి వింటున్నది—ఎడారి భయ్యాకాల

గురక కోసం. అయితే మళ్ళీ వాటి జాడ ఎక్కడా కని పించలేదు.

సిద్ధార కూడా ప్రతిక్షణం ప్రమాదాన్నెదుర్కొనటానికి మానసికంగా సన్నిద్ధమై వున్నాడు. ఇద్దరి చేతుల్లోనూ బాణం కర్రలు తప్ప మరే ఆయుధమూ లేదు. అయితేనేం. ఆయుధాలని మించిన ఆత్మబలం, గుండె ధైర్యం పుష్కలంగా వున్నాయి.

అంతకంతకు దీపాల కాంతి చేరువయ్యింది. అక్కడ నుంచి ఇసక మేటలు మరింత ఎత్తుగా పర్వతాల్లాగా వాళ్ళ కడ్డు నిలిచాయి. అవతలివైపు ఏ క్రూరమృగం పొంచి వున్నా తెలుసుకోవటం చాలా కష్టం.

మరింత ప్రమాదభరితమైన ప్రాంతం చేరుకుంటున్నామని ఇద్దరు గ్రహించారు.

మరి కాస్త దూరం అలాగే మౌనంగా నడిచారు. మాట సవ్వడివల్ల కూడా శత్రువులు తమ జాడ తెలుసుకుంటారని, క్రూరజంతువులు పసికడతాయని వాళ్ళు నోరు విప్పటంలేదు.

అప్పటికి అర్ధరాత్రి సమయమయింది. అంతటా భయంకరమైన నిశ్శబ్దం. ఆకాశంలో ఒక్క మబ్బుతునక కూడా లేని కారణంగా చంద్రుడి కాంతి జాజ్వల్యమానంగా ఇసకలో ప్రతిఫలిస్తోంది. వాతావరణంలో యేలాంటి మార్పూ లేదు.

అయితే ఆ ప్రశాంతత భయంకరంగా వుంది. తుఫాన్ రాబోయే ముందు సముద్రమెంత శాంతంగా వుంటుందో, అప్పుడా ఎడారి కూడా అలాగే నిశ్శబ్దంగా, ప్రశాంతంగా వుంది.

మరో అరగంట అలాగే ఇసకలో పడుతూ లేస్తూ

నడుచుకుంటూ నాలుగా వున్న ప్రదేశం చేరుకున్నారు.

అక్కడ బండరాళ్ళు పెట్టనికోటలా చుట్టూ వలయాకారంలో అమర్చివున్నాయి. వాటిమధ్య దాదాపు వందకిపైగా ఇళ్ళు. వెన్నెల వెలుగులో స్పష్టంగా చూశారు సిద్ధార్థ, కోయిల.

తాము చూసిన దీపాలు ఆ ఇళ్ళలోనించి బయటకి కనిపిస్తున్నాయి.

"అవే. ఘూర్ఖ బందిపోట్ల నివాసగృహాలు. ఇవాళ్ళకి ప్రత్యక్షంగా చూశాను. ఈ నాటితో ఈ ఎడారి వాసులందరికీ ఈ దుష్టుల బెడద శాశ్వతంగా తప్పిపోతుంది" అన్నది, కోయిల పళ్ళు బిగించి.

ఆమె కసి, కక్ష, ప్రతీకార వాంఛ—ఆమె ముఖంలో స్పష్టంగా ప్రతిఫలించటం గుర్తించాడు సిద్ధార్థ.

"ఇవే ఆ బందిపోట్ల నివాసగృహాలని ఖచ్చితంగా ఎలా చెప్పగలవు? ఇది ఎడారిలోని ఇరవైఎనిమిది గూడేల్లోనూ ఒకటేమో...." సందేహం వెలిబుచ్చాడు సిద్ధార్థ.

"ఈ ఎడారిలో బండరాళ్ళతో కోటకట్టుకున్న గూడెం ఏదీ లేదు—ఒక్క ఘూర్ఖ జాతి గూడెం తప్ప! అదిగో అక్కడశాలల్లో విశ్రాంతి తీసుకుంటున్న ఒంటెల్ని చూశావా? దాదాపు వందకిపైగా వుంటాయి. ఏ గూడెంలోనూ నాలుగైదుకన్న ఎక్కువుండవు. ఒకోక్క గూడెంలో ఒక్కటికూడా వుండదు. అదే బండ గుర్తు. అదీకాకుండా, ఘూర్ఖ బందిపోట్ల స్థావరం దగ్గర ఎన్నడూ ఇంకిపోని నీటి చెలమవున్నది. అదిగో కనిపిస్తోంది, చూశావా?...."

ఆమె ఇంకా ఏదో చెప్తుండగానే ఎక్కడినుంచో

నాలుగు ఒంటెలమీద బరువైన మూటలు వేసుకుని గూడెంలోకి ప్రవేశించారు నలుగురు వ్యక్తులు.

వాళ్ళని చూడగానే సిద్ధార్థ సందేహాలన్నీ నివృత్తమయిపోయాయి.

వాళ్ళు ఘోర్క్ బందిపోట్లుగా వెంటనే గుర్తించాడతను. గతంలో సుస్మితని చంపిన రాక్షసుడు ఈ జాతివాడేనని గుర్తుకురాగానే అతని నెత్తురు సలసలమరిగింది. ఆ క్షణమే ఆ ఇళ్ళల్లో నిద్రిస్తున్న బందిపోట్లని, వాళ్ల సంతతిని సమూలంగా నరికి పారెయ్యాలనే వీరావేశాన్ని బలవంతాన అదిమిపట్టుకున్నాడు.

ఆ బందిపోట్లకి కనిపించకుండా ఓ పెద్ద బండరాయి వెనక దాక్కున్నారు కోయిల, సిద్ధార్థ.

వాళ్ళు ఒంటెలమీదినుంచి దిగి, వాటి మూపుల మీదున్న మూటల్ని దింపుకుని ఓ ఇంటిలోపలికి తీసుకుపోయారు.

సిద్ధార్థ ప్రశ్నార్థకంగా చూశాడామెవంక.

కోయిల చాలా తీవ్రంగా ఆలోచిస్తోంది. ఒకేసారి ఆ గూడెంవాసులందర్నీ సమూలంగా నాశనం చేయటానికి పథకాన్ని రూపొందించుకుంటోంది.

తమవద్ద కొయ్యాకత్రలు తప్ప మరే ఆయుధాలు లేవు. వాటితో కొన్నివందలమందిని సంహరించటం జరిగే పని కాదు. ఏదో ఉపాయంతో వాళ్ళని సమూలంగా మట్టుబెట్టాలి.

ఎలా? ఇంతమందిని ఒకేసారి ఎదురు తిరక్కుండా నాశనం చెయ్యటం ఎలా?

అదీ ఆమెని వేధిస్తున్న సమస్య.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 80/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

సిద్ధార్థ కూడా వాళ్ళకి చిక్కకుండా వాళ్ళందర్నీ ఎలా సంహరించాలా అని ఆలోచిస్తున్నాడు. కోయిల ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. కాని ఆమె దీర్ఘంగా ఆలోచిస్తూ ఎటో సీరియస్‌గా చూస్తోంది. తపోనిష్ఠలో వున్న మునిబాలికలా వుంది.

ఆమె మస్తిష్కంలో ఎన్నో ఆలోచనలు చెలరేగుతున్నాయి. నిద్రపోతున్న వాళ్ళను చంపటం వీరుల కుచితంకాదు. పైగా ఎందరో పసివాళ్ళు, ముసలి వాళ్ళు, స్త్రీలు నిశ్చింతగా, అమాయకంగా నిద్రపోతుంటారు. బందిపోట్ల భార్యలు, తండ్రులు, బిడ్డలు అయిన పాపానికి గాను వాళ్ళుకూడా బలై పోవాలా? ఇదెంతవరకు న్యాయం?

ఇదీ ఆమెను వేధిస్తున్న సమస్య! అంతవరకు కక్షతో, ప్రతీకార వాంఛతో, పగతో రగిలిపోయిన ఆమె హృదయంలో ఏ మూలనో రవంత జాలికూడా తలెత్తి ఆమె ఆలోచనల్లో స్థానం సంపాదించుకున్నది.

ఆమె తన సందేహాన్ని సిద్ధార్థతో గుసగుసగా చెప్పింది.

సిద్ధార్థ విస్మయంగా చూశాడా మెవంక.

ఈమె హృదయం ఎంత సున్నితం! శత్రువులగురించి కూడా సుహృద్భావంతో ఆలోచించేవాళ్ళెవరుంటారు? నిజమే బందిపోట్లు చేసిన నేరాలకి వాళ్ళ స్త్రీలు, పిల్లలు ఎంతవరకు బాధ్యులు? ఆన్నం పున్నం ఎరగని వాళ్ళని కూడా ఆ బందిపోటు రాక్షసులతో బాటు సంహారించటం రాక్షసత్వమనిపించుకోదూ?!

"నీ వాదనతో నేను ఏకీభవిస్తున్నాను కోయిలా...."

అన్నాడు లోగొంతుతో సిద్ధార్థ.

అతని నోట మొదటిసారిగా పలుకబడిన తన పేరు అంత మధురమైనదనే విషయం అప్పుడే మొదటిసారిగా గుర్తించిన కోయిల ఆనందంతో అతనివంక చూసింది.

ఇరువురి కళ్ళు కలుసుకున్నాయి.

కోయిల గుండెల్లో ఆనందం లబ్ డబ్ మని శబ్దం చేసింది.

అంతలోనే మళ్ళీ సీరియస్ అయిపోయింది తన కర్తవ్యం వెన్నుతట్టి జాగృతం చేసింది.

"అయితే ఏంచేద్దాం? బందిపోట్లని మాత్రమే సంహరించి తక్కినవాళ్ళని వదిలేద్దామంటావా?" అన్నది కోయిల. ఆమెకు పరిష్కారం తోచటంలేదు.

సిద్ధార్థ ఏదో చెప్పటానికి నోరు తెరిచాడు. సరిగ్గా అప్పుడే వాళ్ళ వెనుక చిన్నగా శబ్దమయ్యింది.

చివ్వున తల తిప్పి చూసింది కోయిల. సిద్ధార్థ కూడా వెనక్కి చూసి నిర్ఘాంతపోయాడు.

అక్కడ బందిపోటు ఒకడు చేత పొడవైన పదునైన పట్టాకత్తి ధరించి నిల్చున్నాడు. ఎప్పుడు వచ్చాడో ఏమో వాళ్ళకర్థంకాక అయోమయ స్థితిలో అచేతనంగా నిల్చుండిపోయారు క్షణం.

సరిగ్గా అప్పుడే ఆ బందిపోటు ఒక్కసారిగా వాళ్ళ మీద కురికాడు; కత్తిని సూటిగా సిద్ధార్థ మీదికి విసిరాడు.

* * *

"మీరా?" అన్నది సంభ్రమంగా దివ్య.

సుశీల్ నవ్వుతూ నిల్చున్నాడు బయట.

# శ్రీ మహాలక్ష్మి వారి వైరైటీ నవలలు

## విడుదలైనవి !

1. నిశాంత యద్దనపూడి సులోచనారాణి 25-00
(డైరెక్టు నవల)

2. ప్రమాదాల్లో - ప్రమదలు నవీన్ 30-00
(స్వాతి వీక్లీ సీరియల్)

3. అన్వేషణ వి. యస్. రావ్ 20-00
(అపన సీరియల్)

4. మానసిక సమస్యలు డా॥ ఇండ్ల
సమాధానాలు రామసుబ్బారెడ్డి 20-00

తప్పక చదవండి!

నేడే అడ్వాన్సుతో పాటు ఆర్డరు పంపండి.





"లోపలికి రావచ్చునా?" అన్నాడు.

గుమ్మంలో అడ్డు తొలగి, "రండి!" అన్నది దివ్య మర్యాదకి.

తను రావటం ఆమె కిష్టం లేదని అప్రసన్నంగా ఆమె ముఖమే చెపుతోంది.

సునీల్ అదేమీ పట్టించుకోకుండా, "సిద్దార్థ గురించి మాట్లాడాలని వచ్చాను" అన్నాడు, ఆమె చూపిన సోఫాలో కూచుంటూ.

దివ్య ముఖంలో అయిష్టత స్పష్టంగా ప్రకటిత మయింది.

"మీకు ముందే చెప్పాను, ఇకమీదట అతని గురించిన ప్రస్తావన నా ముందు తీసుకురావద్దని. అతనితో నా కెలాంటి సంబంధం లేదు. అతని విషయంలో నాకు ఇంట్రస్టు లేదు" అన్నది ఖచ్చితంగా.

"ఆ విషయం నాకు తెలుసు—ప్రేమించిన అందాల రాశిని కాదని, ఓ చవకబారు ఎయిర్ హోస్టెస్‌తో రహస్యంగా శృంగారం జరుపుతూ ఆమెతో వెళ్ళిపోయిన మగాడ్ని ఏ ఆడదీ క్షమించదు. ఎక్కడో వాళ్ళిద్దరూ హాయిగా కొత్త జీవితం ప్రారంభించి వుం...."

"సారీ, సునీల్ గారూ! మీ రీ విషయమే యింకా మాట్లాడదలచుకుంటే వినటానికి నేను సిద్ధంగా లేను. మీరు వెళ్ళొచ్చు" లేచి నిల్చుంది దివ్య.

సునీల్ తొందరగా ఆమె చేయిపట్టి ఆపుతూ "మీతో మాట్లాడాలని వచ్చాను. నన్ను నిరాశపరచకండి" అన్నాడు.

(ఇంకా వుంది)

